# కీడుల సమస్య

మూలం:

ఫ్రాన్సువా పెటిట్, ఓ ప్రైమ్

అనువాదం:

ఫా॥ కె. ఇన్నయ్యాస్వాములవారు

# కీడుల సమస్య

మూలం:

ఫ్రాన్సువా పెటీట్, ఓ ప్రైమ్

అనువాదం:

ఫా॥ కె. ఇన్నయ్యస్వాములవారు

# వి ష య సూ చి క

పేజీ

# పరిచయము

అనాదిగా బాధల సమస్యను గూర్చి పలువురు మేధావులు బహు దృక్కోణములనుండి తర్కించి నిగ్గు దేల్చుటకు యత్నించిరి. సుప్రసిద్ధ రచయితలందరు, తాత్వికులేమి—తార్కికులేమి—వేదాంతులేమి—శాస్త్రవేత్తలేమి— దీనిని స్పృశించకుండిన వారుకారు. మానవ చరిత్రలో నిది యొక తీరని సమస్యయని చెప్పక తప్పదు.

విశేషించి జనసామాన్యములు తమ దైనిక జీవితమందు దీని నెదుర్కొనుచునే యున్నారు. కొన్ని యెడల, క్రైస్తవ మత విశ్వాసమునకు, భక్తి తత్పరతల కిది యొక యవాంతర మని చెప్పినను, అత్యుక్తి కానేరదు. కాన భగవదస్తిత్వము నకు మానవ వ్యథలకు గల సంబంధ బాంధవ్యములను వితర్కించి భగవత్ప్రేమతో సమన్వయ పరచుట కడుముఖ్యము. "మన యెడల సర్వేశ్వరునికి గల ప్రేమ నెఱిగిన వారలమై దాని నిమిత్తము నిరీక్షించుచున్నాము. భగవంతుడు ప్రేమ స్వరూపి." జ్యా: - 6.

తొలుత వ్యథల సమస్యను సహేతుకముగా విమర్శించి తదనంతరము వేదశాస్త్రానుగుణముగా పరిష్కార మార్గముల

నన్వేషించుట సమంజసము. తత్ఫలితముగా ఆచరణ యోగ్య ములైన కొలది నైతిక సూత్రములు వెలువడగలవు.

మరియు ఈ సమస్య ఆది సంపతుల పతనము, స్లీవ మరణముతో గూడిన జగద్రక్షణ ఉద్యమము, మహిమాన్విత పునరుత్థానము ఇత్యాది వేదరహస్యములతో ముడివడియున్న దని మరువరాదు. అందువలన నీ గ్రంథసారాంశమే క్రైస్తవ మత ప్రబోధమనియు వ్యవహరించవచ్చును. అస్తిత్వ రహిత మగు అశుభానుభవము ఆస్తిక్యతకు మార్గ ప్రదర్శకమగును. ఇట్టి దుర్భర యాతనలు దైవ సాక్షాత్కార అనుభూతికి దోహద మియ్యగలవు. స్లీవయే దివ్య జీవితమునకు లక్ష్యము. "సాటి లేని మేటి లోకోద్ధారకుని ప్రసాదించిన ఓ ఆదిదోషమా, నీవెంతటి సుఖదాయినివి" ... అన్నటువంటి మహత్తర సూక్తులలో వ్యథల పరిష్కృతి నిండి నిబిడీకృతమైయున్నది.

ఈ గ్రంథము క్రైస్తవులకే గాక క్రైస్తవేతరులకు సహితము బాధోపశమనమును చేకూర్చి ఆత్మవిశ్వాసమును జనింప చేయునను నాసతో కడు వ్యయ ప్రయాసలకోర్చి ప్రచురించుటకు ఉద్యమించితిమి. ఆంధ్రలోకము—అందులో క్రైస్తవలోకము దీనిని ఆదరించి, స్వీకరించి అధ్యయనము చేయునని నిరీక్షించుచున్నాము.

భగవంతుడు మీ పారమార్థిక చింతనకు చేయూత యొసంగి మిమ్మాశీర్వదించుగాక.

గుంటూరు + ముమ్మడి ఇగ్నేషియస్, డి.డి.

- - 2 గుంటూరు పీఠాధిపతి.

# ౫ అ ధ్యా య ము

## ఒక సమస్యా లేక వేద రహస్యమా?

యుక్తాయుక్త విచక్షణగల వ్యక్తులందరి కొక అరని చిక్కుసమస్య. ఈ యనంత విశ్వమందుగల గోళకోటులను, నక్షత్రరాసులను, వాని క్రమానుగత పరిభ్రమణముల పరిశీలించిన మేని సృష్టికర్తయొక్క విజ్ఞానచాతురీగరిమలు గోచరించక మానవు.

క, దైనికశాస్త్ర పరిశోధనల ఫలితముగ తెలియవచ్చిన అద్భుతసృష్టి రహస్యము లెన్నియో మానవకళ్యాణమునకు దోహదకారులై, భగవత్ కళా నైపుణ్యములను ప్రకటించుచున్నవికదా ఒక్కమాటలో, ఈ సువిశాల ప్రపంచమంతయు సార్థకమని తెలియుచున్నది. "భూమ్యాకాశములు నీమహిమాద్భుతముల చాటుచున్నవి; దిగంతములు మీ సుందర లావణ్యముల ఘోషించుచున్నవి." అని దావీదు సార్వభౌముడు నుడివినవార్త లెంత భావగర్భితములో యోజింపుడు

అయినను, ఈ విచిత్రజగత్తునందు మేలుతో సహా దును కలదని గుర్తించక మానము. సుఖసౌఖ్యములకుతోడు కష్టనిష్ఠురములును కలవు. ఖేదమోదములు, కలిమి-ములు కావడికుండ లందురు కదా కొన్నియెడల, యీ మానసిక దైహిక వవేదనలకు మానవ దుష్కృతములు హేతు

భూతములని తెలియకుండుటలేదు. అనగా మానవుడు స్వేచ్ఛాపూర్వకమగు తన పాపదోషముల మూలమున సృష్టిక్రమమును భగ్నము చేయుచున్నాడని విశదమగుచున్నది. పాపదోషములు ఏతత్ క్రూర ఫలితములు మనకు దినదినానుభవములు. ఈ రెంటి గల సంబంధబాంధవ్యముల నిర్వచించుటయే మన వర్తమాన కర్తవ్యము.

సర్వోత్తముడగు భగవంతు డీ భీభత్సము నేల జరుగనిచ్చును? శ్రీమంతుడగు సర్వేశ్వరు డీ విశ్వసంక్షోభమును గాంచి మిన్నకుండునా—అని కొంద రాక్షేపింతురు.

కొన్నియెడల మన మనస్సు పరిపరివిధముల చరించునపుడు, సృష్టిజాతములన్నియు లోపభూయిష్టములని తోచును. ఎటుచూచినను పరిస్థితు లతిక్రమించినటుల గాన్పించును. వేయేల సమస్తభూతములు వక్రమార్గమునుబట్టినటుల గోచరించును అట్టితరి మనకు హృదయవిదారకమగు వేదనలు కలుగును; ఖిన్నులమై చరించుచుందుము; వ్యథాభరితుల మగుదుము. ట్లు ఏదోయొకరీతిని యీ సమస్యలను నిత్యము ఎదుర్కొనుచునేయున్నది.

కాబట్టి వ్యథల సమస్యకు పరిష్కారమార్గముల కనుగొనుటకు యత్నించుదము. ఇందులో కొన్ని మనలను ప్రశాంతకాలమున సంతృప్తిపరచగలవు. మరికొన్ని మన యాత్మ చింతాక్రాంతమగుతరి, వ్యర్థయూహలుగా కనుపించును. కావున మేలు ములను గూర్చి ఇదమిద్ధమని నిర్ణయిం

చుట కష్టతరమా—లేక డొక వేదరహస్యమా—అన్న ప్రశ్నలకు సమాధానము లిందు పొందుపరచబడినవి.

డొక వేదరహస్యమే కాని దైవావిష్కరణ మూలమున తెలియవచ్చినదికాదు. పరమ త్వము, భగవదవతార పరమరహస్యములు దైవదత్తములు. ఇవి మన మానసమందు అనంత సమస్యలను రేకెత్తించుచున్నవి. శృతులు, వేదాధ్యయనములవలన, యీ జటిలసమస్యలు కొంతవరకు వెలుగొందుచున్నవి. న్యాయసమ్మతములని విశదమగుచున్నవి. ఆత్మవికాసమునకు భక్త్యానురక్తులకు హేతుభూతములగుచున్నవి.

కాని అశుభసమస్య దైవావిష్కరణ సహాయ్యము లేకయే యుత్పన్నమగుచున్నది. శుభకర యీ యనంత విశ్వమందు అశుభమేల వాటిల్లినది—అన్న ప్రశ్న ప్రతి పదార్థము తెలిసియు దాని లోతుపాతు లెఱుగక యున్నాము.

ఈ సమస్యా పరిష్కారమునకు పూర్వ, నూతన వేదములు సంపూర్తిగా సహాయ్యపడజాలవు. స్లీవపై నసువుల బాసిన జగ దక్షకుని ప్రతిమను ఆలింగనముచేసి బాధోపశమనమును పొందినంతమాత్రమున సమస్య పరిష్కారము కాదు కదా ఇస్లే తాత్వికులు చేసెడి సూచనలన్నియు బాధోపశమనమును, ఆత్మశాంతిని చేకూర్చలేవుకదా ?

కాబట్టి షు నొక సమస్యగను, వేదరహస్యముగను పరిగణింపవచ్చును. శృతుల సహాయ్యము లేకయే ఆలోచన శక్తి దానిని గూర్చి తెలిసికొనవచ్చును. కావున అదియొక

చుట కష్టతరమా—లేక ఒక వేదరహస్యమా—అన్న ప్రశ్నలకు సమాధానము లిందు పొందుపరచబడినవి.

ఒక వేదరహస్యమే కాని దైవావిష్కరణ మూలమున తెలియవచ్చినదికాదు. పరమతత్త్వము, భగవదవతార పరమరహస్యములు దైవదత్తములు. ఇవి మన మానసమందు అనంత సమస్యలను రేకెత్తించుచున్నవి. శృతులు, వేదాధ్యయనములవలన, యీ జటిలసమస్యలు కొంతవరకు వెలుగొందుచున్నవి. న్యాయసమ్మతములని విశదమగుచున్నవి. ఆత్మవికాసమునకు భక్త్యానురక్తులకు హేతుభూతములగుచున్నవి.

కాని అశుభసమస్య దైవావిష్కరణ సహాయ్యము లేకయే యుత్పన్నమగుచున్నది. శుభకర యీ యనంత విశ్వమందు అశుభమేల వాటిల్లినది—అన్న ప్రశ్న ప్రతి పదార్థము తెలిసియు దాని లోతుపాతు లెఱుగక యున్నాము.

ఈ సమస్యా పరిష్కారమునకు పూర్వ, నూతన వేదములు సంపూర్తిగా సహాయ్యపడజాలవు. స్లీవపై నసువుల బాసిన జగద్రక్షకుని ప్రతిమను ఆలింగనముచేసి బాధోపశమనమును పొందినంతమాత్రమున సమస్య పరిష్కారము కాదు కదా ఇట్లే తాత్వికులు చేసెడి సూచనలన్నియు బాధోపశమనమును, ఆత్మశాంతిని చేకూర్చలేవుకదా ?

కాబట్టి ఇది నొక సమస్యగను, వేదరహస్యముగను పరిగణింపవచ్చును. శృతుల సహాయ్యము లేకయే ఆలోచన శక్తి దానిని గూర్చి తెలిసికొనవచ్చును. కావున అదియొక

# 2వ అధ్యాయము

## వ్యథల సమస్య - పౌరాణిక పరిష్కృతులు

ఓం ప్రథమముగా పౌరాణిక కథలు, సాంకేతిక రచనలు, ప్రసిద్ధ సాంప్రదాయములు, వ్యథల సమస్యను పరిష్కరించుటకు యత్నించినటుల ప్రబల నిదర్శనలు కలవు. ఇవి యన్నియు ప్రబంధములందు పొందుపరచబడి మోదాంతములుగను ఖేదాంతములుగను వెల్లివిరిసినవి.

గ్రీకుభాషలో దీని సంబంధించిన పెక్కుగాథలున్నవి. ప్రొమేతెయుస్ స్వర్గానలమును దేవతలనుండి అపహరించి, మానవుల కందజేసిన గాథ; ఒలింపస్‌పై దాడిచేయుటకు రాక్షసుడు ఓస్సాపై పెలియోనును పేర్చినకథ, పందోర పేటిక వృత్తాంతము యిత్యాది పురాణ రచనలన్నియు యీ సమస్యకుసంబంధించినవే. గ్రీకు తత్త్వవేత్త ప్లేటో 'తిమేయుస్' అను గ్రంథమందు డెటుల ఉత్పన్నమైనది వివరించినాడు. మంతుడును ద్వేషరహితుడగు భగవంతుడు సమస్తమును శుభప్రదముగా సృష్టించెను. దివ్యమూర్తులగు దేవతలను అగ్నినుండి కలుగజేసి అశ్వరానశ్వర పదార్థములతో సమస్త జాతులను రూపొందించుడని వారల కాదేశించెను. సృష్టి బాధ్యతను వారలకు ముట్టచెప్పుట వలన ముప్పువాటిల్లినది. సర్వేశ్వరు డుద్దేశించిన సర్వాంగ సుందర ప్రపంచము భగ్నమైపోయినది. డులకు మూలమిదియే.

పెర్షియనుల సాంప్రదాయముల కనుగుణముగా ద్వంద్వ సిద్ధాంతము రూపొందించబడినది. మేలు కీడు లను విశ్వ శక్తుల మూలమున సమస్తము కలుగుచున్నదని వారి వాదము. సమాన అస్తిత్వముగల యీ రెండు శక్తులకు తీరని పోరు. తత్ఫలితముగ వ్యథలు ఉత్పన్నమగుచున్నవి. జయాపజయ ములతో నీ పోరు అంతమొందునని వీరి నమ్మకము.

ఇక భారతదేశ సాంప్రదాయముల ననుసరించి కర్మ సిద్ధాంతము సమస్త దులకు మూలమని చెప్పబడుచున్నది. కర్మఫలము అనుభవించక తప్పదను నిరాశావాదము ప్రతి పాదించబడినది. జన్మపరంపరల వలన కర్మవిముక్తి కలుగు నని హైందవుల వాదము, మానవ దుష్కృతములను యాత నల మూలమున పరిహరించవలసిన అవశ్య మెంతేని కలదని చెప్పుదురు.

బౌద్ధులు ప్రతిపాదించే వేరొక పరిష్కార మార్గము కలదు. ఈ జన్మ పరంపరల ప్రవాహమునుదాటి మానవుడు శాశ్వతముగా ఆవలిగట్టుకు చేరుకొనవలెనంటే, తుచ్ఛవాంఛ లకు నెడమియ్యక అహంభావమును భగ్నపరచవలెను. స్వార్థ పరత్వమును విడనాడవలెను. కోర్కెలను శమింపచేయవలెను. సర్వసంగ పరిత్యాగి కావలెను. కర్మానుష్టానమును వర్జించుట మూలమున దివ్యజ్ఞానం, విముక్తి కలుగునని బౌద్ధులవాదము.

పైనుదహరించిన త్రివిధ పౌరాణిక సిద్ధాంతములు తత్త్వశాస్త్ర చరిత్రలో మాటిమాటికి గోచరించుచున్నవి. ఈ గాథ లన్నిటిలోను కొంత సత్యము లేకపోలేదు. విశ్వ

సమగ్రతకు అవగుణములు అవశ్యములనియు, భగవంతునిపై సృష్టి జాతములు తిరుగుబాటు చేసినందువలన విశ్వసంక్షోభము కలిగినదనియు, మానవజాతి సమైక్యత మూలమున, సమస్తులు శిక్షాదండనలకు పాత్రులనియు, ఒకరుచేసిన దుష్కృతములకు వేరొకరు బాధలు అనుభవించవలయుననియు, ఈ పురాణ కథలు మనకు నేర్పుచున్నవి.

ఇక గ్నోస్టికులకు భగవంతుడే శరణ్యము, భగవత్ స్వరూప స్వభావములను గూర్చి వారికి అత్యున్నత భావము లుండెడివి. అవి జూదమతమునుండి పరిగ్రహించియుందురు. తాము కలలుగన్న భగవంతుడు కేవలము భౌతిక ప్రపంచే తరుడనియు, సృష్టిజాతముల కతీతుడనియు నిరూపించుటకు భావగర్భిత పదములు రెంటిని వినియోగించుదురు. వారాయనను అఖండ మౌనమనియు, మహా అఘాతమనియు అభివర్ణించుదురు. దిగంతములందును, తారా పథాంతమందును ఆయనను వెదకవలసి యున్నది. దుతో కలుషితమైన యీ జగత్తు సర్వేశ్వరాన్వేషణమునకు మార్గ ప్రదర్శకము కాజాలదని వారి నమ్మకము. భగవదావిష్కరణకై నిరీక్షింపవలసియున్నది. గ్నోసిస్ అను దివ్యజ్ఞానము మూలమున మానవుని విముక్తి కలుగును. తద్దానిని సాధించుటకు భక్తి మార్గము దోహదకారి కాగలదని వారి యూహ.

సకల మేలుల స్వరూపియగు భగవంతుడు లోపభూయిష్టమైన జగత్తు నెట్లు సృష్టించగలడు అనునదియే సమస్య. దీనిని పరిష్కరించుటకు జూదమతము, క్రైస్తవ వేదము సూచించెడి మార్గమొకటి కలదు. భగవత్సృష్టి వస్తుతః శుభప్రదమైనను, మానవ స్వాతంత్ర్యేచ్ఛలవలన దుష్టవాటిల్లినదని చెప్పబడుచున్నది. గ్నోస్టికులు ఈ సమాధానమును తృణప్రాయముగా నెంచి, విశ్వసృష్టికి భగవదేతరుడైన ఉపకర్త వేరొకడు కలడని వాదించుదురు. వీ రుభయులకు మధ్య భగవజ్జనితములును, మానవేతరములైన దివ్యశక్తు లనేక

ములు కలవని వారి ప్రబోధము. వీనిని వారు "ఇయోన్స్" అని వ్యవహరించినారు. వీరికి స్త్రీ పురుషలక్షణములు ఆపాదించబడినవి. వీనిలో నొక మహాశక్తి చేసిన పాపదోషమువలన దేవరాజ్యమునుండి బహిష్కరించబడినది. దీనినే వారు జూదులపాలిటి దైవమనియు సమస్తసృష్టికి ఉపకర్తయనియు దానిని ప్రతిఘటించవలెననియు వారి ప్రబోధము.

కాబట్టి గ్నోస్టికులు అను దివ్యజ్ఞానుల వాదమునకు, స్టోయికుల హఠవాదమునకు నైతిక దృష్ట్యా పూర్తి వ్యతిరేకము. స్టోయికులు సచ్ఛీలనమువలనను సదాచరణమువలనను పరిసరములను బాగుపరచి ప్రపంచాభ్యుదయమునకు తోడ్పడుదురు. ఇక గ్నోస్టికులు ప్రపంచమునకు ఏమిచేసినను ముక్తి లేదనియు, దానినుండి పలాయనమై భగవంతుని చేరుటకు యత్నించవలెననియు వాదించుదురు.

గ్నోస్టికులవలె కొందరు క్రైస్తవులు సహితము ప్రపంచాభ్యుదయమునకు పాటుబడుటకు ప్రతిగా ఏకాంతవాసమున దైవనిష్ఠాగరిష్ఠులై జీవితమును వ్యర్థపరచుచున్నారని ఆక్షేపించవచ్చును. వాస్తవమునకు వీరుభయుల దృక్పథములందు సామ్యమే లేదు. క్రైస్తవు డెల్లవేళల అభ్యుదయగామి. జగత్తు పురోగతి చెందగలదని ఆయన గాఢవిశ్వాసము. కొందరు మాత్రము ఏకాంత ప్రవాసమును జీవితాశయముగా పరిగణించునది నిజము. క్రైస్తవులందరు అట్లు చేయుటలేదుకదా పైబడి, తపశ్చరణము, సుమాత్రృక, ప్రార్థనాది కర్మలవలన పాపభూయిష్టమైన జగత్తుకు మేలు చేకూరగలదని ఆయన

గాఢవిశ్వాసము. అతడు విషయానురాగములను వర్జించునది, నిగ్రహశక్తిని సాధించుటకేకాని అది చెడ్డయనికాదు. మానవునికి నిగ్రహశక్తి లేనిచో ఆత్మశాంతి శూన్యము. భోగలాలసులకు చిత్తసంక్షోభము కలుగకమానదు.

ఇక మనికేయుల సిద్ధాంతమునకు గ్నోస్టికుల ప్రబోధమునకు ముక్తిమార్గవిషయమై కొంత సామ్యము లేకపోలేదు. వీరుభయులు తదార్జనకై జ్ఞానమార్గము నాచరించెడివారే. ఆదిలో మనికేయుల సిద్ధాంతము విస్తార ప్రచారములో నున్నది. దాని ప్రభావముకూడ గొప్పది. దానిలో కాంతి విశిష్టత లేకపోలేదు. అక్కారణమున దీనినిగూర్చి ప్రత్యేకముగా సమీక్షించుట మంచిదని భావించుచున్నాము.

ఈ సిద్ధాంతము విస్తార ప్రాబల్యమునకు అవాంతరములు, హింసాత్మకచర్యలు లేకపోలేదు. ఇక వారి రచనలు, ప్రమాణగ్రంథములు పాశ్చాత్య క్రైస్తవ ప్రపంచములో వ శతాబ్దమునాటికిని, తదితర భూభాగములందు వ శతాబ్దము నాటికి అంతరించిపోయినవి. 90 సం॥ పురావస్తు పరిశోధకులు టర్కీ, ఉత్తర ఈజిప్టు దేశములందు ఆ మతకర్త రచనలను కొన్నిటిని కనుగొనిరి.

ఈ మత సంస్థాపకుడైన మని మహాశయుడు దక్షిణ బాబిలోనియా భూభాగములో 2 5 వ సం॥ జన్మించినాడు. రాజవంశీయుడు, సంస్నపనము a ism నాచరించెడి ఒక మతపక్షములో గురూపదేశము పొందినమీదట భారతదేశములో పర్యటించినాడు. ఆ వెనుక పర్షియా దేశమునకు జని

స్థానిక పాలకుని ప్రోత్సాహముతో .శ. 2 2-276సం॥ మధ్య కాలములో ప్రబోధించినాడు. స్థానిక మతాచార్యులు- అగ్ని పూజారులు- అతని నొక పతిత మతస్థుడని ఖండించి చెరయం దుంచిరి. అక్కడతడు -2-276 సం॥ మరణించెను.

అప్పుడు మానవ జీవితాశయమును గూర్చి విచారించి తదాశయసిద్ధికి యొక మార్గమును చూపినాడు. సృజనాత్మక మైన పాశ్చ్యభావ పరంపరలతో నొక కథనల్లి తన ప్రబోధ మును ఉల్లేఖించినాడు. ఈ గాథను పెర్షియను, క్రైస్తవ మత సాంప్రదాయములతో సహా వల్లెవేయవచ్చును. వేరొక అర్థ ములో ఈ కట్టుకథ ద్వారా మని మహాశయుడు వ్యథల సమ స్యను పరిష్కరించుటకు యత్నించినట్లు తోచుచున్నది.

ఏదొకడు వ్యథాభరితమైన తన జీవితమును గూర్చి తలపోయునపుడు అతనిలో గల నీచత్వము, చిత్త చాపల్యములు గోచరించక మానవు. తన వర్తమానస్థితి కంటెను పూర్వదశ కడుసుభద్రమైనదని భావించకమానడు. తన ఆత్మ తొల్లింటి పవిత్రత, స్వేచ్ఛానందములు, శాంతి సామరస్యముల కొఱకై ఉవ్విళ్ళూరును. కాలానుగతి ఈ సద్లక్షణము లన్నియు, తుచ్ఛవాంఛల వలన విషయానురాగముల, శరీరేచ్ఛలవలన, విషకలుషితమైనవని దురపిల్లుచున్నాడు. ఒకమాటలో స్థూల పదార్థమే సమస్త దులకు హేతువని తలపోయును. కాబట్టి జీవాత్మ స్థూల శరీరము కంటెను కడు శ్రేష్టమైనదని అతని యూహ. సముజ్జ్వలమైన జీవాత్మ అంధకార బంధురమైన దేహముతో విలీనము చేయబడినదని చెప్పుదురు. సద్గుణరాసి

యగు జీవాత్మ దుర్గుణయుతమైన భౌతిక శరీరముతో సమై క్యము చేయబడినదని చెప్పుదురు. ఈ విపరీత కలయికకు హేతువు మానవ పతనము లేక మానవ దుష్కృతమై యుండును. ఏలయన స్వేచ్ఛాయుత, సముజ్జ్వల జీవాత్మకును, విషకలుషితమైన అంధకారమునకుమధ్య వేయుడుగులదూరము. బహుశః ఈ ఆధ్యాత్మిక వస్తువు తిరుగ భౌతిక శరీరమును వీడి తన తొల్లింటి దశకు రాగలదని నిరీక్షింపవచ్చును.

ఈ అంశములను విశ్వసృష్టికి వర్తింప సినయెడల ఆయన ఊహల మహాత్మ్యము వ్యక్తము కాగలదు. అణుమాత్ర మైన యీ మానవగాథ అనంత విశ్వచరి తకు నాందివంటిది. ఇట్లు మని మహాశయుని ప్రబోధములు ద్వంద్వసూత్ర సిద్ధాం తమునకు మార్గదర్శకములైనవి. మేలు డు లను రెండుశక్తులు సర్వమునకు మూలాధారములని చెప్పబడినది. కాల దృష్ట్యా, తిదశలని ree S a es) వ్యవహరించబడినది. వీనినే పూర్వ, ప్రస్తుత, అంత్య దశలందురు. పూర్వదశలో ఆత్మ, శరీరములు విభిన్నములు. ప్రస్తుతదశలో మిశ్రమములు,అంత్య దశలో విచ్ఛిన్నములు. మానవ విముక్తి, తద్వారా విశ్వ విముక్తి, దివ్యజ్ఞానము ద్వారా లభ్యమగునని వారి వాదము. స్థూల పదార్థముతో చిక్కువడిన జీవాత్మ, బుద్ధి లేక విజ్ఞా నము వలన విముక్తిచెందును. కాబట్టి ఆదిమ దశలో–రెండు విలీనము కాని స్థితిలో–మేలు, డు, వెలుగు, చీకటి, ఆధ్యా త్మికము, భౌతికమను రెండుశక్తులు కలవు. వీనినే క్రైస్తవ పరిభాషయందు భగవత్, సైతాను లనవచ్చును. ఈ రెంటి

సమాన హక్కులు ఆపాదించబడినవి. రెండును శాశ్వతములు. రెంటికి అసమాన శక్తి సామర్థ్యములు కలవు; కాబట్టి ఆది నుండియు వ్యథల సమస్య కిది నిర్దుష్టమైన పరిష్కార మార్గ మని యెంచబడినది.

అనాదిగ ఈ రెండు శక్తులు వేర్వేరుగా నుండినవి. అప్పుడొక ఉత్పాతము సంభవింపగా తమస్సు జ్యోతిపై దాడి జరిపి దానిని రూపుమాప యత్నించినది. మనికేయుల దృష్టిలో తమస్సు పాపాంధకారమునకు పర్యాయపదమై యుండవచ్చును. పాపదోషమువలన మానవుడు ఆత్మజ్యోతిని గోల్పోవుచున్నాడు కదా

ఈ అంధకార పరంజ్యోతుల సంఘర్షణమే విశ్వసృష్టి చరిత్రము, మానవజాతి కథనము. ఇక జగత్ప్రగతి, మేలు డుల కార్యకలాపములతో నిండి విముక్తి మార్గప్రదర్శక మగుచున్నది. విశ్వాంతర్యామియగు స్తు (Cosmic Christ తన సముజ్జ్వలాత్మతో స్థూలపదార్థమునకు నిత్యము బలి యగుచున్నాడు. పదార్థమను స్లీవపై కొరతవేయబడు చున్నాడు. ఆ పరంజ్యోతికి విశ్వమంతయు స్లీవగా పరిణ మించుచున్నది.

కాని ఆయనకు విముక్తి లేకపోలేదు. మానవ పాప దోషములీ విశ్వప్రగతికి అంతరాయముల కల్పించి దాని తిరోగతికి దోడ్పడుచున్నవి. అందువలన ఈ పాపదోషములకు మూలమైన కామవ్యాపారముల స్త్రీ పురుషులు పరిత్యజించిన తప్ప ఆ విశ్వజ్యోతికి విముక్తి లేదు. జగత్తుకు అంత్యమే లేదు.

ఇవ్విధమున వెలుగు చీకటులు పూర్వ, ప్రస్తుత, అంత్యదశలు జరిగిపోవును. ఇంతటితో చీకటికి తిరుగులేని అపజయము చేకూరగలదు.

పై నుదహరించిన విశ్వజ్యోతి విముక్తివిధానము విశ్వ సృష్టికి వర్తించగలదు. ప్రళయకాలానంతరము జగత్తుకు విమోచనము కలుగును. ఇక మానవు డీ విముక్తికై సర్వ మును వర్జింపవలసియున్నది. కామ, క్రోధ, లోభ, మద, మాత్సర్యముల వీడవలసియున్నది. సిరిసంపదలను, పేరు ప్రతిష్ఠలను, వర్తక వాణిజ్యములను, వ్యవసాయాదివృత్తులను, యిహలౌకిక వ్యాపారాదులన్నిటిని మానవలసియున్నది. కాలానుగతి మనికేయులు ఈ కఠినాతి కఠినమైన విధానములను మార్పు గావించిరి. ఉత్తమసామాన్య విధానములని రెంటిని కల్పించినారు. భౌతిక వస్తువిసర్జన ఆత్మవిముక్తికి మార్గమని వారి అభిమతము.

ఇట్టి కఠిన నియమములను ప్రతిపాదించిన ఆ మతము రోమను సామ్రాజ్యమం దంతటను పరివ్యాప్తము చెందినది. వారలు ప్రదర్శించిన ఉగ్ర తపోనిష్ఠలు ఆనాటి క్రైస్తవులను కలవరపెట్టినవి. వీరోచితమైన వారి స్వార్థపరత్వమును జూచి పెక్కండు ముగ్ధులైపోయిరి.

ఏతత్కాలమున ప్లోటినుస్ అను తార్కికుడు వ్యథల సమస్యను గూర్చి పరిశోధనలు చేసినారు. ఇతడు, మని మహాశయులు సమకాలికులు. కాని వ్యతిరేక సిద్ధాంతములను స్థాపించినారు. విశ్వక్రమమే సమస్త దుఃలకు మూలమని

అతని వాదము. శిఖరాగ్రమున సర్వసంపూర్ణుడగు భగవంతుడున్నాడు. అతడు కేవలము తర్క వాదమున కతీతుడు. అతనిని తెలిసికొనుటకు ధ్యానమార్గమే శరణ్యము. అత డక్షయుడు.

రెండవస్థాయిలో వచ్చునది భగవత్ జనితమైన బుద్ధి. ఇది కడుశుభ ప్రదమైనది, కాని భగవంతునితో సరితూగలేదు. కార్యము కారణము వంటిదేకాని, కార్యానికి కారణములో గల సమగ్రత సంక్రమించదుకదా

మూడవ స్థాయిలో వచ్చునది విశ్వాత్మ. ఇది శాశ్వతమైనది, కాని బుద్ధికంటెను తక్కువ దశగలది. ఇది విభిన్న రూపాలతో జగత్తును సృష్టించుచున్నది. దీని మూలమున స్థూల ప్రపంచము కాలమానము ఆవిర్భవించుచున్నవి.

కడపటి స్థాయిలో వచ్చునది పదార్థము. ది ఘన పదార్థముకాదు. దీనినే ప్రాగభవమందురు ( ure o ency ఇదియే సర్వ డులకు, అసత్తుకు మూలము. దీనిలో సుగుణము పూర్తిగా లోపించినది.

సంగ్రహరూపములో ప్లోటినస్ వాదము నిట్లు పేర్కొనవచ్చును. శుభము ఎన్నడు ఏకాంత వాసము చేయజాలదు. కావున సాపేక్షక సత్తులద్వారా అభముండుట అవశ్యము. భగవత్ శక్తి పలుతెరగుల రూపొంది రాను రాను అధమస్థితికి వచ్చుచున్నది. ఈ అధ్వాన్న స్థితిని అభమందురు. కాబట్టి జగత్తు అభము, శుభములతో పూరించబడియున్నది. సమున్నత స్థాయిలో సర్వసంపూర్ణమగు శుభమున్నది. అధమ స్థాయిలో ప్రాథమిక పదార్థమున్నది. దియే అభమునకు

మూలము. ఒకటి సముజ్జ్వలకాంతి, వేరొకటి గాఢాంధకారము. అరిస్టోటల్ ౖడును అభమని నిర్వచించినాడు. అనగా అస్తిత్వం లేనిదని భావము. దీనితో ప్లోటినుస్ ఏ భవించలేదు. నిర్ణీత రూపము లేని ఈ ప్రాథమిక పదార్థము శుభరూపము వహించగల అవకాశము లున్నవని అరిస్టోటల్ వాదము. ఇక ప్లోటినుస్ దృష్టిలో ప్రాథమిక పదార్థమునకు ఒక నికృష్టమైన అస్తిత్వము కలదు. కావున అది శుభరూపము దాల్చెడి అవకాశములు లేవు దీనినే సాపేక్షిక సత్తుఅందురు. ఇది సృష్టి జాతము లన్నిటికి వర్తించును. శుభము పూర్తిగా లోపించి నపుడు ౖడు ఏర్పడుచున్నది. దీనిలో మంచి లేనే లేదు. నిజానికి కీడనగా అసత్తు అని భావము

ప్లోటినుస్ ప్రకారము శుభమంతయు భావజగత్తుకు సంబంధించినది. భావములు భౌతిక పదార్థమును స్పృశించి నంతనే ౖడు ఆవిర్భవించుచున్నది. అందుచేత భగవంతుని వలె ౖడు శాశ్వతమైనది. దీనికి కారణభూతుడు భగవంతుడు కాడు.

విశ్వవ్యాప్తమైన యీ ౖడును నిరోధించుటకు మార్గము హృదయ పరివర్తనము. ఆత్మ భగవత్ సాన్నిధ్యము కొఱకు నిరీక్షించుట తొలిదశ. భగవంతుని పోలియుండుటకు కాంక్ష రెండవదశ. ఆత్మ ధ్యాననిష్ఠాగరిష్ఠమైన పవిత్రతను సముపార్జించుట, తద్వారా కలిగెడు రభసము ఆత్మను భగవంతునితో ఏకము చేయగలదు. హేతుభూతమైన యీ భక్తి మార్గమునకు క్రైస్తవ దివ్యజీవితమునకు భేదాభేదములు లేక

పోలేదు. అయినను పైనుదహరించిన భక్తిమార్గమందు కొంత విశిష్టత లేకపోలేదు. మనికేయుల హఠయోగమున కంటెను కొంత మేలు. అయినను ఈ రెండు సిద్ధాంతములు భగవంతుడు సకల మేలులస్వరూపియని, స్థూల ప్రపంచము విష కలుషితమనియు చాటుచున్నవి కావున మానవుడు జగత్తుకు దూరమైతే తప్ప ప్రగతి చెందలేడని వారిబోధ. మరియు మానవుడు తనకుతానే ఆత్మవిముక్తిని సాధించగలడని, భగవదను గ్రహమునకు స్థానములేదని తెలియుచున్నది. సదవకాశములను కలిగించిన పక్షమున దేవగుణ ప్రసాదము సిద్ధించునని వారి నమ్మకము.

డునుగూర్చి తలపోయని తాత్త్వికులు చరిత్రలో లేరు. వారలు కనుగొన్న పరిష్కార మార్గము లన్నియు ప్రాచీనులు వల్లించిన వాదోపవాదముల సారాంశమై ఆధునిక యుగములో పరిణామవాదులు—విశేషించి గతితార్కిక భౌతికవాదులు, జగత్తు నిత్యము పురోగతి చెందుచున్నదని చెప్పి గతమును చెడుగుతోను; భవిష్యత్తును మంచితో ముడివెట్టుచున్నారు. మార్క్సుమహాశయుడు, గత చరిత్ర శ్రామికుల నికృష్ట జీవితమునకు, భావదాస్యమునకు లాంఛనమనియు, యిక భవిష్యత్తు జగత్ కళ్యాణమునకు వాక్ స్వాతంత్ర్యమునకు ఆనవాలనియు పేదలపాలిటి పెన్నిధి యనియు నుడివినాడు. రానున్న భూతలస్వర్గము శాంతి సామరస్యములతో తులతూగును. ఏలయన సమస్త ప్రజలు శ్రమ జీవితము ద్వారా పరస్పర సహకార సౌమనస్యములతో వర్ధిల్లుదురు. ధర్మపరిపాల

నకు దాని కదియే సాటి. వర్గసంఘర్షణలు, అంతఃకలహములు అంతరించును. సమరములు సమసిపోవ ప్రజల మనోవీధులందు నూతనలోకములు గోచరమగునని సామ్యవాదుల అభిమతము.

ఈ వర్తమాన కాలమున మేలు డులు, కలిమి లేములు మిశ్రమములు. వర్గద్వేషమును అంతఃకలహముల రేకెత్తించి సాంఘిక వ్యవస్థను కూలద్రోసి శ్రామికుల నియంతృత్వము నెలకొల్పుటయే మార్క్సు అనుయాయుల పరమ లక్ష్యము. నిరాధారములైన ఈ వింత యూహలను, విజ్ఞాన వేత్తలు నమ్ముట చాల విచిత్రముగా నున్నది.

ప్రపంచము అర్థరహితము అనెడు నిరాశా వాదమును నాస్తికులు, ఎక్జిస్టెన్షియలిస్టు బహుళ ప్రచారములోనికి కొని వచ్చినారు. వారి దృష్టిలో శ్రేయమునకే స్థానములేదు కాన వ్యథల సమస్య బొత్తిగా లేదు. కాబట్టి బాధలనుండి తప్పించుటకు వారికి తరచు ఆత్మహత్య తరుణోపాయము.

తెయిల్హార్డు దెషార్డిన్ అను తాత్వికుడు జగత్తు అగ సహితం అని నుడివినాడు. విశ్వపరిణామమునకు డు అవశ మని ఆయన అభిప్రాయము. ప్రపంచాభ్యుదయము గుణా గుణ ములతో, ఒడుదుడుకులతో గూడినది కాన, విశేషించి అసంఖ్యాకములైన ప్రజానీకముతో కూ న యీ జగత్తు వ మార్గమును పట్టుట, అపజయము చెందుట సహజము. తత్ఫలితముగా డు వాటిల్లుచున్నది. పునరుద్ధరణ చెందుటకు పూర్వము పతనమగుట సృష్టిశాపము. ఇట్లు సర్వజీవులకు మరణము ముక్తిమార్గము. శ్రమలద్వారా అభ్యుదయము

చెందగలము. శ్రమబాధలతో గూడిన విశ్వ ప్రగతి. మానవుని వ్యథల పాలుచేయుట తథ్యము.

పై నుదహరించిన పరిష్కార మార్గముల గుణాగుణము లెటులున్నను, ఘోర యాతనలకు గురియైన అభాగ్యులను సంతృప్తిపరచలేవు. మనికేయుల వాదము, గ్నోస్టికుల హేత వాదము, గతితార్కిక భౌతికవాదము యిత్యాదులలో కొంత విశిష్టత లేకపోలేదు. కారణము ఏమన, ఇవి యన్నియు మత దీక్షతో వల్లింపబడుచున్నవి. మతవిశ్వాసములు లేని కేవల తర్క-వాదము ఎవరినీ సంతృప్తిపరచలేదు. లోకమందు ఘోర యాతనలను జరుగనిచ్చెడి యీ దివ్యశక్తిచే వ్యథాభరితులు ప్రేమించబడుచున్నారని గుర్తించుట అవశ్యము. మరియు భగవంతునియెడ వారికిగల ప్రేమానురాగముల నిరూపించుట కివి చక్కని సాధనములు.

ఉత్తరోత్తర మనము పరిశీలించనున్న జూద, క్రైస్తవ మతప్రబోధములు, పై నుడివిన అంశములను విపులీకరించ గలవు.

# ౫ అ ధ్యా య ము

## వ్యథల సమస్య - పూర్వనిబంధన

వ్యథల సమస్య వైచిత్ర్యమును భగవంతుని వెలుగు కొంతవఱకు తొలిగించగలదు. కాని భగవదావిష్కరణము క్రమానుగతమైనదని మనము గుర్తించవలసియున్నది. ఉపాధ్యాయుడు విద్యార్థులకు క్రమశిక్షణ నెఱపుచందమునను, వైద్యశిఖామణి వ్యాధిగ్రస్తుని క్రమక్రమేణ గుణపరచు విధమునను భగవంతుడు తన వెలుగు కిరణము లపరిమితముగ విరజిమ్ముచున్నాడని అన్సెల్మునిమాన్యుడు నుడివినాడు; కావున భగవదావిష్కరణము ఆకస్మికముగా జరుగదని తెలియుచున్నది.

వ్యథలకు పాపదోషమునకు మధ్యగల సంబంధ బాంధవ్యము తొలుత వ్యక్తము చేయబడినది. బాధలు దురదృష్ట వశములనియు, దేవతల కోపోద్రేక ఫలితములనియు భావించక భగవంతునిపై సృష్టి జాతములుచేసిన తిరుగుబాటు వలన కలిగినవని గుర్తించుట అవశ్యము. ఇప్పుడిదియంతయు సామాన్యజ్ఞానముగా గోచరించవచ్చును. కాని పూర్వము జూదుల సత్యమును తెలియజేయుటకు పలువురు ప్రవక్తలు, మేధావులు కృషిసలిపిరని విస్మరించరాదు. ఇప్పటి దీనిని కూలంకషముగా అర్థము చేసుకొనుట సులభసాధ్యము కాదు.

పూర్వనిబంధనయందు ఆదిమ ప్రవక్తల రచనలని కొన్నిగలవు. ఇవి కేవలము చరిత్రాత్మకములే కాక భవిష్యత్

వార్తల సంపుటియు కూడ. జోషువా గ్రంథము, న్యాయాధిపతుల గ్రంథము, సాముయేలు గ్రంథములు, రాజుల చరిత్రములు రెండు ఈ కోవకు చెందినవి. ఈ రచనలందు పొందుపరచబడిన ముఖ్యాంశము లివి : ఇశ్రయేల్ ప్రజలు భగవంతుని యెడ ప్రామాణికముగా వర్తించినపుడు వారు నైతికముగను, భౌతికముగను అభ్యుదయము చెందినారు. తదనుగుణముగా చరించనప్పుడు భగవంతుడు వారిని అరిష్టముల పాలుచేసి రను విషయము వ్యక్తమగుచున్నది. న్యాయకర్తల గ్రంథ మీ విషయమును నొక్కి వక్కాణించుచున్నది. హీబ్రూల చరితంతయు జయాపజయములతో నిండి నిబిడీకృతమైయున్నది. "అంత నొకతూరి ఇశ్రయేల్ జనము భగవదిచ్ఛను ప్రతిఘటించినది" న్యాయ: 3: 2. వేరొకమారు ఆర్తరక్షుడైన భగవంతుని చూచి మొరబెట్టినది. "అంత వారు భగవంతుని చూచి ఆక్రందన చేసిరి." న్యాయ : 3: 5. మూడవ ఘట్టములో "ఆయనొక యోధవరుని వారికడ కంపెను" న్యాయ, : 5. ఆ వీరాధివీరులకు న్యాయకర్తలని నామకరణం చేసినారు. వారలయొక్క అంతరాత్మలంత సునిశితములు కాకపోయినను వారు భగవంతునియెడ ప్రగాఢ విశ్వాసమును ప్రదర్శించినారు. ఆయన అనుజ్ఞలతప్పక శిరసావహించినారు.

ఇశ్రయేల్ జనమిట్టి దుర్ఘటనల మూలముగా నేర్చుకొనిన గుణపాఠమేమన ప్రామాణికముగా జీవించినచో సుఖము, అప్రమాణికముగా వర్తించిన దుఃఖము లభించునని తెలిసి కొనిరి. సాముయేల్ గ్రంథములందును యదే విషయము

వ్యక్తము చేయబడినది. భగవంతుని తిరస్కరించి సౌలు భూపతి అధఃపతితుడగుటయు, భగవదాజ్ఞను శిరసావహించి దావీదు రాజు ఆయన ఆశీర్వాదమునకు పాత్రుడగుటయు, ఇస్రయల్ రాజ్య ఆవేదన, జూదా రాజ్యదుస్థితి యిత్యాది సంఘటనలన్నియు భగవంతునియెడ వారు చూపిన ఆచార, అనాచార ఫలితములేకాని కేవలము రాజుల ప్రతిష్టంభనలు కావు. మానవ కుయుక్తులూ కావు. ఉంతయు పాపదోష ఫలితమే యను ప్రాథమిక సత్యము వారిలో నాటుకపోయినది. పూర్వనిబంధనలో నీ విషయము క్రమానుగతముగా విపులీకరించబడినది.

ఆదిమ ప్రవక్తల రచనలన్నియు నీ భావముతో నిండి నిబిడీకృతమైయున్నవి. ఇస్రయల్ జనము భగవంతునిపట్ల కనబరచిన ప్రథమ అపచారము కృతఘ్నత. భగవత్ ప్రేమను విశేషముగా చూరకొన్నటువంటి ప్రత్యేక ప్రజానీకం అది. మురికి కూపంలోపడి కొట్టుమిట్టాడుచున్న "ఇస్రజల్ కన్యను" సముద్ధరించి గాఢముగా ప్రేమించి భగవంతుడామెను పాణిగ్రహణం చేసి సర్వాలంకార శోభితను గావించినాడు. కాని ఆ కన్నెపడుచు చిల్లర దేవుళ్ళను గొలిచి వ్యభిచారిణిగా వర్తించినది. "మీ రామెపై నేరారోపణ చేయుడు, మీ మాతృమూర్తిపై తప్పుమోపుడు, ఆమె నా ధర్మపత్ని కాదు. నే నామెకు నిజభర్తను కాను" ఓసెయ; 2:2 అని భగవంతుడు ఎలుగెత్తి పలికినాడు; కావున ఆమె దురవస్థల పాలు కావలసియున్నది. "శూన్యప్రదేశమువలెను, దారిలేని ఎడారివలెను దిక్కుమాలిన దానినిగా నిన్ను విడుతుదును."

హోషేయ : 2:3 భగవంతునికి తాను చేసిన అపచార ఫలిత ముగా సమస్త అక్రమములకు వడికట్టినది. నీతి నియమములను కాల ద్రొక్కి సుఖమును మఱిగినది.

ఇశ్రాయెల్ గతి యేమి ?

ఇతరులవలె ఇశ్రాయెల్ సహితము మున్నూరు భ్రష్టురాలైనది.

వేరొకతూరి చెడిపోయినది.

ఒక జత పాదరక్షల వెలకు సరిపోలు ఋణము నిమిత్తము. పేదలను ఋజువర్తనులను, బానిసలనుగా చేయును.

దారిద్ర్యుల స్వామ్యములను మంటిపాలు చేయును.

దిక్కులేనివారి హక్కులను త్రోసివేసినది .

నా నామమునకు అప్రతిష్ఠ కలుగునట్లు తండ్రీ తనయులు ఒకే కన్యతో చేరినది గమనింపుడు .

... ...ఇక నీవు సహాయ్యమును వ్యర్థముగా నర్థించుదువు; పంట చొప్పమోపులతో బరువెక్కిన బండి యిరుసు సహితము నావలె ఉపేక్షింపక మొఱబెట్టుచున్నది.

వేగిరకాండ్రకు వేగము వలని ప్రయోజనముండదు,

బలాఢ్యులకు బలము లాభసాటికాజాలదు,

యుద్ధభటునకు విమోచనములేదు; విలుకాడు స్థిరముగ నిలువజాలడు, ఆమోస్ ; 2. 6-7, — 5

ఇశ్రాయేల్ తిరుగ భగవంతుని సన్నిధికి చేరవలెనన్నచో ఆమె సమస్త మానవ సహకార సహాయ్యముల వర్జింపవలసి యున్నది. "నేను మిమ్మొక యెడారి భూమికి కొనిపోయి అక్కడ మీతో వ్యాజ్యమాడెదను.........నా అధికార దండముతో మిమ్ము లొంగజేయుదును. నా నిబంధనకు మిమ్ము బద్ధులనుగా చేయుదును. ఎదురించువారిని విడిగా నుంచెదను." ఇజకియల్: 20. 5-8. దేశాంతర వాసమున కర్థమిదియే. మానవులనుభవించే సమస్త వ్యథలకు తాత్పర్య మిదియే కాబోలు

ప్రాచీనములైన స్మృతి, సాంప్రదాయములు రెండు తెరగుల రూపొందినను వానియొక్క ఆశయములు వేరు కావు. రెండు విధానములు సైతము ఇస్రాయల్ జనుల పుట్టు పూర్వోత్తరములను దైవదత్తమగు మోయిాజు ధర్మచట్ట మును పేర్కొనినవి. కావున అవి యందజేసెడి సందేశ మొకటియే. "నీవు నా హెచ్చరికలను పాటించి నే నాదేశిం చున దంతయు నెరవేర్చితివేని నీ శత్రువులు నన్ను తమ శత్రు వులుగాను, నీయెడ దయలేనివారు నన్ను దాక్షిణ్యారహితు నిగా గుర్తించుదురు. నిర్గమకాండము : 2 :22. తదనంతరము ఉత్తరరాజ్యం పతనమైన పిమ్మట వృత్తాంతము ద్వితీయోప దేశకాండమందు పొందుపరచబడినది. ఇందుపై నుదహ రించిన అంశములు విశదీకరింపబడినవి. "నేను మీా కిపుడంద జేసెడి అనుజ్ఞలను శిరసావహించి, హృదయాత్మలతో దేవుని ప్రేమించి, సేవించిన యెడల ఆయన మీా భూములకు శర

ఋతువులో వర్షము, వసంత ఋతువులో వర్షము కురిపించి గోధుమ, ద్రాక్ష, నూనెపంటను మీరు కను గ్రహించును. మీ పశువులు మేయుటకు బయలు ప్రదేశమున గాసముండును. మనసార తినుటకు మీకు భోజనముండును. మీ ప్రభువగు భగవంతుని విడనాడి పరపూజాలోలసు లగునట్లు మీ హృదయములను చలింపనీయకుడు; లేనిచో నీ ప్రభువు ఆగ్రహించి పరమండల ద్వారములను మూసివేయును. వాన కురియదు, భూమి ఫలించదు. త్వరలో ప్రభువు మీ కొసంగదలచిన చక్కని భూములు మీ కిక దక్కక పోవును.

ద్వితీయోపదేశ గ్రంథము. : -7.

ఈ భావమే యీ గ్రంథములో పలుమారులు పునరావృతము చేయబడినది. విశేషించి ఇశ్రయల్ జనుల నడవడికకు అనుగుణముగా సంభావనలుగాని, శిక్షలుగాని సంక్రమించునని 27, 28 వ అధ్యాయమందు చిత్రించబడినది. చివరన ఆ శాసన కర్త యిట్లు నుడివినాడు. "నేను పరలోక భూలోక సాక్షిగా జీవమునుగాని మరణమునుగాని లేక ఆశీర్వాదముగాని శాపముగాని నీవు కోరుకొనునట్లు నీముందుంచి యున్నాను. నీ నిమిత్తము నీ తరువాతవారి నిమిత్తము జీవమును, దీర్ఘాయుస్సును నెన్నుకొనకుందువా? నీ ప్రభువైన భగవంతుని ప్రేమించి, ఆయనకు విధేయుడవై ఆయన దరిదాపున నుండుట నేర్చుకొనకుందువా"?

ద్వితీయోపకాండము ,0: 9–20.

కాగా, బాధలు పాపదోషఫలితమని ఆదికాండమందు వ అధ్యాయములో నిష్కర్షగా చెప్పబడినది. విశ్వసృష్టి ఆదిలో శుభప్రదమైనది. దానిలో అవగుణము లేమియు లేవు. “భగవంతుడు తాను చేసిన సమస్తమును తిలకించి అది మహో చక్కగా నున్నదని కనుగొనెను.” ఆదికాండ : : .

తనతో నిమిత్తములేని సర్వస్వతంత్రములగు సృష్టి జాతములను భగవంతుడు చేయలేదు. ఇక బుద్ధిగల జీవులు దైవాన్ని పోలినవారలు. కనుక సర్వదా వారు భగవంతునిపై ఆధారపడియున్నారనుటలో ఆశ్చర్యమేమున్నది? కావున మానవు డొక పరీక్షకు గురికావలసిన అవశ్యము కూడ ఏర్ప డినది. “తోటలోగల చెట్లన్నిటినుండి నీవు తనివితీర తినవచ్చు, కాని మేలు డుల నెఱిగించెడు చెట్టునుండి మాత్రము తిన వలదు. నీ వెన్నడైనను దీనినుండి తింటివేని నీకు మరణామే గతి.” ఆదికాండ : 2: 6– 7

ఈ గాథ మూలముగా డుల పుట్టు పూర్వోత్తరము లను పూర్తిగా తెలిసికొనజాలము. ఏలయన సర్ప మెటనుండి వచ్చినది అంతు చెప్పబడలేదు. అయినను తన్మూలమున పాపదోషపు స్వరూప స్వభావముల గూర్చియు తత్ఫలితము లగు మానవవ్యథలనుగూర్చియు నిష్కర్షగా ఉల్లేఖించబడినది. పైబడి యీ గాథ ఆదిమ యుగాల కతీతమైన దృక్పథమును ప్రదర్శించుచున్నదనుట నిర్వివాదాంశము. “ఇదేమి, భగవం తుడు తోటలోగల ప్రతివృక్షఫలములను తినవలదని శాసిం చెనా? ఆదికాండ : : అని యీ కాలసర్పము హేవ హవ్వద

యమందు భయసందేహముల పురికొల్పెను. భగవత్ విశ్వాసము పట్ల మనము ప్రదర్శించెడి ఉపేక్ష పరధ్యాసలు ప్రతి పాపమునకు త్రోవతీయుచున్నవి. అంతరాత్మలో జ్ఞాన వెలుగు తొలగిన మీదటనే చిత్తభ్రమ కలుగుచున్నది. ఇన్నిటికి భగవంతునితో తుల దూగవలెననెడి తుచ్ఛవాంఛయే పాప దోషము "మేలు కీడుల నెఱిగి మీరు సహితం దేవుళ్ళను పోలియుందురు." ఆదికాండ : :5 ఈ వింతదృక్పథమునకు ఉన్మాదము, ఆత్మవంచన, అహంభావము కారణములు కాక పోవచ్చును. కాని మానవుడు పాపదోషము నాచరించినప్పుడెల్లను భగవత్ స్వాతంత్ర్యేచ్ఛలను అనుకరించుచు, ఆయన మహిమాభ్యున్నతికి ప్రతిగా తన ఆత్మ ప్రతిష్ఠను నెల కొల్పుటకు ప్రాకులాడుచున్నాడని చెప్పనగును. జ్ఞా: 2: అనగా భగవంతునితో ప్రమేయం లేకుండ మన జీవితమునకు మనమే అధినేతలము కాగలుగుటనియే భావం. ఇదియే సమస్త దుర్గుణముల ప్రాతిపదిక. తద్వారా యిత్యాది చెడుగులన్నియు ఆవిర్భవించును. ఇట్లు ఆది స పతులు తమ నిర్దోషత్వమును అపూర్వ బాంధవ్యమును గోల్పోయి లజ్జాయుతమైన తమ నగ్నతను గుర్తించి భగవంతుని సాన్నిధ్యమునకు దూరమై పోయిరి. నీతిమంతులకు ఆనందదాయకమును, పాపకర్మలను దహించివేయు భగవత్ జ్యోతినుండి వారు పలాయనమై చనిరి. ఇట్లు మానవునికి భగవంతునికి గల అమూల్యమైత్రి భగ్నమై పోగా సృష్ట్యంతయు తన్నతిక్రమించినది. విశ్వ సంక్షోభం సంభవించింది. ఇక మానవుడు బహుశ్రమలకోర్చిన తప్ప సృష్టిజాతముల స్వాధీనపరచుకోజాలడు. పురుషుని

మహిమాభ్యున్నతికై సృష్టించబడిన స్త్రీ రత్నము—అతని చేతిలో ఉబామ్మగాను, బానిసగాను మారిపోయినది. ఇక మీదట మానవ జీవితము వ్యధాభరితము. ఆది జననీ జనకు కులకు నందనవన వియోగము కలిగినది. కైనుడు ఆబేలును చంపి నరహంతకుడాయెను. మృత్యువు తరతరాల వఱకు తాండవమాడు చుండును. పాపదోషమెల్ల యెడల పరివ్యాప్త మైనది. ధర్మశాస్త్రగ్రంధపు అంతిమ భాగములు పై నుద హరించిన దృక్పథమును చక్కగా వ్యక్తము చేయుచున్నవి. "మీరు నాచట్ట ప్రకారము వర్తించితిరేని నా ఆజ్ఞలను స్మరించి వాని నాచరించితిరేని మీ పై సకాలమున వర్షము పడును; భూమి అధికఫలము నిచ్చును, మీ చెట్లు ఫలభార మున వాలిపోవును. ద్రాక్ష కాపునకు వచ్చువరకు నూర్పిడి జరుగుచుండును. విత్తనము వెదబెట్టెడివరకు ద్రాక్ష కాపు ముగిసిపోదు. మీ తనివిదీర భుజింపగలరు. మీ భూములు మీకు సురక్షితముగా నిలిచిపోవును. మీ సరిహద్దులన్నియు ప్రశాంతముగా నుండ మీరు నిర్భీతిగా నిద్రపోగలరు."

లేవియకాండము 26 : -6.

సామెతల గ్రంథము ఈ పాఠ్యభాగమున పలుమారులు మన స్మరణకు గొనివచ్చుచున్నది. "సచ్ఛీలుడైన తండ్రికి కొడుకును మనుమడును వారసులగుదురు; పాపకర్ముడు గొప్ప వారికై ధనము చేకూర్చును.'' సామెతలు: : 22 "ధరా త్ముని గృహము వాని సిరిసంపదలను పరిరక్షించును; దుష్టుల నిరీక్షణలు భ్రష్టమై చనును" సామెత : 5 : 6.

దావీదు సార్వభౌముని గేయములు సహితము పై నుదహరించిన అంశములను గానము చేయుచున్నవి. ప్రథమ గేయం వ్యథల సమస్యకు నొక ఉపోద్ఘాత మనినట్లు తోచు చున్నది. దురాలోచన కనుగుణముగా నడుగిడనివాడు లేక పాపకర్మల పథమున మెలగని వాడును లేక దురాత్మల సభలో చేరనివాడును, వి శ్రాంతిగా కూర్చొనని వ్యక్తి, అతడే ధన్యుడు.

భగవత్ శాసనమును తన హృదయమున నిలిపిన వ్యక్తి, అహర్నిశము లదే శాసనమునుగూర్చి తలపోయుచుం డును. ప్రవహించు జలము చెంతనాటబడి, సకాలమున తన ఫలమునిచ్చుటకు సమాయత్తమై ఎన్నడు ఆకురాల్చని వృక్ష మువలె నతడు స్థిరపడియున్నాడు. ఆయన చేయున దంతయు సఫ-కృతమగును. ఇక దుష్టుల (విషయం) అటుకాదు; అట్లు కానేరదు. భూతలమునుండి గాలికి గొట్టుకొనిపోవు ధూ దూసరిని పోలియున్నారు, దుష్టులు: న్యాయ ీర్పు ప తెంచు నప్పుడు దుష్టులులేచి తమ పక్షమున వాదించుకొనజాలరు. పుణ్యశీలుర సమావేశమున దుష్టులకు స్థానములేదు. నీతి మంతులు భగవంతుని కటాక్ష వీక్షణాలందు మెలగుచుందురు.

దుష్టుల పథమెంత ఉద్వేగముగ నదృశ్యమగునోగదా అప్రమాణ గ్రంథములందు నిదియే ఉపదేశము పలుమారులు ప్రస్ఫుట మగుచున్నది.

90 వ గేయమందు నీ సందేశము ప్రతిధ్వనించు చున్నది. "మహోన్నతుని సంరక్షణలో మెలగుచు, ఆయన

పరమాశ్రయమందు నిలువ నిచ్ఛగించువాడు భగవంతునితో, "నీవే నాకాధారము, నీవే నాదుర్గము, నా సర్వేశ్వరా నిన్ను నే నమ్ముకొనియున్నాను" అని చెప్పుకొనగలడు. దా. గీ. 90 : 1-2

భగవంతు డెవరిని తన పక్షములతో గప్పి కాపాడునో వాడు కలతజెందడు. ఈ సందర్భమున వ గేయము నుద హరించవచ్చును. భగవదిచ్ఛను వరించు భక్తులకు సర్వము శుభప్రదము అను భావము ఇందు బహుచక్కగా వ్యక్తము చేయబడినది. "కీర్తి మహదైశ్వర్యముల కతడు నిలయము. ఆయన కలిమి ఖ్యాతిగడించును. అతని హృదయము సహన స్థైర్యములతో మెలగును. తన శత్రువుల పతనమునకై ప్రశాంతముగా నిరీక్షించును." దా. గీ : 3,7.

దుష్టశిక్షణ, శిష్టరక్షణ అను ఈ సామాన్య సూత్రము నకు కొన్ని మినహాయింపులు లేకపోలేదు. సజ్జనులు వ్యథా భరితులగుటయు, దుర్జనులు ధన్యులగుటయు కలదు. కాకున్నచో పరీక్షా నిరీక్షణలకు స్థాన మెక్కడ?

ఈ కొంగ్రొత్త సమస్యకు కొన్ని పరిష్కార మార్గ ములు కలవు.

జూదులలో ధర్మతత్వము విపరీతముగా నుండెడిది. తన్మూలమున ఒకడు చేసిన నేరమునకు వ్యక్తిగత బాధ్యత, సమిష్టిబాధ్యత అని రెండు ఆవిర్భవించినవి. అనగా ఒకని దుష్కృతములకు అతని సహచరులు లేక బంధుమిత్రులు బాధ లనుభవించుటయు కలదు. ధాతెనుడు, ఖోరుడు, అభి రోనులు మోసెస్ అధికారమును ధిక్కరించగా, వారు తమ

కుటుంబసమేతము నశించునట్లు చెప్పబడినది. అనగా వ్యక్తిగత దుశ్చర్యలకు సమిష్టిగత శిక్షల ననుభవించుటనుట.

ధన్యజీవులగు తమ పితామహుల భక్త్యానురక్తుల ననుసరించి కొందరు దుష్టులు సుఖించుటయు, కలదు. భక్తుడగు దావీదు మూలమున అతని కొమరుడు సలోమోను డామోదించబడెను. ఇట్లే దుష్టులైన తమ పూర్వీకుల దుశ్చర్యల వలన సజ్జనులు వ్యధాభరితులగుటయు కలదు. మన పితరులతో మనమును పాపదోషము నాచరించితిమి. ఇంత మాతమున సమస్య పరిష్కారమైన దని చెప్పజాలము.

మహాప్రవక్తలందరు విశేషించి జెరమయ, ఇజకియల్ యీ సమస్యను స్పృశించియున్నారు. పైనుదహరించిన వానిని కాదనక వ్యక్తిగత బాధ్యతలకు జాతీయ బాధ్యతలకు మధ్య భేదాభేదములు గలవని వీరు నొక్కి వక్కాణించినారు. మెస్సాయ యుగలక్షణముగా, జెరమయ దానిని నిర్వచించినాడు. "ఆసమయ మాసన్నమైనప్పుడు పితరులు పులుపు ద్రాక్షలను తినగా వారల పిల్లల పండ్లు కొరవోయినవి అను సామెతయే వినబడకుండును. తిన్నటువంటివానిపళ్లే పులియగలవు. ఎవని దోషమువలన వాడు దుర్గతి చెందును" జెరమయ : 29,30.

ఇజకియల్ దీర్ఘదర్శి ఇకముందు ఎవరినైతిక బాధ్యత వారిదేనని ఉద్ఘాటించినాడు. దురాత్ముడు, హింసాత్మకుడైనవాని తండ్రి స్వదేశీయుల కోపమునకు గురియై తన దోషమునకై తానే ప్రాయచ్చిత్తముగా మడిసెను. అతని

కొమరుని సహితము పరిహరించవలెననియా మీా కోరిక ? లేదు. నీతి నియమములుగల వ్యక్తి యితడు నీ అనుజ్ఞలకు బద్ధుడై వాని నాచరించుచున్నాడు. ఇతడు జీవించవలసినదే, చనిపోవలసినది దోషాత్మయే; తండ్రి శిక్షకు తనయుడు పాత్రుడు కాజాలడు. ఇట్లే ఆత్మజునకు జనకుడు బాధ్యుడు కాజాలడు; మంచికి మంచి, చెడుగునకు చెడుగు వాటిల్లును." ఇజకియల్ 8 : 8-20.

వ్యక్తిగత భావవాదమునకు ప్రసిద్ధిచెందిన 9వ శతాబ్ద ప్రభావములకు గురియైన మన విషయం పరమ సత్యముగా గోచరించక మానదు. అయినను ఆధునిక ధోరణుల ననుస రించి మనము సాంఘిక దృక్పథమును అలవరచు కొనవలసిన అవశ్యమెంతేని కలదు. మానవులు పరస్పర సహాయ్య సహా కారముల నెఱపు కొనగల సాంఘిక జీవులని గుర్తించుటయు కడు ముఖ్యము. జూదారాజ్యం తీరుగతికి వచ్చిన దినము లలో దేశాంతర ప్రవాసకాలమందు వ్యక్తిగత బాధ్యతను గూర్చి ప్రజలకు నచ్చచెప్పవలసిన అవశ్యం ఏర్పడినది. భగ వంతునియెడ ప్రామాణికముగా జీవించు వానికి సుఖసౌఖ్య ములు, ఆయనను తిరస్కరించిన వారలకు దురవస్థలు అన్నటు వంటి విషయమును లోకమునకు చాటి చెప్పవలసినటువంటి రోజులవి. తత్ఫలితముగా నూత్నభావము లంకురించినవి. క్రొత్త సమస్య లావిర్భవించినవి. జాతీయ దుర్దశలకు ప్రజల దుష్కృతములకు కొన్నియెడల సామ్యమే లేదన్న ప్రశ్న ఉదయించినది.

బహుశః మకభేయుల కాలములో రచించబడినా 3వ గేయ మీ చిక్కు సమస్యను చక్కగా నభివర్ణించుచున్నది.

మా సైన్యములతో నీవు సమరమునకు రానొల్లక మమ్మకాదని మా సిగ్గు సియున్నావు. మాశత్రువుల యెదుట మేము పలాయన మగునటుల చేసియున్నావు, మా ద్వేషించు వారు తమ చిత్తము వచ్చినటుల మమ్ము దోచుకొనుచున్నారు. భోజనార్థము విక్రయించబడిన గొఱియల చందమున గావించి మమ్మిక్కడక్కడ చెదరగొట్టియున్నావు. వెలగల నష్టపరిహారమును కోరకయే లాభములేకయే నీ ప్రజలను మాఱుపు చేసియున్నావు, ఇది యంతయు మాపై వచ్చినది. మిమ్ము విస్మరించినామని కాదుగదా. మీ నిబంధనను మీరి ద్రోహులముకాలేదు, లేక నీ నుండి మా హృదములను వేరుచేయలేదు. నీమార్గములను మమ్ము దూరమగునటుల చేయుటకు నీనుండి మా హృదయములు తిరోగతి చెందలేదుకదా నీ వెందుకు మమ్మింతటి దీనావస్థకు కొనివచ్చితివి ? ఎటు చూచినను దారిద్ర్యము మమ్మావరించినది. మరణపీడ మాపై తూగిసలాడుచున్నది. మా నిజదేవుని మేము విస్మరించి పరదేవతల వంక చేతులు జోడించి ప్రార్థించియున్న యెడ, ఆయనకు తెలియకుండునా ? ఆయన మానవ హృదయరహస్యము లెఱుగును. దా. గే. ;: 0- 3; 8-22

ది యొక చిక్కుసమస్య. దీనికంటెను జటిలమైనది వేరొకటి కలదు. అంతయు తెలిసినటువంటి పరమదుర్మార్గులు కొం

దరు సుఖసౌఖ్యము లనుభవించుట కడుశోచనీయము. 72వ గేయము ఈజటిల సమస్యను గూర్చి వ్రాయబడినది.

“ఇంచుమించు నా అడుగులకు నిలుకడ లేకుండెను. నా పాదాక్రాంతభూమి కృంగినట్లు తోచినది. ఆయన ధర్మచట్టమును ధిక్కరించెడు పాపకర్ముల ఐశ్వర్యమును గాంచ నాకు అమితాగ్రహము కలిగినది. మానవునికి సంభవించెడి సామాన్య కష్టాలలో వీరు భాగస్వాములుకారు. మానవాని బాధించెడి అరిష్టము లింకను వారి నంటవు, ఆశ్చర్యమేమున్నది? వారు గర్వ పొగరుబోతులై తమ శాసన ధిక్కారమును, అపవిత్రతను డంబముగా ప్రదర్శించుచున్నారు. ఆ భోగలోలసజీవితములనుండి చెడుగెంత అంకురించుచున్నదో కదా వారల హృదయవాంఛ లెంత సులువుగా సఫలమగుచున్నవో కదా

దా. గే. 72: 2,3, 5-7.

ఇక్కడ వేరొక జటిల సమస్య అంకురించినది. పాపకర్ముల సిరిసంపదలు శాశ్వతము కావని గేయకారుడే స్పష్టపరుస్తున్నాడు. “నీవు వారల విద్రోహకచర్యలకు ప్రాయశ్చిత్తం చేయుట తథ్యము. వారలను ఐశ్వర్యశిఖరముల నుండి పడద్రోయగా వారల కదియెంత అనర్థదాయకమోకదా!”

దా. గే. 72: 8

ఇక పుణ్యశీలురకు భగవంతుడు స్వంతము కాన వారలకు కొదావేమున్నది? “నీవు తప్ప స్వర్గమందు నాకేమి కలదు నీవరముల వలన భూతలముపై నాకేమి అనందము కలుగుచున్నది. ఈ కాయము, ఈ నా భౌతికజీవము అంత

మొందవలెను. ఇంకను భగవంతుడు నా హృదయము నూర డించును. సర్వేశ్వరుడు నిత్యము నావారసత్వమైయున్నాడు.
దా. గే. 72: 25-26.

ఇది మహాచక్కని సమాధానం. కాని సమస్యామాత్రం పూర్తిగా పరిష్కారం కాజాలదు. కాని నిష్కామ నిర్మల వితమునకు ఇదియొక నాంది అనవచ్చును. ఇక్కడ పాప కర్మలకు మరణాంతరము సంక్రమించెడి శిక్షలను గూర్చి ప్రస్తావన లేక పోవడం కడుచిత్రం. పుణ్యాశీలురకు భగవంతుని మధ్యగల సంబంధ బాంధవ్యములను గూర్చి వివరించబడ లేదు. అప్పటి భగవదవిష్కరణ సంపూర్తి కాలేదనుటలో ఆశ్చర్య మేమున్నది? అంధకారములో భగవజ్జ్యోతి మిణుకు మిణుకు మనుచున్నది.

వయోతనలకు గురియైన సజ్జనులు కూడా లేకపో లేదు. దావీదు గేయములందు మూడింట నొకపాలు నీతి మంతుల ఆర్తనాదములను ప్రతిధ్వనించుచున్నది. అందులో కొన్నిటియందు గేయకారుడు తన పశ్చాత్తాపమును వెలువ రించుచున్నాడు. మరి కొన్నిటియందు తాను శిక్షార్హుడు కానని విలపించుచున్నాడు.

"నా హృదయమును ప్రామాణికముగా నుంచి పవి త్రాత్మల నడుమ నా హస్తముల శుద్ధి పరచుట వలని ప్రయోజనమేమని తలపోసితిని" దా. గే. 72- 3.

దాస్యవిముక్తి తరువాత వచ్చిన ప్రవక్తలును ఇదియే సమస్య నెదుర్కొనవలసి వచ్చినది. "నీవు మొఱబెట్టి

యున్నావు. భగవంతుని సేవించువాడు ప్రతిఫలాపేక్షగా ఆయనను సేవింపవలెను. ఆయన అనుజ్ఞల తలదాల్చి, దుఃఖ ముఖముతో దళాధినేతకడ వేచియుండుట వలన మనకు లభించిన సంభావనమేమి ? మనకంటెను ఎక్కువ అసూయాపాత్రులైన గర్విష్ఠు లిక్కడున్నారు.” మలకియాస్ : 3: – 5

ఈ ప్రశ్నకు సమాధానముగా జోబు, తోబ్యాస్ చరిత్రలు వ్రాయబడినవి. సద్గుణ లుడగు జోబునిగాథ కడు ప్రసిద్ధము. జూదజాతికి చెందినవాడు కాడు. ఇతడు సైతాను ఈర్ష్యాసూయల వలన మహా ఉపద్రవములకుగురియై తన సంతానాది సిరిసంపదల గోల్పోయి తన దేహమందు భయంకర బాధల పొంది దేవుని ధిక్కరించక చివరికతడు భగవదనుగ్రహమువలన పూర్ణారోగ్యవంతుడై సమస్త సంపదలతో తుల దూగిన వృత్తాంతము జగద్వితము. ఇజకియల్ దీర్ఘదర్శి ఆయనను జూదులపే టి పెన్నిధియని వ్యవహరించినాడు. ఇజకియల్ ; . ఇది ఇట్లుండ జోబుని గ్రంథము సమున్నతస్థాయిన నడచిన కవితారచన యని విస్మరించరాదు.

దివ్యలోకమున భగవంతుని కొలువుకూటమును అభివర్ణించెడి గంభీర ఉపోద్ఘాతముతో కథ ప్రారంభమగుచున్నది. జోబునకు అతని ప్రాణస్నేహితులైన ఎలిఫాజ్, బాల్దాద్, సోఫార్ అను మిత్రత్రయమునకు మధ్యజరిగిన చర్చ లిందు చక్కగా పొందుపరచబడినవి. తదుపరి ఈ సందర్భముగా, ఎలయు అను వింతవ్యక్తి గాథలో గోచరించును. వీరందరు తమ సంకుచిత జ్ఞానము ననుసరించి జోబుని దురవస్థ దుస్థితు

లకు కారణము, ఆయన పాపదోషము లేనని చాటించినారు. కాని జోబు మహా ప్రశాంతముగా తన నిర్దోషిత్వమును వారి చాటిచెప్పినాడు. అంత భగవంతు డాయనకు సాక్షాత్కరించి ఆయనను సమాధానపరచెను. అంతిమభాగములో జోబు యొక్క ధీరోదాత్తత, సహనశీలతలు ప్రశంసించబడినవి. ఆ మీదట ఆయనకు సంక్రమించిన సంభావనయు కడు గొప్పది.

జోబుని సన్నిహితులు ప్రాచీన సాంప్రదాయానుసారముగా వాదించినారు. అందు మొదటివాడు ఎలిఫాజ్; చాల పెద్ద మనుష్యుడు, సహన శీలత గలవాడు. తాను గడించిన అనుభవజ్ఞానమును పురస్కరించుకొని జోబుకు హితోపదేశము గరపినాడు. కాని అతని మనస్సుకు కలతపెట్టినవాడు కాడు. అతనిలో హృదయ పరివర్తనం కలిగించవలెనని అభిలషించినాడు.

"మేము సంభాషించినచో నీవు మా వార్తలను అపార్థము చేసికొందువు. ఐనను మాటాడక తప్పినదికాదు. నిష్కర్షగా నిర్దోషులెన్నడు నాశన సహితులు కాజాలరు. యథార్థవర్తను లెన్నడు స్మృతినుండి మరుగైపోరు. అకార్యముల నెఱపడి వారలు, దుష్టబీజముల నాటెడి వ్యక్తులు కడన తగిన ఫలములను కోయక మానరు. వీరలు లేకుండపోవుట, నే నెఱిగిన విషయము ఒక్కవేడి నిట్టూర్పు, దేవ కోపానల నిశ్వాస మొక్కటి వారిని శుష్కింపజేయగా వారలు లేకుండ మరుగై పోదురు.

అంత ఆ వాణి యిట్లు పలికెను : మానవుని భగవంతునితో పోల్చి చూచినపుడు, న్యాయం వాని పక్షం వహించునా మర్త్యుడైన వాడు తన సృష్టికర్త సమక్షమున నిర్దోషి కాగలడా? తన పాపములకై, భగవంతుడెవనిని దండించునో వాడు ధన్యుడు. ఆయన నీజీవితములో నంపెడు శిక్షను ఎన్నడు నిరాకరించవలదు. ఆయన గాయపరచినది మాన్పుటకే. నిన్ను మోదిన హస్తమే చికిత్స చేయును."

జోబు : ;2,7–9, .7;5: 7– 8.

రెండవ మిత్రుడు బాద్దాద్ వయస్సులో చిన్నవాడు, ఒడుదుడుకులుగల వ్యక్తియు జీవితములోని వైవిధ్యమును ఎఱిగినవాడు కాడు.

"ఏమి, నీవింకను గతమును గూర్చి మొఱపెట్టుచు పెనుగాలివలె వ్యర్థముగా రోదన చేయుచున్నావు? అయోగ్యమైన తీర్పు భగవంతుని నుండి వెలువడునా? అన్యాయ దండనము సర్వశక్తివంతుని నుండి రాగలదా? ఒకవేళ నీబిడ్డ ఏదొక తప్పిదము చేసియున్నారేమో? కాన ఆయన న్యాయము వగదెంచుటకు చిత్తగించినాడు. నీవు మాత్రము దేవునితో వేగిరము సమావేశమగుటకు యత్నించుము.

సకాలమున ఆయన నీతో మాటాడ గలడు, గత సుదీర్ఘ చరిత్రనుండి వివేకము నార్జించుము, పూర్వీకుల అనుభవమునకు తలయొగ్గుము." జోబు 8:2–6:8.

మూడవ స్నేహితుడు సోఫార్ చాల కఠినాత్ముడు, నిర్మొగమాటముగా మాటాడెడి వ్యక్తి. అవహేళనం చేయుటకు వెనుకాడువాడు కాడు.

"మాటాడుట కెంత సంసిద్ధమో, తిరుగా తిలంచుటకును, నీవంత సమాయత్త పడగలవు. వదరినంత మాత్రమున నీవు నిర్దోషి అనిపించుకోలేవు. నీవు ముగించెడివఱకు అందరు మౌనము వహింపవలెనా? ప్రలాపముల కెవరు ప్రత్యుత్తర మీయవలదా ? జోబు ;2-,.

ఈ ముగ్వురి హితోపదేశమందు పొందుపరచబడిన వేదాంతము ఊహాత్మకమైనది. పూర్తిగా నిర్మాణాత్మకము కాజాలదు. ఎందుకనగా యీ సమస్య వారు అనుకొన్నంత సులువైనది కాదుసుమా వారి యుపదేశముల విన్నమీదట జోబు పలికిన విలాప వాక్కులను క్రైస్తవుడెవడు సమర్థించలేడు; "ఆయన మొదలిడిన పనిని ముగించుమనియు, నన్ను పూర్తిగా అణగించుమనియు, పెద్ద పెట్టున బరిమార్చుమనియు నేను దేవుని మనవిచేయు చుందును. ఆయన నన్ను చిత్రవధ గావించినను నాకదే సంతృప్తి. అప్పుడాయన చిత్తమునకు విరుద్ధముగా మొరలిడ కుందును." జోబు 6.9- 0

పాపము ! జోబుడు తీవ్రవేదనలో చెప్పిన పలుకులవి. క్షమించ తగినవికూడ. ఇంకను అతడు నుడివిన మరి కొలది వాక్కులు కడుగమనార్హములు. "ఆహా' నాకు కలిగిన ఆవేశముతో నే భరించు వ్యథలను తూచి చూచుటకు ఒక త్రాసు వున్న ఎంత బాగుండును సముద్ర తీరమునగల యిసుకరేణు

పు ఇసుకయొక్క భారముతో సరితూగవు. నా భాషణలన్నియు దూషణలని ఆశ్చర్యపడుచున్నారా? ప్రభుశరములు నాలో లోతుగా చొచ్చుకొని పోయి నన్ను విగత జీవునిగా చేయు చున్నవి." జోబు 6: 2-

సత్ప్రవర్తన సుఖమునకు దుష్ప్రవర్తన దుఃఖమునకు నాందియని భాష్యములు చెప్పెడి కొలది వేదాంతులకు, నీ సంఘటన అర్థరహితము కావచ్చును. ఇది సర్వసామాన్యమైన విషయం. ఈ సూత్రమునకు నిషేధ ప్రాయమువంటి (exce tion) సంఘటనములకు మనము సమాధాన మియ్య వలసి యున్నది.

ఇంతలో నున్నట్లుండి ఏలీయు అను వింతవ్యక్తి వచ్చి జోబుకు హితోపదేశము కావించినాడు. అతడు వయస్సులో చిన్నవాడైనను అతని వాదవిధానము సరళముగాను సమగ్ర ముగా నడచినది. దాని సారాంశమిది : భగవంతు డెవని ని అన్యాయము చేయలేదు. కాబట్టి కష్టాలు, ఒకనిని సుశిక్షితు చేసి, వాని గుణపాఠములు నేర్పుటకై భగవంతుడు అంపెడి వరములని భావించవలసియున్నది.

"మానవుడు సొంత ఆలోచనలకు దూరమై, తన గర్వము నడంచి, మృత్యువుకు నిరాశ కలిగించు నట్లును, ఖడ్గ మున కెరకాకుండునట్లును భగవంతుడు వినియోగించెడి సాధ నములలో నిదియొకటి. అటుకాని పక్షమున ఆయన వ్యాధి బాధలమూలమున మానవుని సుశిక్షితునిగాచేసి దానివలన

వాని శరీరమంతయు కృశించిపోవునట్లు గానించును.
జోబు 3 : 7- 9.

ఇక, తరువాత ఘట్టము భగవత్ సాక్షాత్కారము. సర్వజ్ఞుడగు సర్వేశ్వరుడు స్వయముగా అసర్గళపద జాలముతో జోబుకు హితవుగరపి, సృష్టికర్తతో ఎవరును వాదులాడలేరని వ్యక్తముచేయును. "నేను భూమికి పునాదులు వేసినపుడు నీ వేదృక్కోణమునుండి పరికించితివి ? నీ విస్పష్టజ్ఞానము ఎటనుండి వచ్చెనో నుడువుము. నీ వెంతో జ్ఞానవంతుడవు కాన, భూపథకమును కొలబద్దతో కొలిచి, దానిని రూపొందించినది నీవా, నేనా చెప్పుము " జోబు 8 : 5.

జోబు గ్రంథము వ్యథల సమస్యను పూర్తిగా పరిష్కరించకయే, ఉపయుక్తమైన, సమర్థనీయమైన త్రివిధపరిష్కార మార్గముల సూచించుచున్నది. ఇంతటితో సర్వేశ్వరావిష్కరణము పూర్తియైనదని చెప్పజాలము. వీనినిగూర్చి తలపోయుటవలన మనోవికాసము కలుగక మానదు. ఈ గ్రంథమందు అత్యున్నతస్థాయి నందుకొనిన భగవత్ ప్రవచనమే మొదటి సమాధానము. తన్మూలమున సర్వజ్ఞుడగు సర్వేశ్వరునిపట్ల వ్యథాభరితులు గాఢవిశ్వాసమును ప్రదర్శింపవలసియున్నది. మానవులు భగవత్ చిత్తసంకల్పములను పూర్తిగా ఆకళింపుచేసికోజాలరని వ్యక్తము చేయబడినది. కాగా మానవుడు తానర్థం చేసికోలేని సమస్యలను అంగీకరించుట సమంజసము. సర్వజీవదయాపరుడగు సర్వేశ్వరుని శంకించరాదు. భూచరములను, ఖేచరములను పోషించున దెవరు కాకములను

మనలో నెవరు పోషించుచున్నారు? వానిపిల్లలు తలడాల్చు టకు నెలవు లేమి? తిండి నిమిత్తము దేవునికి కదా మొరపెట్టు నది" జోబు. 38 : 4 . ఈ వాక్యములద్వారా ఆబాలగోపాల మునకు ఆత్మవిశ్వాసం కలుగకపోదు. మనసు కుదుట బడును. సమస్య మాత్రము పరిష్కృతం కాదు.

రెండవ సమాధానము జోబుని గ్రంథముయొక్క తొలి పలుకునందును, ఆయన మిత్రుల హితోపదేశమందును పొందు పరచబడియున్నది. తన భక్తులు ప్రామాణికులా, కారా? అని తెలిసికొనుటకు భగవంతుడు వారి నిట్లు పరీక్షించును. తదాశయ సిద్ధికి బాధలు సాధనములు. వీనిద్వారా ఆధ్యాత్మి కానుభవము, చిత్తశుద్ధి చేకూరగలవు. "దిక్కులేనివారిని ఆయన రక్షించును.....వారనుభవించు బాధలద్వారా, వార లతో ఆప్యాయముగా మాటాడును. (s ea ome) జోబు 36. 5.

మూడవ సమాధానముకూడ గ్రంథ టీకయందు వ్యక్తము చేయబడినది. పైశాచిక యీర్ష్యాసూయలు మానవ వ్యథలకు కారణము. పరిశుద్ధగ్రంథపు ఆదికాండమున మానవులకు పిశాచికి మధ్యగల నిరంతర ద్వేషము ఉల్లేఖించ బడినది.

నాలుగవ సమాధానము సూచించబడినట్లు గోచరిం చును; మనులోకములో ఎవరెవరికి సంక్రమించెడి ప్రాయశ్చి త్తము దీనిని వ్యక్తము చేయుచున్నది. ఈ సందర్భమున జోబు పలికిన సుభాషితములు కడుగమనార్హములు. నీ విముక్తి

ప్రదాత సజీవుడై యున్నాడని అంత్యదినమున నేను భూమి నుండి ఉత్థానమగుదునని నేనెఱుగుదును. నేను తిరిగి నా శరీరముతో కప్పబడుదును, నా శరీరముతోనే దేవుని గాంచుదును. జోబు 26 : 25. అంత్యదినమున మన బాధలకు ప్రతిగా సూక్ష్మ శరీరమును పొందగలమను సూచనలుగలవు. తోబ్యాసు చరిత్రయు ఇదే సమస్యనుగూర్చి ఉద్బోధిస్తున్నది. కాని యది కవితాచాతుర్యములేని సామాన్య రచన. అయినను ఈ గాథలో గల మానవత్వము, సుహృద్భావ సౌమనస్యము లద్వితీయములు. అస్సీరియా భూభాగములో జూదులు పరదాస్యం చేయునప్పుడు దుర్భరయాతనలకు గురియైన ఇజల్ పుణ్యకుటుంబానికి చెందిన దీ గాథ. చివరకు కుటుంబ యజమాని తోబ్యాసు అంధుడగుట తటస్థించును. ఉదరపోషణార్థము భార్య చిన్నకుమారునితో కూలిపని చేయవలసి వచ్చినది.

కథలో సందర్భానుసారముగా "సారా" యను నిర్భాగ్యయువతి గోచరించుచున్నది. ఆమె అతి సౌందర్యవతి, కాని ఆమెను వరించిన యువకు లందరికి దుర్గతి పట్టినది. ఈ సందర్భంలో రచయిత, పూర్ణ విశ్వాసముతో వ్యధలను సహించెడి దరిద్రులకు భగవత్ సహకార సహాయ్యములు చేకూరునని సూచించుచున్నారు. నిర్భాగ్యుల కిది పరీక్షా సమయమని ఆయన నమ్మకము. ఆ మీదట మానవజీవితములో దేవదూతలు వహించెడి గురుతర పాత్రనుగూర్చి ఉగ్గడించారు. అస్మొదేయుస్ అను పిశాచి సారమ్మను హింస పెట్టి ఆమెను వరింప వచ్చిన పురుషులను హతముచేసిన

వృత్తాంతము. అస్మొదేయుస్ బారినుండి సారమ్మను రక్షించి ఆమెను తోభ్యాని కుమారుని కిచ్చి పరిణయము గావించి, ఆయనకు దృష్టి ప్రసాదించి నటువంటి రఫయేల్ దేవదూత వృత్తాంతము సవిస్తరముగా నిందు వివరించబడినది. మానవ చరిత్రలో దేవదూతలకు పైశాచిక బలముల మధ్య జరిగెడి సంఘర్షణల సారాంశము యీ చిన్నకుటుంబమందు ప్రతి బింబించ బడినది. ఇదే విషయము సువిశేష కారులు పేర్కొన్నారు.

ఇక మకబేయుల వీరచరిత్రలో వ్యథల సమస్య స్పష్టముగా పరిశోధించబడినది. పాపకర్మల దుష్కృతములకును ఏతత్ శిక్షదండనలకును మధ్య సామ్యము కలదని సూచించబడినది.

జూదులను ఘోరహింసలకు గురిచేసినటువంటి దుష్టుడు, దేవదూషకుడైన అంతియోకుస్ ఎపిఫానెస్‌కు పట్టిన దుర్గతిని ఇశ్రాయేల్ ప్రజలందరు. గుర్తించినారు "ట్లు నరహంతకుడు, దేవదూషకుడైన అంతియోకుస్ గృహమునకు సుదూరముననున్న పర్వత ప్రాంతమున కడు నికృష్టమైన మరణము పొందినాడు. వాని చర్య లెంత దారుణమైనవో వానిని కూల్చివేసిన ఘాతం అంత క్రూరమైనది."

2 మకబేయులు : 9 : 28.

జూదజనములు తమ శత్రువుల మూలమున అనుభవించిన ఘోరయాతనలు భగవంతుడు వారిని సుశిక్షితులనుగా జేయుటకై వినియోగించిన సాధనములు. ఇటులాశత్రువర్గము

తెలియని రీతిగా దైవన్యాయము వగదెంచినది. సోదర మకబేయులలో నారవవాడు తన్ను చిత్రవధ చేయించిన నియంతను జూచి "నిరర్థకమగు ఆశలతో నీకై నీవు ఉప్పొంగవలదు. గతిగానక మా దైవమునకు విరోధముగా పాప మాచరించినది మా స్వయంకృత్యములే."

2 మకబే : 7. 8.

మృతవీరుల తీవ్రయాతనలు శాంతి సామరస్యముల చేకూర్చుటకు సాధనములైనవి. తదనంతరము పవిత్ర రచనలు దారుణ బాధలకు ప్రతిగా వారు పొందనున్న, పారలౌకిక సుఖ సౌఖ్యములను గూర్చి ప్రస్తావించుచు వచ్చినవి. "తాత్కాలికమైన బాధలు ఆయన చిత్తానుసారముగా నా సోదరులకు నిత్య జీవమును సముపార్జించినవి. నీవు మాత్రము ఆయన తీర్పునకు గురియై నీ గర్వమునకు తగిన ప్రాయశ్చిత్తము చేయవలదా ?"

2 మకబే : 7: 6.

మహిమాన్వితమగు శరీరపునరుత్థానము మృతవీరులందు అపూర్వ చలనము కలిగించి వీరోచిత కార్యములకు ప్రేరేపించినది. "ఈ తాత్కాలిక జీవమును మానుండి తొలగించ నీకు శక్తికలదు. ఎవరి శాసనముల నిమిత్తము మేము బ యగు చున్నామో అట్టి లోకేశ్వరుడు మమ్ము తిరుగ లేపి నిత్యజీవమునకు కొనివచ్చును."

2 మకబే : 7.9

క్రీస్తుకు పూర్వము రమారమి 50 సంవత్సరముల క్రితము రచించబడిన విజ్ఞాన గ్రంథమందీ సమస్య కూలంకషముగా చర్చించబడినది. విశేషించి ఈ గ్రంథము మానవాత్మలు శాశ్వతములని నొక్కి వక్కాణించినది. కావున మరులోకమందు మానవులకు శిక్షాసంభావనలున్నవని విస్పష్టము చేయబడినది,

గేయకారుడు సహిత మిదే భావమును పలుమారులు ఉదహరించినాడు. మరణానంతరము సమస్తులకు న్యాయము వగదెంచబడునని ఆయన దృఢవిశ్వాసము.

"మృత్యుస్థలమున నీవు నన్ను విడనాడవు. నీ ప్రియమానికపు సేవకుని పంచత్వ మొందనీయవు. నాకు జీవనపథమును చూపించితివి. నీ సమక్షమున నాకు అమితానందమును కలిగించితివి. నీకుడిచేతికడ నిత్యము మనగల ఆనందమున్నది." దా. గే : ౧: ౦- . "మరణము భగవంతుని సంకల్పము కాదు. ఆయన సంతుష్టికొరకు జీవము అంతమొందుటలేదు."

విజ్ఞాన : : ౩.

ఇకముందు, మానవాత్మలకు శాంతిచేకూరు విధమున వ్యథల సమస్యలను పరిష్కరించ వచ్చును. అయినను అది వేదరహస్యముగ నుండును.

"కాని నీతిమంతుల యాత్మలు భగవంతుని కరములందున్నవి. ఉపద్రవమేదియు మరణములో సహితము వారి నంటజాలదు. మరణించిరా ? మూఢు లట్లు తలపోయుదురు. వారల గతి నష్టభూయిష్టమనియు వారల వియోగము

శూన్యాత్మకమని భావించుదురు. కాని వారలకు సర్వము సుఖదాయకము. వార లనుభవించు బాధలు తప్ప, లోకము మరేమికాంచలేదు. వారల కండ్లకోయన శాశ్వతమైనది మాత్ర గోచరించును. వారల బాధ లెంత సూక్ష్మములో వారి లభించు సంభావన అంత గురుతరమైనది.

భగవంతు డింతకాలము వారిని శోధించెను. పరీక్షించిన మీదట వారు తనకు యోగ్యులని గుర్తించెను. ఆయన బంగారము పుటము వేయబడినది. ఆయన దాహనబలి ప్రసన్నముగా అంగీకరించబడినది. వారు మాత్రము తమ విముక్తి కాలమునకై నిరీక్షించుచున్నారు."

విజ్ఞాన : . – .

ఇక్లే దుష్టులు, భక్తిహీనులు, తమ దుష్కృతములకు తగిన ఫలమును అనుభవించుదురు.

"ఋజుమార్గమునుండి మన తలపులు దూరమైనటుల తోచుచున్నది; నైతిక కాంతి కిరణమెన్నడు వారిని వెలుగొందించలేదు, సత్యభాస్కరు డెన్నడు ప్రజ్వలించలేదు. వినాశకరమగు ఆ తుందుకు మార్గము అలసట కలిగించినది. ప్రభువు ఉద్దేశించిన మార్గమును తప్పి మేము యెడారులందు ఏకాంతముగా పయనించితిమి, అహంకారయుతమైన మా డంబాచారము వలన ప్రయోజనమేమి వ్యర్థసంపదల వలన మాకు కలిగిన మేలేమిటి"

విజ్ఞాన : :6–౮.

విజ్ఞాన గ్రంథపఠనము వలన యూదుల దృక్పథము కొంతవరకు మారిపోయినది. ఇహలౌకిక జీవితములోని గుణా గుణములు తాత్కాలికములనియు, పారలౌకిక జీవితమందలి సుఖసౌఖ్యములు శాశ్వతము లనియు తెలిసికొనిరి.

శ్రమల మూలమున పాప దోషములకు ప్రాయశ్చిత్తము చేయగలమను భావము సహితము ప్రజలలో ఉదయించినది.

"ఆయన సదా మన దుష్కృతముల నిమిత్తము గాయ పరచబడెను. మన పాపదోషములే కదా ఆయనను అణగ ద్రొక్కినవి. మనకు శాంతి చేకూర్చిన ప్రాయశ్చిత్తము అతనిపై బడెను. అతని వ్రణముల మూలమున మనము చికిత్స పొందితిమి. అపరాధ పరిహారణకై ఆయన ప్రాణమును బలి పెట్టెను. అయినను అతనికి సంభావన చేకూరును. అనేక తర ములకు అతడు పితామహుడు కాగలడు. భగవత్ సంకల్పము నతడు సాధించును. ఆయన హృదయ వేదన యంతయు పూర్తిగా సంభావించబడును."

ఇజయాసు : 5 : , 0– .

వ్యథల సమస్యను గూర్చి దైవావిష్కరణము యింత టితో సంతమొందినట్లు కానుపించును. ఇంత దనుక బాధల పుట్టుపూర్వోత్తములను ఏతత్ కారణాంతరములను సత్ఫలిత ములను సాధక బాధకములను గూర్చి తెలిసికొంటిని. భగ వంతునికి మాత్రము వ్యథానుభవము లేదు కాని యాతనలు తన భక్తుల పాలిటి పెన్నిధి; తన మిత్రుల పాలిటి శరణాగతి,

ఒక్కొక్కప్పుడు అకాలమరణము సహితము భగవదను
గ్రహముగా పరిణమించవచ్చును.

“పాపకర్మలతో భాగస్వామినియైన ఆయన జీవమును భగవదనుగ్రహము, దైవానురాగములు హరించి వేసినవి.

దుష్టత్వము అతని తలపులను పెడవత్రోవల పట్టించక పూర్వమే, దుష్కృత్యము అతని హృదయమును ఆకర్షించక మునుపే, అతనిని కొనిపోయినవి... ...అచిర కాలములో నతడు సాధించిన ప్రవీణత దీర్ఘకాలిక శిక్షణగా పరిగణించ బడినది.”

విజ్ఞాన : : 0, , 3.

౨వ అధ్యాయము

# వ్యధల సమస్య - నూతన నిబంధన

భగవత్సుతుడు నరావతారమూలమున సోదరమానవులవలె వ్యధల ననుభవింప కలిగెను. హీబ్రూలకు వ్రాయబడిన లేఖలో ఈ విషయము స్పష్టీకరించబడినది. "సమస్త వస్తువులకు అంత్యగతియు, సర్వపదార్థములకు ఆద్యారంభము నైన భగవంతుడు, తన పుత్రులందరిని మహిమాన్వితులగుటకు చేరబిలచి, వారలను రక్షింపబూనిన రాకుమారుని జీవితమును వ్యధాకిరీటాలంకృతంచేసి తన ఔచిత్యమును ప్రదర్శించెను.

హీబ్రూ : 2: 10.

క్రీస్తు ప్రధానాచారి పాత్రను వహించినందువలన ఆయన బాధలు వాటిల్లినవి. "క్రీస్తు తన యిహ లౌకిక జీవితమందు తనను మృత్యువునుండి కాపాడగల భగవంతుని చూచి కన్నీటి బాష్పములతోను, మహాక్రందనలతోను ప్రార్థనా విజ్ఞాపనములను సమర్పించగా ఆయన భక్తి పారవశ్యమువలన ఆ మొర ఆలకించబడెను. ఆయన భగవత్ సుతుడై యుండియు, వ్యధల మూలమున విధేయత యందు శిక్షణ పొందెను. ఇప్పుడాయన సంపూర్ణ విజయమునుసాధించినందున తన యెడల విధేయులై ప్రవర్తించువార లందరి శాశ్వత రక్షణమును సముపార్జించినాడు"

హీబ్రూ : 5: 7-9.

మన యీ నికృష్ట జీవితానుభవమును, ఆయన వహించిన మానవాకృతి మూలమున పరమందు శాశ్వముగా పదిల పరచినాడు. "ఏలన మన ప్రధానాచార్యుడు మనకు కలిగిన అవమానములను జూచి మనయెడ సానుభూతి కనబరచలేని వాడనికాదు, కాని ఆయన మన ఆకృతిని ధరించి పాపవిషయ మున తప్ప సమస్త పరీక్షలకు గురికాగలిగెను."

హెబ్రూ : 4: 5

ఇక సుభవార్త లీ విషయమును తరచకుండినవికావు. వ్యధల సమస్యను గూర్చి చెప్పబడిన అంశములు కడు అమూల్యములు. నైతిక, భౌతిక డులందు గోచరించును. పాపదోష ఫలితమగు నరకాగ్నిని గూర్చి మాటాడుటకు ఆయన జంకలేదు. "కాబట్టి నీకుడికన్ను నీకు పాపహేతువుగానుండు పక్షమున, దానిని పెరికి నీకు దూరముగా పారవేయుము. ఏలయన - శరీరమంతయు నరకములో ద్రోయబడుటకంటె నీ అవయవములలో నొకటి భ్రష్టమగుట నీకు మేలుకాదా

మత్తై : 5:29.

"ఆత్మను చంపజాలక శరీరమును మాత్రము చంపగల వారలను జూచి భీతిల్లకుడు; ఆత్మ, శరీరముల రెంటిని నరకమున కూల్చ శక్తిగలవారికి మీరు అధికముగ భయపడుడు."

మత్తై : 0–29.

నరక-క్ష అన్నిటికంటెను గొప్పకీడు. దీనిని తొలగింప ఎవరి సాధ్యముకాదు. సామాన్యబాధలను సహి ండనవలసి

నదే. తా ననుభవింపనున్న వ్యయాతనలను గాంచి భయాందోళనల చెందుటకు జేసువు వెనుదీయలేదు. ఆయనకు మరణము దాపురించినపుడు గోధుమగింజ భూమిలో కుళ్ళి నశించిన తప్ప ఫలించదని యిట్లు ఆక్రందన చేసినాడు. "ఇప్పుడు నాయాత్మ కలవరపడుచున్నది. మరి నేనేమి వచింపగలను ఓ తండ్రీ వ్యధా భరితమగు ఈ గడియ నుండి నన్ను కాపాడుము. అయినను నేసీ పరీక్షా కాలమునకు గురికాదలచి, దాని దాపు చేరితిని అని చెప్పెదను."

జ్వాన్నే : 2. 27.

గెత్సమని తోపులో గురుద్రోహి జూదాసును గాంచి ఆయన ప్రదర్శించిన ఆవేదన భయాందోళన లంతింతకావు. "తండ్రీ నీకిష్టమైనయెడల ఈ మృతపాత్రమును నానుండి తీసివేయుము."

లూకా. 22. 2

ఆ మీదట దేవదూత మూలమున బాధోపశమనమును పొందినాడు. తీవ్రవేదనలో నుండియు అత్యంతాసక్తితో ప్రార్థించినాడు. "ఆయన చిరుచెమట చిక్కని రక్త బిందువులవలె పుడమిపై పడెను."

లూకా : 22. .

స్టోయికుల హఠవాదం బహుళ ప్రచారంలో నున్న రోజులవి. శ్రమబాధలను వారు తృణప్రాణయంగా నెంచెడి వారు. లేక ఉపేక్షించి మిన్నకుండెడివారు. ఇదియే, లోక

మునకు వారందజేసిన ఆదర్శం. దాక్షిణ్యరహితముగ నీ దృక్పథమును భక్తపౌలుడు ఖండించినాడు. బలప్రయోగ మునకు ధైర్యసాహసములకు ప్రాధాన్యత నిచ్చిన రోజులలో, వీరోచిత కార్యములను అభినందించెడి వారా ప్రజలు. బాధ లను అవహేళనం చేసినారు. వ్యధలకు లొంగిపోవుట పురుష లక్షణంకాదని వాదించినారు.

ఇక క్రీస్తుమత సాక్షు( ar yrs) లనేకులు చిత్రవధ లకు గురియై ఆనందాతిశయమును ప్రదర్శించినారు. క్రీస్తు స్వామి మాత్రము తన బాధలను సర్వసామాన్యముగా అనుభ వించుటకు చిత్తగించినారు. సవినయముగా వానిని ఆలింగనము చేసినారు. వారా బాధలను తృణప్రాయమని యెంచలేదు. వానిని తిరస్కరించనూలేదు, కాని మానవజాతి విముక్తికై బలిదానము చేసినారు. ఆయన భక్తులనేకులు యిదే వైఖరిని అవలంబించి ఘోరాతిఘోరమైన యాతనలకు గురియైరి. "ఓ తండ్రీ! నీకు సర్వము సుసాధ్యము, కావున ఈ మృత పాత్రమును నా యొద్దనుండి తొలగింపుము. అయినను నా యిష్టముకాదు; కాని నీ యిష్టమే నెరవేరునుగాక".

మార్కు : :

ఇంతియేగాక ఆయన బాధితులయెడల సానుభూతిని ప్రదర్శించినాడు. నాయిమ్‌పురమందు ఏకైక పుత్రవియో గమువలన విలపించుచున్న విధవ మాతృమూర్తికి బాధోప శమనమును చేకూర్చి శవపేటికపైగల మృతప్రాయునికి ప్రాణ భిక్షం పెట్టినారు. ఆయన దయార్ద్ర హృదయమే యిటువంటి

మహిమాద్భుతములను కావించినది. లూకా : 7- .
ప్రజలయొక్క శారీరక అవసరములను సహితము తీర్చుటకు సంకోచింపలేదు. ఆయనను దివారాత్రములు అనుగమించిన ప్రజానీకములకు అద్భుత విధమున తనవిదీర భోజనము పెట్టినారు. "ఈ జనులపై నాకు కనికరము కలుగుచున్నది. ఎందుకన, యిదిగో వీరలు మూడుదినముల పర్యంతము నాతో నున్నారు. భుజింప వీరికి నేమియులేదు. ఉపవాసముతో వీరల నిండ్ల కంపించిన మార్గమధ్యమున శుష్కించిపోదురు. ఏలయన వీరలలో కొందరు బహుదూరమునుండి వచ్చినవారు." మార్కు : 8 : 2- .

ప్రజలయొక్క ఆధ్యాత్మిక తృష్ణను కూడ తీర్చుటకు ఆయన విస్మరించలేదు. "... జేసువు హేరాళ జనసమూహమును గాంచి, వారలు కాపరిలేని గొఱియలవలె నున్నందున, కనికరపడి వారలకు సుదీర్ఘముగా హితోపదేశమును గావించెను." మార్కు : 6 : .

తన స్నేహితుడు లాజరుడు హఠాత్తుగా మరణించినపుడు అతని తోబుట్టువుల యెడ ప్రదర్శించిన దయా కనికరము లద్వితీయములు. "అయినను మరియమ్మ జేసువు నిలచియున్న స్థలమునకు వచ్చి, ఆయననుగాంచి పాదములపై పడి; ప్రభువా! నీ విక్కడ యున్నపక్షమున నా సహోదరుడు మరణించక యుండుననెను. ఆమె విలాపమును జూదులరోదనమును జేసువు అవలోకించి నిట్టూర్పు విడచి, తద్విషయమై సంక్షుభితుడై, అతనిని మీరెక్కడ పూడిచిపెట్టితిరని ప్రశ్నిం

మహిమాద్భుతములను కావించినది. లూకా : 7- .

ప్రజలయొక్క శారీరక అవసరములను సహితము తీర్చుటకు సంకోచింపలేదు. ఆయనను దివారాత్రములు అనుగమించిన ప్రజానీకములకు అద్భుత విధమున తనవిఁర భోజనము పెట్టినారు. "ఈ జనులపై నాకు కనికరము కలుగుచున్నది. ఎందుకన, యిదిగో వీరలు మూడుదినముల పర్యంతము నాతో నున్నారు. భుజింప వీరికి నేమియులేదు. ఉపవాసముతో వీరల నిండ్ల కంపించిన మార్గమధ్యమున శుష్కించిపోదురు. ఏలయన వీరలలో కొందరు బహుదూరమునుండి వచ్చినవారు." మార్కు : 8 : 2- .

ప్రజలయొక్క ఆధ్యాత్మిక తృష్ణను కూడ తీర్చుటకు ఆయన విస్మరించలేదు. "... జేసువు హేరాళ జనసమూహమును గాంచి, వారలు కాపరిలేని గొఱియలవలె నున్నందున, కనికరపడి వారలకు సుదీర్ఘముగా హితోపదేశమును గావించెను." మార్కు : 6 : .

తన స్నేహితుడు లాజరుడు హఠాత్తుగా మరణించినపుడు అతని తోబుట్టువుల యెడ ప్రదర్శించిన దయా కనికరము లద్వితీయములు. "అయినను మరియమ్మ జేసువు నిలచియున్న స్థలమునకు వచ్చి, ఆయననుగాంచి పాదములపై పడి; ప్రభువా! నీ విక్కడ యున్నపక్షమున నా సహోదరుడు మరణించక యుండుననెను. ఆమె విలాపమును జూదులరోదనమును జేసువు అవలోకించి నిట్టూర్పు విడచి, తద్విషయమై సంక్షుభితుడై, అతనిని మీరెక్కడ పూడిచిపెట్టితిరని ప్రశ్నిం

నాడు అను ఇజయాస్ దీర్ఘదర్శి ప్రవచనములు ఆయనను చక్కగా వర్తించును. అనుభవపూర్వకముగా ఆయనను తెలియని మానవ వ్యథలు అంటూ లేవు. అందువలన పునరుద్ధరణమందిన మానవజాతికి ఆయన తలమానికం కాగలిగినాడు. వ్యాధిగ్రస్తులకు ఆరోగ్యము చేకూర్చునపుడు, క్రీస్తు బాధల పుట్టుపూర్వోత్తరములగూర్చి పలుసూచనలు గావించిరి. పాప దోషఫలితముగా జాడ్యములు కొన్ని సంభవించుట గలదు. పక్షవాతము రోగితో క్రీస్తు "ఇదిగో, నీకు ఆరోగ్యము కలిగినది. దీనికంటెను చేటుకరమైనది వాటిల్లకుండునట్లు నీవిక పాపమునకు వడిగట్టవలదు" అని నుడివినాడు. జ్వా : 5.

కొన్నిమారులు పైశాచిక బలముల బాధలకు హేతుభూతము లగుటయు గలదు. "గత పదునెనిమిది యేండ్లనుండి సైతానుచే బంధించబడిన యీ అబ్రహాముని కుమార్తెను సబ్బతునాడిటువంటి బంధములనుండి విడిపించుట అపరాధమా ?"

లూకా : 3 : 6.

దైహిక బాధలన్నియు పాపదోష ఫలితములు కావని వేరొకచోట వ్యక్తముచేసినారు. "గురువా యీ వ్యక్తి అంధుడుగా జన్మించుటకు కారణము, ఇతడు చేసిన పాప దోషమా, లేక వీని జననీజనకులు చేసినదా" అన విని క్రీస్తు "దోషి ఇతడు కాడు; వీని తలిదండ్రు లెవరు కారు. సర్వేశ్వరుని శక్తి యితనియందు ప్రదర్శిత మగుటకు ఇట్లు సంభవించె"నని నుడివినారు.

జ్వా : 9—3.

స్తు నిత్యభగవద్దర్శన మూలముగా ఆత్మశాంతిని అనుభూతిచేసినాడు. పరమానంద పరవశుడు కాగలిగినాడు. ఇట్లు ఆయన అంతరాత్మ ప్రశాంతమయమైనందుచేత పాప దోష యాతనా పరంపరలు మనకువలె ఆయనకు అంతరాయ ములు కాకపోయినను, ఆయన వానిని విషాదసంఘటనలుగా గుర్తించినాడు. భగవత్ పథకమందు దునకుసహా స్థాన మున్నది. దేవరాజ్య క్షేత్రమందు గోధుమ బీజములతో సహా కలుపువిత్తనములు వెదపెట్టిన దుష్టశక్తులు, పైశాచిక బలము లని గుర్తించగలము. మానవజాతిని సజ్జన,దుర్జన యని రెండు తెగలుగా విభజించుట సమంజసము కాదు. సజ్జనులు పూర్తిగా సద్గుణులుకారు, తుచ్ఛవాంఛలు వారిలోకూడా లేకపోలేదు. ఇక దుర్జనులు కేవలము దుష్టులు కారు. వారిలో కూడా సద్భావము లున్నవి. కాబట్టి మానవులందరు పాప కర్ములు. “మనలో పాపము లేకేము, దానిని కాదనిన ఆత్మ వంచకులమగుచున్నాము” జ్వా : : 8. గోధుమపు పంట చేలో కలుపుమొక్కలు పెనగొనియున్నవి. కాన పంటకు నష్టములేకుండ వానిని వేరుపరచుట కష్టదాయకము “కాబట్టి అలుమును పోగుచేసి అగ్నిలోవేసి కాల్చిన చందమున లోకాంత్యమున మనుష్యులకు జరుగును. మనుష్యకుమారుడు తన దూతలకు అధికారము అప్పగించును. వారు దేవరాజ్య మందు పాపనేరగ్రస్తమైన సమస్తమును అందలి దుర్మార్గు లను పోగుచేయుదురు.” మత్తై : : 0- .

భగవత్ పథకమందలి మానవదృష్టికి విడ్డూరముగా కనిపించే వేరొక సూత్రమే మన వ్యథలు. దివ్యజ్యోతి

సహజ మార్గప్రదర్శకములనుట. ఆయన శిష్య ప్రశిష్యులు దీని భావార్థము క్రొత్తలో గుర్తించలేదు. తొలిసారిగా క్రీస్తు తన యాతనాయుత మృత్యువునుగూర్చి ప్రస్తావించినపుడు పేతురుస్వామి గద్దించుటకు వెనుదీయలేదు. "ప్రభువా మీకెన్నటికి చేటు వాటిల్లకుండుగాక," అన విని క్రీస్తు "మరలిపో సైతానా, నా మార్గమున, నీవొక ప్రతిబంధకము, యివి భగవత్ భావములు కావు, మానవమాత్రములు" మత్తే: 6:22-23. అని నుడివెను. ఈ మాటకు పేతురు కలవర పోయినాడు. ఇదే విషయమును క్రీస్తు పలుమారులు పలుతెరగుల ప్రవచించినను వారు దాని భావార్థమును ఏ కోశమందును గ్రహించినటుల కానము.

క్రీస్తుతోపాటు శిలువమరణము పొందిన తస్కరులలో నొకడు తొలిసారిగా వ్యథల గూఢార్థమును ఆమూలాగ్రముగా గ్రహించుటయు కడు గమనార్హము. శిలువయే స్వర్గరాజ్యమహిమకు మార్గమని అతడు గుర్తించినాడు. "ప్రభువా నీవు నీ సామ్రాజ్యమును చేరినపుడు నన్ను స్మరించుకొను"మని వేడినాడు. లూ:23: 2.

యుగయుగాలనుండి తాము నిరీక్షించిన లోకోద్ధారకునిగూర్చి యూద ప్రజలకు గల అభిప్రాయములు సహితం లోప భూయిష్టములు. క్రీస్తు శిలువయాతనల మూలమున మహిమాన్వితుడగుట వారలకు విడ్డూరముగా గోచరించినది. ఎమ్మావుస్ యాత్రికులు ఇదే దృక్పథమును ప్రదర్శించినారు. మృత్యుంజయుడగు క్రీస్తు మార్గమధ్యమున వారిని గలసి

యీ వేదరహస్యమునుగూర్చి విశదీకరించినాడు. "క్రీస్తు ఇట్టి యాతనలకుగురియై తద్వారా మహిమాన్వితుడగునని నిరీక్షించ బడలేదా ?లూ :2 :26

ఇది యంతయు భగవదభీష్టానుసారముగా జరిగినదని క్రీస్తు వారికి పవిత్ర రచనల మూలముగా నిరూపించినారు. మన ప్రభువు వేదనలు తన పాలిటి శత్రువని తలపక, ఎలా ఆలింగనము చేసినారో, అదేవిధమున వానిని తన అనుయాయుల పక్షమున స్వీకరించారు. ఇదే విషయమును తన మాతృదేవికి వర్తింప చేసినారు. "మరి నీ హృదయము నొక ఖడ్గము పొడచి తెరచును." లూ : 2 : 5

తన శిష్య ప్రశిష్యులకు సహితము ఈ సూత్రము వర్తింప చేసినారు. ఎవరేని నామార్గమున రాదలచిన యెడల వాడు స్వార్థమును వీడి, తన స్లీవను గైకొని నన్ననుగమించ వలెను. తన జీవమును కాపాడ యత్నించువాడు దానిని పోనాడును. నా నిమిత్తము తన జీవమును పోనాడువాడు దానిని భద్రపరచుకొనును." మత్తే : 6 : 2 -25

"లోక ముల్లసిల్లుచుండ మీరు విలపించి రోదన చేయుదురు. మీరు సంక్షుభితులగుదురు. మీ ఖేదము ప్రమోదముగా పరిణమించునని నేను మీతో నిశ్చయముగా నుడువుచున్నాను. తన కాల మాసన్నమైనపుడు స్త్రీ ప్రసవ వేదనల అనుభవించును. అయితే తన బిడ్డను కన్న మీదట లోకమందు మానవు డొకడు ఉద్భవించెనను ఆనందముచేత ఆ వేదనను గూర్చి స్మరించదు. ఇట్లే మీరును యిపుడు శోకించు

చున్నారు. కాని మిమ్ము నేనొకపుడు మరల గాంచెదను. అంత మీ హృదయములు ఆనందించును."

జ్వా : 6 : 20-2

"సేవకుడు యజమానికంటె గొప్పవాడు కాజాలడని నేను మీతో నుడివినది విస్మరించవలదు. నన్ను హింసించిన చందమున మిమ్మును హింసించుదురు "జ్వా : 5 : 20. "లోక మందు మీరు ఉపద్రవములను మాత్రము ఎదుర్కొందురు. అయినను ధైర్యము వహింపుడు. ఎందుకన లోకమును నేను వశపరచుకొంటిని." జ్వా : : ... ఇటువంటి వార్తలెప్పుడు అతని పెదవులపై తాండవించినవి.

మరియు ఆయన దృక్పథమందు వ్యథలు విచిత్ర పరిణామము దాల్చినవి. వాని యొక్క విలువలు తారుమారైనవి. ఏలయన వేదనలు మానవ క్షేమాని అంతరాయములు కాజాలవు. నిజానికవి సుఖదాయకములని స్తు నొక్కి వక్కాణించినారు. ఇదియే భక్తాగ్రేసరుల అనుభవముకూడా. అష్ట భాగ్య సూత్రము లీవిషయమును ఘోషించుచున్నవి. దరిద్రులు, సహనశీలురు, దుఃఖితులు, ధర్మప్రియులు, హింసితులు యిత్యాదులందరును వ్యథలను గూర్చి కూలంకషముగా తెలిసినవారు. అయినను వారి జీవితములు సుఖప్రదమై యుండును. కాని సంపూర్ణానందం స్వర్గమందు మాత్రము లభ్యం కాగలదు. కాని ఇప్పుడే వారు పారలౌకిక సుఖసౌఖ్యముల చవిచూడగలరు. దారిద్ర్యులు దేవరాజ్యమందు భాగస్వాములగుచున్నారు. సహనశీలురు భూతలమును వశపరచు

కొనుచున్నారు. నిర్మల హృదయులకు భగవద్దర్శనభాగ్యము లభ్యమగుచున్నది. "నన్ను గూర్చి మనుష్యులు మిమ్ము నిందించి, హింసపెట్టి మీపై అసత్యముగా సమస్త అపదూరులు మోపినపుడు మీరు ధన్యులు, మీరు ఆనందించి ఉల్లసిల్లుడు." మత్తై : - 2.

వ్యధాభరితులు మాత్రము శుభవార్తల సుఖసౌఖ్యములను చవిచూడగలరు. ఇక ధనికులు, సంతృప్తి చెందిన వారు యిత్యాదులందరికి భగవంతునికడ స్థానములేదు. వారు ఉన్నదానితో సంతృప్తి చెందుదురు గాన, వారికి జీవిత పరమావధి శూన్యం. ఆధ్యాత్మిక ఆనందాతిశయములు వారికి దురూహ్యాం. "ఉన్నత మందున్న వానిని వారలు అన్వేషించలేరు, ప్రేమించలేరు. వారు శాపగ్రస్థులు." "ధనికులారా... ...సంతృప్తి చెందినవారలారా... ... అట్టహాసకులారా... ...మీకనర్థము." లూకా : : 2 26

నూతన నిబంధనయందు దును గూర్చి చెప్పబడిన ముఖ్యాంశము క్రీస్తు మరణమునకు సంబంధించినదని విస్పష్టమగుచున్నది. "ఆమె యొక కొమరుని కనును. ఆయనకు జేసువను పేరిడుము. ఏలయన అతడు తన ప్రజలను వారి పాపములనుండి రక్షించును." మత్తై : : 2. జేసువను పేరునకు ముక్తిదాత అని అర్థము. ఆ బిడ్డడు జూడ జాతికి దాస్యవిముక్తి కలిగించుటకు రాలేదు. మానవజాతి కష్ట నిష్ఠూరములను బాపుటకు విజయము చేయలేదు. జగత్తుకు విముక్తి కలిగించునది, ఆయన చేసిన నైతిక ప్రబోధ మాత్రమేకాదు,

ఆయన సుమాతృక మా తముకాదు, కాని ఆయన అనుభ వించిన యాతనాయుత మరణము జగత్తుకు విముక్తి కలిగిం చును. "మనుష్య కుమారుడు తన జీవమును అనేకుల జీవముల నిమిత్తము బలిదానము చేయుటకు వచ్చెను."

మార్కు : 0 : 5.

ఇదే అంశమును ఆయన ·ష్యులు తమతమ రచన లందు చర్విత చర్వణము చేసినారు. "మీరు మీ సొత్తుకారు; గొప్పవెలతో కొనబడితిరి" కనుక మీ దేహములను ఆయన ఆలయములుగా చేసికొని సర్వేశ్వరుని మహిమపరచం . కొరింతి : 6 : 0 "మిమ్ము తిరుగా కొనుటకు వెల చెల్లించ బడినది; కాబట్టి మీరు మానవ యజమానులకు దాస్యము చేయవలదు." కొరింతి : 7 : 2.

భక్తపౌలుడు తన అనుంగు శిష్యుడైన తిమొతి మహా శయుని కిట్లు వ్రాసినాడు : "సర్వేశ్వరు డొక్కడే. సర్వేశ్వ రునికి మానవులకు మధ్యవర్తియు ఒక్కడే. అతడే వారివలె మానవుడైన జేసు స్తువు. ఆయన సమస్తుల నిమిత్తము తన్ను తానే బలిదానముగా 'సమర్పించుకొనెను తిమొ : 2 : 5–6. ఆయన తున కిట్లు వ్రాసెను : "మన రక్షకుడైన జేసు స్తువు సమస్త దోషముల నుండి మనల విమోచించు టకు తన్ను తానే సమర్పించుకొని, తనకై మనల ప్రత్యే ంచుకొనెను." ·తు : 2 : –

హీబ్రూలకు వ్రాయబడిన లేఖలో నిదే అంశము పేర్కొనబడినది. పశుబలులవలన గాక తన సర్వార క్తముతో

క్రీస్తు మనకై నిత్యవిమోచనమును సముపార్జించెను. పేతురు నవక్రైస్తవుల నిట్లు ఉద్బోధించెను. "పితృపారంపర్యమైన అనాచారముల నుండి మిమ్ము విమోచించిన మూల్యమేది ఇహ లౌకికములగు వెండి బంగారములు కావని మీరు బాగుగా నెఱుగుదురు. క్రీస్తుయొక్క పవిత్ర రక్తముతో ఆ మూల్యము చెల్లించబడినది. ఏ కొదమ గొరియయు అంత పవిత్రమును నిష్కలంకమునైన బలి కాజాలదు."

పేతు: : 8- 9.

"ఇదిగో దేవునియొక్క కొదమ గొరియ. ఇదిగో నితడే లోకముయొక్క పాపదోషములు విమోచించువాడు.'

జ్వా : : 9

అని నాలుగవ శుభవార్తలో విశదీకరింపబడినది. అగణితములగు తీవ్రయాతనలకు హేతుభూతమైన మానవపాప దోషములు, నైతిక దుల నికృష్టతను వ్యక్తముచేయుచున్నవి. సువిశేషకారులు నూతన నిబంధనయందు క్రీస్తుస్వామి యాతనలకు విశేష ప్రాముఖ్యత నొసంగుటకు కారణమిదియని చెప్పకతప్పదు. ఆ విషాద ఘట్టమును వారు విపులముగా చిత్రించుటకు సంకోచించలేదు.

వెలుగు చీకటులకు గల వైషమ్యగాథ, నాలుగవ శుభవార్తలో వినూత్న రూపమును దాల్చినది. "వెలుగు, లోకమున ప్రవేశించినపుడు మానవులు వెలుగునకు ప్రతిగా చీకటిని ఆలింగనము చేసిరి. ఏలయన వారిచేష్టలు చెడ్డవి... సద్వర్తనుడు వెలుగుదరి చేరును. జ్వా : :

ఇందు నుదహరింపబడిన వెలుగు క్రీస్తుకు చిహ్నం. "నేను లోకమునకు వెలుగును. నన్ను అనుగమించువాడు చీకటిలో నడువజాలడు. జ్యా : 8 : 2

ఇక చీకటి పాపకర్మల అంతరాత్మకు లాంఛన. ఈ విషయమును క్రీస్తు యూదుల దృష్టికి గొనివచ్చిరి. "మీరు నా సంభాషణముల గ్రహించజాలరు. ఎందుకన నేగొనివచ్చిన సందేశమును వినుటకు మీకు చెవులులేవు. మీతండ్రియగు పిశాచికి మీరు స్వంతము. మీ తండ్రికి సంబంధించిన దురాశలను నెరవేర్చుటకు తహతహ పడుచున్నారు. వాడు ఆది నుండి నరహంతకుడు. సత్యమునకై నిలిచినవాడుకాడు. వానిలో సత్యమేలేదు." జ్యా : 8 : 3 - .

అంధకారమున కధిపతియు, లోకాధినేతయగు పిశాచి వారిపై ఆధిపత్యమును ప్రసరింపచేయును. వెలుగు అధికారము వహించినప్పుడు, భగవంతుడు మానవుల చేపట్టి వారి కొరకై తనను తాను అంకితము చేసికొనినాడను విశ్వాసము నిజమౌచున్నది. అంధకారము పైబడినప్పుడు పాపమునకు పట్టము కట్టినట్లగును. అయితే అంతిమ విజయము జేసుస్వామికే చేకూరినది. ఆ ఘోరమరణము ఆయన మహిమాభ్యున్నతికి హేతుభూతమైనది. తత్ఫలయమున విశ్వాసులసంఖ్య పెచ్చు పెరిగినది.

వ్యథల సమస్యల మార్చి క్రీస్తుచేసిన ప్రబోధమును ఆయన శిష్యులు ఉల్లేఖించుటయేగాక దానిని విపులీకరించి

నారు. క్రైస్తవుల దైనిక బాధలు జేసుస్వామి ప్రవేదన
లను పూరించుచున్నదని పవిత్ర పౌలుడు నుడివినాడు :
“మీ నిమిత్తము నే ననుభవించు బాధలను గూర్చి సంతో
షించుచున్నాను. ఏలయన, క్రీస్తు తన శరీరమగు దివ్యసభ
నిమిత్తము తా చెల్లించిన యాతనలందు కొరవడి యున్న
వానిని నే నీభౌతిక దేహము ద్వారా సంపూర్తి చేయు
చున్నాను.” కొలో : : 2 . అనగా క్రీస్తు శ్రమలు లోప
భూయిష్టములని పౌలుని భావముకాదు. తానుకూడ జగద్ర
క్షణ ఉద్యమమందు భాగస్వామి కాగలిగినందుకు ఆయన
ఉల్లసిల్లినాడు. దానిని గూర్చి సగర్వముగా చెప్పుకొను
చున్నాడు. విశేషించి ఆయనతో మనకుగల అవినాభావసంబం
ధము ద్వారా యియ్యది సుసాధ్యమౌచున్నది. “జేసు క్రీస్తు
నందు పవిత్రజీవమును నెఱప నాశించువా రందరు హింసల
నెదుర్కొందురు.” తిమో : : 2

ఇది యంతయు తాత్కాలికము. ఆమీదట శాశ్వతా
నందమును అనుభూతి చేయగలము. “మనయందు ప్రత్య
క్షముకాగల మహిమతో ప్రస్తుత బాధలు సరితూగవని
భావించుచున్నాను.” రోమ : 8: 8

జేమ్సు మునిమాన్యుడీ శాశ్వత సంభావనమునుగూర్చి
నొక్కి వక్కాణించినాడు. “పరీక్షలను సహించువాడుధన్యుడు.
ఏలయన వాడు తన విలువను నిరూపించిన మీదట, భగవం
తుడు తన్ను ప్రేమించువారికై వాగ్దానముచేసిన, జీవ కిరీట
మును పొందును.” జాకో : : 2

మనము క్రీస్తు నిమిత్తము, క్రీస్తు సహకారముతో బాధలను ఆలింగనము చేసినచో నిత్యానంద సుఖసౌఖ్యముల చవిచూడగలము. ఎటు చూచినను మాకు అవరోధములైనను శ్వాసించుటకు వ్యవధిక లేపోలేదు. పీడించబడియు, నిరాశచెందుట లేదు. హింసించబడియు, మైత్రులు లేక పోలేదు. బలిష్టమైన దెబ్బలు మమ్ము హతమార్చనేరవు; జేసువుయొక్క సజీవశక్తి మా శరీరములయందు ప్రత్యక్షమగునటుల జేసువుయొక్క మరణావస్థను మా శరీరములందు అనవరతము భరించుచున్నాము... లేదు, మేము పిరి పందలముకాము. మా భౌతికశరీరము కృశించుచున్నను, మా అంతర్జీవము దినదినము నూతన పరచబడుచున్నది. అత్యల్పము, క్షణభంగురములైన ఈ యావేదన అన్ని విధాల హెచ్చైన సంభావనమును కొనివచ్చుటయేకాక, నిత్యజీవ మహిమను మాపై మోపుచున్నది.”

2 కొరి: :8- 0. 6- 7.

“నేను ధైర్యముతో నుప్పొంగుచున్నాను. ఈ నా బాధ లన్నిటి మధ్యమున నాకు కలిగెడి ఆనందమునకు తాళజాలకున్నాను.” 2 కొరి : 7 :

ఘోర హింసాకాండకు గురియైన ఆదిమ క్రైస్తవుల నూరడించుటకు భక్త జ్యాన్నెన్ వ్రాసిన అపోకలిప్స్ గ్రంథంలో వ్యధాభరితులను ప్రోత్సహింపగల చక్కని శుభాషితాలు పెక్కులు గలవు. ఉపద్రవములు, అరిష్టములు,

మానవులను వారించుటకే కాక సుశిక్షితులనుగా చేయుటకు ఉద్దేశించబడినవి. "నే ప్రేమించువారినే దిద్ది శిక్షించుదును."
అపోక : - 0

అయినను వ్యధా భరితులకు ఆయన చేదోడు వాదోడుగా నుండును. "నీవెంత దారుణంగా శోధింపబడినది, ఎంత దారిద్ర్యానికి గురియైనది నే నెరుగుదును. (అయినను నిత్యము నీవెంతో ధనవంతుడవు.) తాము యూదులమని చెప్పుకొనువారి మూలమున నీ పేరెంత అప్రతిష్టపాలైనది నే నెరుగుదును. (వారు నిజమైన జూదులుకారు, కాని సైతానుచే ఎన్నికైన జనము). నీ వనుభవింపవలసిన బాధలను గూర్చి భీతిల్లవలదు. అల్పకాలములో సైతాను మీలో కొందరిని చెరయందుంచనున్నది. అచ్చట మీ విశ్వాసము పరీక్షించబడును. పది దినములవరకు మీరు తీవ్రవేదనకు గురియగుదురు. మరణమువరకు నాయెడ నమ్మకముంచుము. నీకు నేను జీవకిరీట మొసంగెదను." అపోక : 2 : 9 - 0

ఈ విషయమై అపోస్తులు చేసిన బోధనాంశముల కొన్నిటిని గైకొని వానిని పరిశీలింతము. తద్వారా సమస్య పరిష్కారము కాకపోయినను కొంతవరకు సువిదితమగును. మొదట భక్తపౌలుడు ఈ విశ్వవ్యాప్తమైనదని స్పష్టపరచినాడు సర్వజనీనతయే దాని లక్షణమని తెలియజేసినాడు. "విశ్వసృష్టి భగవత్ సుతుల సాక్షాత్కారమునకై గొప్ప నిరీక్షణతో వేచియున్నది. సృష్టిజనితమగు ప్రకృతి తన చిత్తానుసారముగా చేసిన నేరమునకు కాక, తాను పురోగతి చెంద

గల నను ఆశతోను తన ర్పరి నిమిత్తమును, తాను ముం
దంజ వేయగలనను ఆశాభావముతోను నట్టి శాపమునకు గురి
మైనది. అనగా ప్రకృతి క్రమానుగతముగా, పంచత్వ మను
దాస్యమునుండి విముక్తి చెంది, భగవత్ సుతులయొక్క మహి
మాన్విత స్వాతంత్ర్యమందు భాగస్వామిని యగును. ప్రకృతి
యంతయు నంతదనుక ప్రసవవేదనలతో మూల్గుచుండును.

ఈ సందర్భమున వినియోగించబడిన సృష్టిశబ్దమునకు
బుద్ధిగత జీవులుతప్ప సమస్త భౌతిక ప్రపంచము అని అర్థము.
భావోద్రేకములు నిరాశాభయాందోళనలు నిరీక్ష నమ్మ
కాలు మొదలైన వాసనలు ( assions విశ్వసృష్టికి అలం
కార త్వ్యా ఆపాదించబడినవి. సృష్ట్యంతయు ఒక్కపెట్టున
ప్రసవవేదనలతో నిట్టూర్పు విడుచునట్లు గోచరించును.
లోకంలో పాపము ప్రత్యక్షమైనది మొదలు, ప్రకృతి దుర్విని
యోగపరచబడి భ్రష్టురాలైనది; అయినను భగవదాజ్ఞలను
శిరసావహించి మానవులతోబాటు తనకు బాధావిముక్తి
కలుగునని నిరీక్షించుచున్నది. ఈ సందర్భంలో ప్రయోగించ
బడిన పాపశబ్దమునకు అర్థము మానవ పాపదోషమని పునీత
పౌలుని అభిప్రాయము. క్రీస్తు జన్మించుటకు పూర్వము,
ప్రకృతి పిశాచికి స్వంతమని వేరొకచోట పేర్కొనబడింది.
"ఆయన ప్రధానుల నుండియు, అధికారుల నుండియు తమ
ఎర నపహరించి బాహాటముగా వారి నవమానించి, ఆయన
మూలమున గెలుపొంది, వారిని పట్టుకపోయెను." కొలో 2: 5

ఇంతటి విజయముచేకూరినను, భవిష్యత్తులో గెలుపు
మనదైనను, నిర్విరామ పోరు సాగుతూ నుండును. "ఏలయన

మనము ఉద్యమించునది తనూరక్తములతో మాత్రము పోరు
టకు కాదు; కాని ప్రధానులతోను, అధికారులతోను ఈయంధ
కార దినములందు లోకాధినేతలతోను మనకంటె శక్తి
సంపన్నులైన దుష్టశక్తులతోను పోరుసలుపవలసియున్నది."
ఎఫేజి : 6: 2.

క్రీస్తు నిర్దుష్టమైన విజయము సాధించినారు కాన, దేవ
దూతలు, దుష్టశక్తులు పరస్పర సంఘర్షణకు సిద్ధముకానున్న
మహాయుద్ధ రంగములో మనము యుచిత పాత్ర వహించ
వలసి యున్నది. దివ్యసభ మహోజ్జ్వల చరిత్రలో, అనాదిగా
విజృంభించుచున్న పైశాచిక దౌష్ట్యములను, అకార్య
కలాపములను, అపోకలిప్స్ గంథము అపూర్వముగా చిత్రిం
చినది. ఈ దుష్ట సంక్షోభములు, దివ్యసభచరిత్రలో చర్విత
చర్వణమగుచున్నది. మానవజాతి చేసిన తిరుగుబాటుకు
పూర్వమే డు తలయెత్తినది. దేవదూతల మహాసైన్యము
భగవంతునిపై చేసిన విప్లవముతో చెడుగు ఆవిర్భవించినది.
"పరమండలమున భీషణయుద్ధం చెలరేగినది. మిఖాయేల్ అతని
దూతలు,దుష్టభూతముతో పోరు సలిపిరి. దుష్టభూతము, దాని
దూతలు సహితము సమరము సలిపి గెలుపొందలేక పోయినవి.
పరమండలమునం దిక నిలువలేక లొంగిపోగా ఆదిసర్పమగు
మహాభూతము ధరపై పడద్రోయబడెను. దీనినే మనము
పిశాచియనియు, సైతాను డనియు పిలుచుచున్నాము. సర్వ
లోక వంచకుడు తన దూతలతో ధరాతలమున పడద్రోయ
బడెను. అపోక: 2:7–9.

మానవునిలో రేకెత్తించిన దుష్టశక్తులను, సైతాను కడు నేర్పుతో వశముచేసుకొని, ప్రపంచమును ఉఱ్ఱూత లూగించినది. దీని చరిత్రయే ప్రబల నిదర్శనం ఆదిసర్పము నకు తోడు దుష్టమృగమొకటి కలదు. ఇదియే ఆదిమ క్రైస్త వులను హింసించిన రోమునగరమునకు చిహ్నం. విస్తృతార్థ ములో శతాబ్దముల తరబడి క్రైస్తవసంఘమును, ఘోరహింసా కాండకు గురిచేసిన సామ్రాజ్యశక్తులకు రాజ యపు పెత్తులకు ఈ దుష్టమృగము లాంఛన ప్రాయముగా నున్నది. ఇటువంటి దుష్టశక్తులకు చావుదెబ్బలు తగిలి నశించినను, పునఃపునః వేరొక రూపంలో తలయెత్తి విజృంభించుచుండును.

దీనికితోడు వేరొక క్రూరమృగముకలదు. దీనినే భక్తి జ్ఞానెస్మెస్ దబ్బర దీర్ఘదర్శియని వ్యవహరించారు. పై నుద హరించిన రాజ య మృగముతో సహకరించే మేధాశక్తుల కిది ఆనవాలు. ఇవియే ప్రజల మోసగించి వారిని నియంతల కైవసముచేసి ప్రభుత్వములకు పూజారాధనలు చేయించునవి. వీనివలన కలుగు మహిమలు, వింతలు, ప్రజల నుఱ్ఱూత లూగించును. ఈ విగ్రహారాధనకు సమ్మతించని వారలను, హింసాకాండకు గురిచేయును. ఇట్టి దుష్టశత్రువుల సహకార ముతో పిశాచి పాపదోషమునకు సమస్త జీవులయొక్క మాన క, దైహిక బాధలకు హేతుభూతమగుచున్నది. పాపకర్మల క్షించుటకు భగవంతుడు వినియోగించెడి పరోక్షసాధనములు కూడ యివియే. లోకాంత్యమున సృష్టికర్తను మరచిన దుష్టులయొక్క బాధలను ద్విగుణీకృతంచేసెడివి యీ పైశా చిక బలములే. స్తు, ఆయన సహచరులు, వీనితో భీషణ

యుద్ధము చేయుచున్నారు. ఈ ఘోరసమరమందు నేలగూలిన మృతవీరులకు మరుక్షణములో విజయము చేకూరును. వారల అపజయము నిక్కువముగా ఘనవిజయముగా మారును. అంతిమ విజయము శ్రేయమునకు చేకూరును అను సందేశము జ్వాన్స్ మన కందచేసినారు. చివరన ప్రేమ, విజయ భేరిని మ్రోగించును; ద్వేషము ఓటమిచెందును.

చిమ్మ చీకట్లు క్రమ్మి, ఉరుములు మెఱుములు హుంకరించెడి నిశారాత్రికి, వ్యధల రహస్యమును పోల్చ నగును. కనులను మిఱుమిట్లు గొలిపెడు విద్యుల్లతలు ప్రేక్షకులకు గాఢాంధకారమున పాక్షిక దృష్టిని ప్రసాదించు చందమున శ్రుతులు పై నుదహరించిన వేదరహస్యమునుగూర్చి, పాక్షికజ్ఞానమును మాత్రము అను గ్రహించును. చివరి కిది యొక దురూహ్యమైన వేదరహస్య మని చెప్పక తప్పదు. భగవదావిష్కరణము "చీకటిగదిలో గల దీపము వంటిదని" పేతురుడు నుడివినాడు. 2 పేతు:1: 9. మన దృష్టి ఎంత పాక్షికమైనదో మన జ్ఞానముకూడ అంత పరిమితమైనది. మన నడవడికకు మార్గదర్శకత్వమే కాని, తన్మూలమున భగవత్సృష్టి రహస్యములను పూర్తిగా గ్రహింపజాలము.

కడన స్వర్గరాజ్యకళ్యాణమునుగూర్చి చెప్పబడిన వార్తలివి : "ఆయన వారి నేత్రముల బాష్పబిందువు లన్నిటిని తుడిచివేయును. మరణ మిక నుండనోపదు. విలాపములు కాని ఆక్రందనలు కాని వేదనలు కాని ఉండనోపవు పాతవిషయములు గతించినవి." అపోక : 2 :

## ౫ అ ధ్యా య ము

# వ్యధల సమస్య - క్రైస్తవ సాంప్రదాయములు

క్రైస్తవమునిమాన్యుల రచనలనుండి వ్యధలసమస్యకు సంబంధించిన పెక్కు ప్రవచనములను పేర్కొనవచ్చును. పూజ్యులగు అగస్టిన్, థోమస్ అక్వైనస్ రచించినవి కడు ప్రసిద్ధములు. వీరుభయులు ఈసమస్యను కూలంకషముగా చర్చించినారు.

అగస్టిన్ విద్యార్థిదశలో మనికేయుల వాదమునకు గురియగుట తటస్థించినది. అప్పుడతడు ఆ మతసిద్ధాంతముల పట్ల వ్యామోహితుడై యించుమించు ఒక దశాబ్దమువఱకు వారితోగలసి కాలహరణము చేసినాడు.

తాత్విక దృక్పథముగల గొప్పమేధావి కనుక క్రమేపి ఆయనకు ఆ మతసిద్ధాంతములు రుచింపలేదు. భగవత్ స్వరూప స్వభావముల గూర్చియు, సత్యమును గూర్చియు, ఆత్మవిముక్తినిగూర్చియు, వ్యధలనుగూర్చియు ఆయనకు గల భయసందేహములను వారలు తీర్చలేకపోయిరి.

ఇట్టి సత విదూరమైన బోధనలకు విసిగి వేసారి అగస్టిన్ ఆత్మవిశ్వాసమునుగోల్పోయి నిరాశానిస్పృహలకు నెడమిచ్చినాడు. న్నిటికి ఆయున ఆ మతసూత్రములను ఆమూలాగ్రముగా ఆమోదించలేదు. తత్ సమయమున ఆయన కార్తేజ్ నుండి రోమునగరము వచ్చుట తటస్థించెను. అక్కడ అతనికి

విజ్ఞానార్జనకు కడలేని సావకాశములు లభ్యమైనవి. ఉపాధ్యాయ వృత్తి అవలంబించినాడు.

అంతదనుక దుసుగూర్చి అతనికి వింతభావము లుండెడివి "మనలోగల చెడుగు మనయందు ఆవిర్భవించ లేదనియు కావున దానికి మనము బాధ్యులము కామనియు, తదన్యమైన వేరొకనివలన దుష్కృతములు మనలో రేకెత్తుచున్నవనియు భావించితిని. అందువలన నేనుచేసిన దురంతములకు నిందగాని బాధ్యతగాని నే వహించవలసిన పనిలేదని, నాలోగల అహంభావము పరితృప్తి చెందినది.

ఆత్మగాథ 5: 0- 8.

పైబడి, మనికేయుల ప్రబోధములు వేరు; వారి ప్రవర్తన వేరు. వారిలో సగ్రశ్రేణికి చెందిన ప్రత్యేకవర్గము తన నియమములను పాటించక దుర్మాత్రృక చూపుచుండెను. వీనిని గాంచిన అగస్టిన్ నిర్ఘాంత పోయెను. భగవంతుడు భౌతిక స్వరూపుడను భావము అతనిలో నాటుకపోయినది. దీనికి దూరమగుట కడుదుర్లభముగా నుండెను. తనమూలమున దుష్టునకు సహితము నికృష్టమైన రూపురేఖ లున్నవని తలపోసెను. అది భౌతిక పదార్థ రూపములోగాని, నిరాకారమైన వాయు రూపములోగాని యుండవచ్చునని భావించెను.

చివరకు, తనలోగల లేశమాత్రమైన భక్తిమూలముగా సర్వమేలుల స్వరూపియగు భగవంతుడు దుసు సృష్టించలేదని తెలిసికొనెను. ఈ భౌతిక సత్తులు రెండును పరస్పర వ్యతిరేకము లనియు, అనంత శక్తులనియు, ఒకటి యున్నతస్థాయి

లోను, రెండవది నికృష్టస్థాయిలో నున్నవని గ్రహించెను. హేయమైన యిట్టి భావధోరణులు ఆయన దుష్కృతము లన్నిటికి హేతుభూతములని ఆత్మగాథలో నుడివినాడు.

తత్సమయమున అగస్టిన్ రోమునగరమును వీడి మిలాన్ పట్టణమునకు చేరుట తటస్థించెను. అచ్చోట అంబ్రోస్ మహాశయుని ప్రబోధముల మూలముగా కతోలికమతము మనికే యుని సిద్ధాంతములను పూర్వపక్షము చేయగలదని కనుగొనెను. అంత నాపతిత మత సూత్రములను పూర్తిగా విసర్జించి కతోలిక మతమును అవలంబించెను. ఇది ఆయన జీవితములో ప్రధాన ఘట్టము.

సత్వరం అగస్టిన్ మనికేయులతో వాదోపవాదములు వాక్ యుద్ధములు జరిపి క్రీస్తు ధ్వజమెత్తినాడు. వారిలోగల ప్రత్యేకవర్గమువారి కపటభక్తిని చెండాడినాడు. "క్రీస్తుసభ యొక్కయు మనికేయుల యొక్కయు నైతిక విలువలు" అను గ్రంథమును ప్రచురించినాడు. మనికేయులను దృష్టిలో నుంచుకొని ఆదికాండముపై రెండు సంపుటలు ప్రచురించినాడు.

అగస్టిన్ గురుత్వమును స్వీకరించిన మీదట ఫోర్తునాటస్, ఫేలిక్సు అను సుప్రసిద్ధ మనికేయులతో వాదించినాడు. ఇందులో మొదటివాడు అగస్టిన్ దాడికి తాళజాలక పలాయనమై పోయినాడు. రెండవవాడు క్రీస్తుమతమును స్వీకరించినాడు. మరికొన్ని గ్రంథములను రచించి మనికేయుల సిద్ధాంతములను పూర్వపక్షము చేసినాడు.

ఆ మీదట వ్యథల సమస్యను గూర్చి మూడు సంపుటలు ప్రచురించినాడు. స్వాతంత్ర్యేచ్ఛలు ( ree wi ) "రెండాత్మలు" (Two sou s) "శుభము యొక్క తత్త్వము Nature o goo కడపట పేర్కొన్న సంపుటి కడు ప్రసిద్ధము.

మనుగూర్చి అగస్టిన్ చేసిన ప్రబోధము లీగ్రంథమందు పొందుపరచబడినవి. విశ్వసృష్టి భగవంతునివలన కలిగినదికాని భగవంతుని నుండి కలుగలేదు అన్నటువంటి సూత్రము ఈ సమస్యకు ప్రాతిపదిక. ఏతత్ విషయమున క్రైస్తవత్వమునకు తదన్యములగు మతములకు సహస్ర భేదమున్నది. ఏమి లేమినుండి (ప్రాగభవ) విశ్వసృష్టి కలిగినదని క్రైస్తవ బోధ. తదన్యములు భగవత్ సత్త్వమునుండి జగత్తు ఆవిర్భవించినదని ఉద్ఘాటించుచున్నవి. కావున ఆయన విశ్వస్వరూపుడని భావము. మనికేయు లిట్లే సిద్ధాంతీకరించినారు. భగవత్ సత్త్వమునుండి జనించినది భగవత్ సమానము. భగవంతునివలన కలిగినది భగవంతుడు కాజాలడు. కావున ఆయన పరిణామరహితుడు, అక్షరుడు, తత్ భిన్నములైన సమస్త సృష్టిజాతములు, క్షరములు, పరిణామయుతములు అని అగస్టిన్ మునిమాన్యుడు సూత్రీకరించినాడు.

సృష్టిజాతముల యునికి సృష్టికర్త అస్తిత్వమునకు విభిన్నమైనది అను తాత్త్విక సూత్రమును ఆయన ప్రతిపాదించినాడు. భగవంతుడు న్యాయశీలుడుకాన తన జనితైక కొమరునివలె విశ్వసృష్టిని చేయలేదని అగస్టిన్ ప్రవచించినాడు.

భగవత్ సృష్ట్యంతయు శుభ ప్రదము అని చెప్పుట కొంద రికి వింతగా తోచును. నశ్వరములు అనశ్వరములుసహా లోప భూయిష్టములని కొందరియూహ. ఈ అభి ప్రాయము ద్వంద్వ సూత్రమునకు దారితీయును. ( ua princi e)అశుభము శుభ మను రెండు శక్తులనుండి మేలు డులు జనించునని వారి వాదము. మనికేయుల భావము యిదియే. ఈ ద్వంద్వ సూత్ర మును అగస్టిన్ పూర్వప ము చేయుటకు పూనినాడు.

సర్వమేలులు భగవంతుని వలన కలిగినవి. సృష్టిజాత ములన్నిటికి ఆయన పరిమాణము, ఆకృతి, క్రమములను ప్రసా దించినాడు (Measure, orm, Or er) ఇందు ముఖ్యమైనది ్రమము : సృష్టిజాతములు తమ లక్ష్యసిద్ధికై సహేతుకమైన పద్ధతిని అవలంబించుటయే ్రమ మనబడును. లేక సృష్టి జాత ములు తమ సహజ ధర్మానుగుణముగా వర్తించుటయే ్రమము. విశ్వ ్రమమునకు ప్రాతిపదిక ప్రకృతిచట్టము. దీనికి ఆధారభూతము భగవత్ శాసనము. సృష్టము లన్నిటికి భగవంతుడే గమ్యస్థానము. మన జీవిత పరమలక్ష్యమున కను గుణముగా వర్తించిన యెడ భగవత్ క్రమమందు భాగస్వా ముల మగుచున్నాము. మన జీవితాశయమునకు అవగుణా ముగా నడచితిమేని భగవత్ ్రమమును తప్పినవారల మగు దుము. కావున సృష్టికర్తకు దూరమగుచున్నాము.

'్రమము' నకు సంబంధించిన అంశమే పరిణామము. సర్వసత్తులు తమ నియమిత పరిణామముల నతి క్రమించినను, లోపించినను తమ నిజరూపమును గోల్పోవుచున్నవి; భ్రష్ట

మగుచున్నవి. కాబట్టి సృష్టముల పరిణామమును నిర్ణయించు నది భగవంతుడు. 'సమ స్తవస్తువులకు పరిమాణమును, సంఖ్యాను తూకమును నిర్ణయించునది ఆయనయే". విజ్ఞా : : 2 .

పై నుదహరించిన సంఖ్యకు చెందినది ఆకృతి. సృష్టి జాతములకు వర్గవిభేదము కలిగించునది ఆకృతి. అనగా వస్తువు లను సహజా యములనుగా వర్గీకరించెడిది ఆకృతి. ఇదియు భగవత్ నిర్మాణము.

పరిమాణము, ఆకృతి, క్రమము అను అంశములు అధిక మగు కొలది వస్తువులు సహితము కడుమంచివని శ్రేయములని చెప్పనగును. ఈ అంశములు కొఱవడినప్పుడు ఏతత్ సుగుణ ములు స్వల్పమగును. అవి పూర్తిగా లోపించినపుడు సుగు ణమే oo ) లేదు.

డునకు స్వతసిద్ధమైన అస్తిత్వములేదు. పరిమాణము, ఆకృతి, క్రమముల భ్రష్టత్వమే డు (అభము). ఇట్లు విచ్ఛి న్నమైన దానిని దుష్టస్వభావమందుము ( vi ature). తత్త్వతః అది మంచిదైనను భ్రష్టత్వమూలమున చెడుగు అగుచున్నది. భ్రష్టత్వమనగా (Corru tion) విచ్ఛిన్న మగుట లేక భంగమగుటని అర్థము. వస్తువులు సహజ ధర్మ ముల గోల్పోవుటవలన చెడుగు ఏర్పడుచున్నది.

ఒక ప్రత్యేక వస్తువు తన సహజలక్షణముల గోల్పోయి చెడుగైనను సమ గత గల వేరొక దానికంటె శ్రేష్టమైయుండ నోపును. ఉ॥ ప్రాణాధారమైన జీవాత్మ ఎంత కలుషితమైనను

శరీరముకంటెను శ్రేష్ఠమైనదికదా? ఇట్లే బుద్ధిగతజీవులు ఉద్దేశ పూర్వకముగా భ్రష్టత్వ మొందినను సమగ్ర స్వభావ ముగల పశువుకంటెను మేలుకదా

ప్లేటో వాదమునుండి, అగస్టిన్ వ్యధల సమస్యకు ఈ పరిష్కార మార్గమును పరిగ్రహించెనని ఆయన ఆత్మగాథ నుండి తెలిసికొనవచ్చును. అసలు దునకు అస్తిత్వము లేదు. అది యొక అవగుణము. అందువలన దానిని అభము అన్నారు. విశ్వ ్రమమున కిది హేతుభూతము. బుద్ధిగత జీవుల స్వేచ్ఛా సంకల్ప ( ree Wi  మూలమున ఇది ఆవిర్భవించు చున్నది. "సృష్టి జాతములందు శ్రేష్ఠతరములగు బుద్ధిగత ఆత్మలు  ationa S irits మాత్రము తమ యిష్టమునకు ప్రతికూలముగా భ్రష్టత్వ మొందలేవని భగవంతుడు శాసించి నాడు. అనగా వారు తమ ప్రభువైన సర్వేశ్వరునికి వినయ విధేయులై ఆయన శాశ్వత సౌందర్య లావణ్యముల అంటి పెట్టుకొని యున్నంతవరకు వారలు తమ సహజ ధర్మమును గోల్పోవజాలరు" అని అగస్టిన్ పేర్కొనినాడు.

పైనుడివిన విధానమును విడనాడి భగవంతునికి ప్రతి కూలురైనచో శిక్షాదండనలతో గూడిన వేరొక పద్ధతిని విశ్వక్రమము నెలకొల్పబడును. "సకల మేలుల స్వరూపియగు సర్వేశ్వరుని విడనాడువానికి శ్రేయమే లేదు." సృష్టిజాతము లందు శ్రేష్ఠాతి శ్రేష్ఠమైన బుద్ధిగత జీవులు సచ్చిదానంద మూర్తి యగు భగవంతుని తప్ప మరి యేవస్తువును వరించి సంతోషింప జాలవు.

అగస్టిన్ పతిపాదించిన పైసూత్రములు భౌతిక ద్రు
లకే గాక నైతిక ద్రులకు సహితము వర్తించును. నైతిక
డనగా పాపదోషమని భావము. స్వేచ్ఛాపూర్వకమగు
మానవ కర్మలను పరిమాణము, ఆకృతి క్రమములతోగూడిన
సత్తులతో సమన్వయ పరచవచ్చును. ఈ అంశములు కొరవడి
యున్నచో ఏతత్ క్రియలుసహా భ్రష్టమగుచున్నవి. అయి
నను అవగుణములకు సంబంధించి నంతవరకే అవి కలుషిత
మగు చున్నవి. తదన్యములైన జీవకోటుల విషయము వేరు.
వాని యొక్క విచ్ఛిత్తి (Corru tion) విశ్వక్రమమునకు,
దోహదకారి కాగలదు. చిన్నవారలు పెద్దవారికి విధేయించు
నట్లును, ఇహ లౌకికములు పారలౌకికములకు లోబడునట్లును,
అల్పశక్తులు అధికశక్తులకు, శుష్కములు బలీయములకు
లొంగిపోవును. పాపదోషమునకు గలుగు శిక్షాదండనలు సహా
విశ్వక్రమమునకు దోహదమిచ్చు చున్నవి. భగవంతుడు
పశ్చాత్తప్తులకు క్షమాభిక్షను పెట్టి తన ఔదార్యమును
చాటుచున్నాడు. దోషులను శి...ంచుటద్వారా ఆయన
న్యాయమును వగదెంచుచున్నాడు. బుద్ధిగత జీవులు న్యాయ
సమ్మతమైన దండనల అనుభవించుట మూలమున విశ్వ
...మము చక్కగా నెలకొల్ప బడుచున్నది. కాబట్టి భగవం
తుడు ...ను సృష్టించలేదని విశదమగుచున్నది. పాగభవము
లకు మాత్రము (mere ossi i ities) భగవంతుడు అస్తి
త్వమును చేకూర్చగలడు. ...వంటి అత్యంతాభవములకు
ure not in ness ఆయన అస్థిత్వమును చేకూర్చలేడు.
అందుచేత ...డును అభము అన్నారు. సంభవములకు అస్థి

త్వము ప్రాప్తించినపుడవి క్షరము లగును. సృష్టించబడిన వన్నియు విచ్ఛిన్నమగుట తథ్యము. పుట్టుట గిట్టుట కొరకే కదా. భౌతిక ఉలకు సంబంధించి నంతవరకు సృష్టిజాతము ^క్రమాను గతముగా, తరములవారిగా ఉత్పన్నమగు చున్నది. విచ్ఛిత్తి లేకపోయిన యియ్యది సాధ్యముకాదు. ఏతత్ క్రమ సమన్వయ సౌందర్యములు, కాలానుగతమైన పరిణామ రహితమైన చక్కని కవిత, మధుర గానాలాపముల సుందర లావణ్యముల బోలి యున్నవి.

"సృష్టిజాతముల అవగుణములు సహితము క్రమాను గతమైనవికావున వివేచనాశక్తిగల వ్యక్తి అటువంటి పరిణామముల ఔచిత్యమును గుర్తించక మానడు. సమయోచితముగా వెలుగును మరుగుపరచి కొన్ని భూభాగములందు చీకటిని కల్పించుచున్న భగవత్ కార్యకలాపము లెంత సమంజసమో యోచింపుడు మన స్వరముల శమింపజేసి సందర్భానుసారముగా మౌనము ద వహించుట ఎంత ముదావహము ఇట్లే భగవంతుడు చిత్రకారుడు సర్వమును సమన్వయపరచినట్లు సృష్టిజాతములందు కొన్నిటికి అవగుణముల నాపాదించుట ఎంత సమంజసము అందుచేత దానియల్ గ్రంథములో ( : 2) బాల త్రయము చేసిన గానమందు వెలుతురుతో సహా చీకటియు భగవంతుని అభినందించుచున్నది. అనగా వీనిని గూర్చి చక్కగా తలపోయువారి హృదయములందు భగవత్ స్తుతులు ఉత్పన్న మగును. ( ena ura oni-16)

మనికేయులు ప్రతిపాదించినటుల ఉనునది ప్రాథమిక పదార్థముకాదు ( rime ma er). వివిధ ఆకృతులు పొంద

గలశక్తి ప్రాథమిక పదార్థము. ఆకృతి మంచిదైన తద్దానిని పొందగలశక్తి సహితము మంచిదగును. కొందరు పరమ డని భావించెడి బాధ సుతత్త్వములందు (Goo atures) మాత్రము మనగలదు. తనలోగల సుగుణమును గుర్తించుటకు అనిష్టపడు అంశమే బాధను ప్రతిఘటించునది.

అధికతర శక్తులను చిత్తానుసారముగా ప్రతిఘటించుట మూలమున ఆత్మ సంక్షోభము కలుగుచున్నది. ఇట్లే మిక్కిలి శక్తివంతమగు శరీరమును ప్రతిఘటించుట మూలమున దైహిక బాధ లేర్పడుచున్నవి. ఇక బాధారహితమగు చెడుగులు మహా చేటుకరము. పాపదోషానుభూతికంటెను భ్రష్టత్వమొందుట కడుమేలు. ప్రాణాపాయకరము బాధారహితమగు భయంకర జాడ్యముకంటెను బాధాసహితమగు వ్రణము కడు మేలుకదా

నైతికహాని ( ora vi ) మరీ క్లిష్టతర సమస్యగా గోచరించుచున్నది. పాపదోష మనగా, చెడువస్తువుల నపేక్షించుట యని భావము కాదు. కాని యున్నత క్రమమునకు చెందిన సద్వస్తువులను విడనాడుట యని అర్థము. భగవత్ సృష్టి జాతములన్నియు శుభ ప్రదములు. మేలు డుల నెఱిగించెడి వృక్షము వస్తుతః యోగ్యమైనది Goo ).అయితే మానవుడా నిషిద్ధఫలమును స్పృశించుటవలన అంతకంటెను ఉత్తమోత్తముడైన భగవంతుని త్రోసివేసినాడు. అల్ప సుఖము నిమిత్తము సర్వ మేలుల స్వరూపి యగు సర్వేశ్వరుని చిత్తాసంకల్పముల తృణీకరించినా డని భావము. ఈ యర్థములో

అగస్టిన్ చేసిన పాపదోష నిర్వచనము కడు సమంజసముగా తోచును. పాపమనగా, 'సృష్టికర్త యెడ విముఖత, సృష్టిజాతముల యెడ సుముఖత' అని నిర్వచింపబడినది. కేవలము చెడుగును పరమ లక్ష్యముగా నెంచుట పాపము కాజాలదు; కాని భగవత్ క్రమమును భగ్నపరచుట మూలమున పాపదోషము ఆవిర్భవించుచున్నది. "పరిమాణాకృతి క్రమముల" యవగుణమే సృష్టిజాతములకు సంబంధించిన చెడు. సంకుచితమైన మేలు చెడుగా పరిణమించును. బుద్ధిగత జీవులు సర్వస్వాతంత్రులు కారనియు, భగవంతుడే వారి జీవిత పరమావధి యని నిరూపించుటకు ఆ నిషిద్ధఫలము సృష్టించబడినది. కాబట్టి వారు వినయవిధేయులై వర్తించుట మూలమున సృష్టి క్రమమును పదిలపరచగలరు. అహంకార అవిధేయతల వలన ఆ క్రమ విచ్ఛిత్తికి దోహదకారులగుదురు. కావున పాపకర్ములు శుభ ప్రదమగు ( oo ) తన స్వేచ్ఛను దుర్వినియోగపరచుచున్నారు. భగవంతుడీ చెడుగులను సద్వినియోగపరచి, పాపులను శిక్షించుట మూలమున విశ్వక్రమమును పునరుద్ధరించును. దుష్టుల శిక్షించుటకై నిర్దేశించబడిన నిత్యనరకాగ్ని సహితము కేవలము చెడు కాజాలదు. ఏలయన దానికి క్రమ పరిమాణాకృతులు లేకపోలేదు. దుష్టుల పాపదోషముల కది ప్రాయశ్చిత్తము కావున వారికది చెడు కాకమానదు. రుగ్మత గల నేత్రములకు వెలుగు బాధను కలిగించును గాన అంత మాత్రమున దానిని చెడుగనగలమా

పైనుదహరించిన సూత్రముల నాధారముగా జేసికొని అగస్టిన్ మనికేయుల ద్వంద్వసూత్ర సిద్ధాంతమును పూర్తిగా

పూర్వ పక్షము చేసినాడు. మనికేయులు దునకు, క్రమ పరి ణామాకృతులు, జీవశక్తులు, జ్ఞాన వెలుగులు అను సద్గుణముల నాపాదించినారు. ఇట్లే మేలునకు మృత్యువును, శమబాధలు, అవిద్య, అజ్ఞానములు అను దుర్గుణముల నంటగట్టినారు. నైతిక విలువల విచ్ఛిత్తికి మార్గ ప్రదర్శకములైన ఈ ఛాందస బోధనలను, అగస్టిన్ నిర్దాక్షిణ్యముగా చెండాడినాడు.

ఈ సమస్యను గూర్చి యింకను మనము లోతుగా నాలోచించితిమేని మేలు కుల నేటి కోరగల స్వేచ్ఛా సంక ల్పము ( ree wi ) డా మేలా అన్న ప్రశ్న ఉదయించక మానదు. స్వర్గవాసులకు సంక్రమించిన సమగ్ర స్వాతంత్ర్యము కంటెను ఆది స ౹పతులకు దేవుడను గ్రహించిన స్వేచ్ఛ సాపేక్షి కముగా మానవేచ్ఛ కంటెను శ్రేయస్కరమని అగస్టిన్ అభి ప్రాయము. ఇక, మానవస్వేచ్ఛా సంకల్ప మెంత లోపభూ యిష్టమైనను, స్వర్గసామ్రాజ్యమువంటి మహా గొప్ప మేలును సముపార్జించ గల సాధనమని చెప్పక తప్పదు. మానవుడు దానిని దుర్వినియోగ పరచవచ్చును. దుర్వినియోగమే సమస్త ండులకు మూలము. మనము చెడుగును కోరకుండునట్లు చేయగల సత్తు భగవదనుగ్రహమునకు లేకపోలేదు. అంత మాత్రమున ఆయన మునకు హేతువని చెప్పజాలము. మన స్వేచ్ఛా సంకల్పమే భగవంతుని విడనాడుచున్నదని మరువ రాదు. ఇక పాపమూలమున భగ్నమైపోయిన సృష్టి మ మును దయామయుడగు భగవంతుడు తన వర ప్రసాదము వలన పునరుద్ధరించ చిత్తగించెనేకాని, మానవేచ్ఛలను భ్రష్టము

చేయలేదు. పైబడి వానిని ఇనుమడింప చేసినాడు. మానవ స్వేచ్ఛా సంకల్పము పాపమునకు బానిస కానంతవఱకు, దాని మించిన స్వాతంత్ర్యమే లేదు. తద్వారా యొక మేలును వేరొక గొప్ప మేలుతో నలంకరించినట్లగును.

పదమూడవ శతాబ్దిలో సంపూర్ణ క్రైస్తవ మతావరణలో జీవించిన సుప్రసిద్ధ మేధావి థామస్ అక్వైనాస్ మహాశయు డిదియే సమస్య నెదుర్కొనినాడు. ఆ దినములలో, మనికేయులను బోలిన అల్బిజెన్సియను లను కొందరు పతితులు దివ్యసభను కబ ంచుటకు పూనుకొన్నారు. వారల బోధనలను నిరోధించుటకు గాను థామస్ తత్వవేత్త డును గూర్చి సవిస్తరముగా వ్రాయుటకు దలబెట్టెను.

డుల నిజాయి ని గూర్చి మొదట ప్రస్తావించినాడు. డొక గుణమా లేక అవగుణమా? అని ప్రశ్నించినాడాయన. కొందరిది వాస్తవికమని ( ositive) భ్రమపడుచున్నారు. ఎందుకన, తత్ విరుద్ధమైన మేలు వాస్తవికము కావున, నిదియు యదార్థమని వారి వాదము. విరోధా భావములు (Contraries రెండును సహ జా ీయములు కావున Same enus ఒకటి వాస్త వికమైనచో రెండవది కూడా యదార్థమందురు. తెలుపు నలుపు రెండును నిజమైన వర్ణములని ఉదహరించుదురు. ఈ దృక్పథమును థామస్ ముని మాన్యుడు విమర్శించి, ను అనుపదము ద్వంద్వార్థములకు లాంఛనమని నుడివినాడు. డనగా ఒక చెడువస్తు వైనను కాగలదు లేక చెడుగుణమైనను కాగలదని స్పష్టీకరించినా

డాయన. చెడువస్తువునకు నిజాయి కలదు; కాని చెడుగుణము నకు నిజాయితీ లేదని వాదించినాడు. గుణలోపమువలన కలిగి నది రెండవ భావము; శ్రేయము (Goo ) ఎప్పుడు వాంఛ నీయము మేలుకోరుట సహజము. అన్నికంటెను వాంఛనీయ మైన అఖండ శ్రేయము, సత్యస్యసత్యము Su reme ea ity) సర్వమేలుల నిజాయితీకి ఆధారభూతము. కాబట్టి అవగుణమైన డు అఖండసత్యమునుండి రాజాలదు (Su re- me ea ity కాబట్టి సృష్టిజాతములన్నియు శ్రేయములని ( oo ) చెప్పక తప్పదు. అస్తిత్వములుగా నవి శ్రేయము లైనను గుణలోపమువలన చెడుగులు కాగలవు. ఒకవేళ, చెడుగునకు అస్తిత్త్వము నాపాదించితిమేని అది యెవరిని వరింపలేదు. దానినెవరు వాంఛింప లేరు. ఒక్కమాటలో నది చైతన్యశూన్యమని చెప్పవలెను. ఇక సృష్టిజాతము లన్నియు తమ అస్తిత్వములను ఆయామేరకు కాపాడ వాంఛించును. శూన్యములు శూన్యమునే కోరును. అంధత్వ :మొక అవగు ణము. అంధుని చూపు లోపభూయిష్టమైనను అతనికి అస్తిత్వ మున్నది కాని అంధత్వము మా తము లేదు.

డు అభము అఖండమనియు, సాపేక్షికమనియు రెండు తెరగులు. A so u e or e ative ఒక వస్తువు సహజగుణలోపమువలన పూర్తిగా డగుచున్నది. మానవుని శరీరారోగ్యము సహజలక్షణము; కావున అతనికి రుగ్మత తత్త్వతః డగుచున్నది. వేరొక వస్తువు, సహజగుణలోప మేమియులేకయే తదన్యముల సంబంధము కలిగినపు డది

చెడుగు కాగలదు. ఉ॥ నీళ్ళు నిప్పు రెండును శ్రేయములే. కాని పరస్పరము కలసిపోవుటకు వీలులేదు. కావున తత్ సందర్భమున రెండును చెడుగగుచున్నవి. ఇట్లే న్యాయదండన లు (స్వతః) తత్త్వతః మంచివైనను పాపాత్మునకవి దుఃఖముగా పరిణమించవచ్చును. శాంతి సామరస్యముల నెలకొల్పు భగవంతుడే నరకమును సహితము సృష్టించినాడు. పాప కర్ములు శాంతి సామరస్యముల వరించుదురే కాని నరకాగ్నిని వాంఛింపరుకదా

ఆ మీదట థామస్ మేధావి వేరొక అంశమును గూర్చి ప్రస్తావించినాడు. దుఃఖముతో సమన్వితమైన వస్తువు మేలు కాగలదా? అన్న ప్రశ్న ఉదయించినది ఆయనకు. మేలు లేక శ్రేయమను పదమునకు సందర్భానుసారముగా మూడర్థము లున్నవని ఆయన వివరించినాడు. మొదటు, ఒక వస్తువు యొక్క సమగ్రతను ( er ection) సూచించుటకు ఆ పదమును వినియోగింపవచ్చును. ఉ : సూక్ష్మదృష్టి కంటికి శ్రేయోదాయకముకదా ఇట్లే సద్గుణ సంపత్తి మానవుని శుభ పదముకాదా రెండవది, ఈ సమగ్ర లక్షణములుగల వ్యక్తిని సూచించుట కా పదమును ప్రయోగింపవచ్చును. ఉ : సూక్ష్మదృష్టిని ప్రసాదించు నేత్రమును మంచిదన వచ్చును. ఇట్లే సద్గుణ శీలుని మంచివాడందుము. మూడవది పైనుడివిన సమగ్రలక్షణముల సాధింపశక్తిగల వస్తువును సూచించుట పదమును వాడవచ్చును. ఉ: సద్గుణ సంపత్తిని సాధింపశక్తిగల వ్యక్తిని మంచివాడందుము. ఇట్లే సూక్ష్మ దృష్టిని సాధింపశక్తిగల నేత్రమును మంచిదనవచ్చును

( o entia y goo ). తత్ సందర్భమున గమనించవలసిన అంశమొకటికలదు. భవిష్యత్తులో మంచిని సాధింపశక్తిగల వస్తువులు వర్తమానమందు సహజగుణాలోపమువలన, కీడులకు ఎడమియ్యవచ్చునుకదా భవిష్యత్తులో శ్రేయస్సును సాధింప గల శక్తి మంచిదేకాని యది కార్యరూపము వహించవలసి నపుడు భావరూపములో నుండుట చేటుకరమనక తప్పదు. ఉ : సద్గుణ సంపత్తిని సాధింపగల వ్యక్తి సచ్ఛీలనము లేకుం డుట చెడుపు. ఇట్లే శ్రద్ధాసక్తులతో సూక్ష్మదృష్టిని సాధింపగల నేత్రము చూపులేకుండుట చేటుకరము. శ్రేయము కార్యరూపముదాల్చక స్తంభించి పోవుటకు డు హేతుభూత మనదగును కాబట్టి, సర్వసంపూర్ణ క్రియాన్వితు డగు ure Act)సర్వేశ్వరుడు సర్వమేలుల స్వరూపియనదగును. ఏలయన పాగభవము ( otency) ఆయనలో సర్వశూన్యం. అందు వలన డుతో సమన్వితమైన వస్తువు మేలుకాగలదను వాక్య ములో పరస్పర వ్యతిరేక భావమేమియులేదు. కాని యొక వస్తువునకుండవలసిన సహజగుణములకు గీడునకు మధ్య వ్యతి రేకత లేకపో దు.

"సద్వృక్షము దుష్ఫలముల నియ్యజాల"దని శుభ వార్తలు ఘోషించినను, మేలునుండి మాత్రము డు రాగల దని చెప్పక తప్పదు. లేక, సమస్త డులకు హేతుభూతము మేలనియు చెప్పవచ్చును. మాటవరస కిట్లు వ్యవహరించుచు న్నాముగాని అసలు డునకు ప్రత్యక్ష కారణ ముండజాలదు ( ositive cause . మొదట డును డుగా నెవరు వరింపరు. వ్యభిచారి అన్యాయమును తలపెట్టక ప్రేమను

వాంఛించును. కారణకార్యములకు ఉపమాన ఉపమేయముల సంబంధ బాంధవ్యము కలదు. డునకు ఏతత్ కారణాంతరములకు మధ్య (Occasions) సామ్యమే లేదు. సాధారణముగా కారణము లెప్పుడు కార్యరూపము తాల్చునవిగా నుండును. అయితే డును జనింపజేయుటకు మే లెన్నడు కలిగింపబడలేదు. డునకు మేలు హేతువు కాజాలదు.

ఇక, సత్తు ein ) శ్రేయములు Goo ness) డునకు ప్రత్యక్ష ( ositive) కారణములు కాజాలకపోయినను, పరోక్ష కారణములు లేక అవకాశములుగా (Nega ive) పరిణమించవచ్చును. ఇట్లు సంభవించుటకు హేతువులు రెండు. మొదటిది డునకు అవకాశమిచ్చెడి మేలు ఎల్లప్పుడు లోపభూయిష్టమై యుండును. రెండవది, చెడుగునకు అవకాశమిచ్చెడి మంచి, చెడు గే తన పరమ లక్ష్యమని యెంచదు. శ్రేయ మెప్పుడు మేలుకొఱకే యత్నించును కాని పరోక్షముగా డు లేక దుష్ఫలితములు వాటిల్లవచ్చును. ఉ॥ వ్యభిచారి తన కామేచ్ఛలను తీర్చుకొనుటకు తాపత్రయ పడునే కాని, వైవాహిక పవి తతను ఏతద్ధర్మాధర్మములను పాటించడు. దీనినే మనము నైతికహాని Mora vi ) యని వ్యవహరించుచున్నాము. వాస్తవముగా నిదియే పాపదోషము. దాని కతడు బాధ్యుడు. స్వేచ్ఛాజీవి కనుక అతడు దానిని అంగీకరించవచ్చును లేక నిరాకరించవచ్చును. తనచిత్తానుసారముగా నతడు మేలుకై తాపత్రయపడును కాని చెడుగును ఎన్నడు వరింపడు. డును డుగా వాంఛింపడు. తాను చేయు

నది భగవదభీష్టమునకు వ్యతిరేకమని తోచనందున అట్లు పవ ర్తించుచున్నాడు. అనగా, అతని చిత్తసంకల్పము Wi ) ఏదో ఒకరీతి లోపభూయిష్టమై యుండవలెనని భావం. ఉ : వడ్లపనివాడు కొలబద్ద తన అందుబాటులో లేనందున కొయ్యను వేళ్ళతో విభాగించి, దానిని సరిచూచుటకు వ్యవధిలేక, తప్పుడుకోతలు కోయుట తటస్థించును. కావున నా పని చెడిపోవును. అయినను, అతని సహచరుడు A ren ice కొలబద్దను అందుబాటులో నుంచుకొని పని చేసినను 'కొలతల పొరబడనీయక పనిచేయవలె'నను భగవ దిచ్ఛను అతడు దృష్టిలో నుంచుకొన శక్తిలేనందున పని చెడి పోయినను తప్పు అతనిది కానేరదు. తన చిత్తవృత్తి నియ మమునకు సమన్వయింపని ఏదో ఒక పని విషయమై ముఖ్య ర్మానములు గావించినచో నతడు దోషి యగుచున్నాడు. ఇట్లతని చిత్తవృత్తి మునకు పరోక్షముగా హేతువైనను వస్తుతః మంచిదని చెప్పక తప్పదు. అది చెడుగును ప్రత్యక్ష ముగా కోరుటలేదు, పైబడి తన నియమానుసారముగా చేయు టకు విస రించినదికావున

ఇక దేవుని విషయ మట్లుకాదు. భగవంతుని చిత్త వృత్తి Wi పాపము చేయజాలదు. తన కార్యాచరణకు తానే నియమము కావున, ఆయన మరియొక నియమమును పాటించవలసిన పనిలేదు.

థామస్ మహనీయుడు, పాపదోషమువలన కలిగెడి మునకు కోదండనలమూలమున కలిగెడి మునకు మధ్య

వ్యత్యాసమున్నదా లేదా ? యని ప్రశ్నించిరాడు. ఇక్కడ మనము బుద్ధిగల జీవులగూర్చి మాత్రము వ్యవహరించుచున్నాము. బాధ్యతగలవాడే శిక్షాదండనలకు పాత్రుడు కాగలడు. పాపదోషము వలని ను పాపాత్ముని చిత్తానుసారముగా జరిగెడి విషయము. ఇక శిక్షాదండనలవలని ను వాని చిత్తమునకు ప్రతికూలముగా సంభవించేది. ఇక బుద్ధిగత జీవులు వ్యక్తిగతముగా కాని, స్వభావరీత్యా కాని పాపదోషమునకు పాలుపడనిదే వారలు ఆత్మ, శరీర సిరిసంపదలకు సంబంధించి నంతవరకు శిక్షాదండనలకు పాత్రులు కాజాలరు అని మన మత సాంప్రదాయ సిద్ధాంతము. మానవులు తమ ప్రయోజనార్థము వినియోగించగల మేలులు లోపించగా కలుగునవి శిక్షాదండన లని పైనుడివిన విషయములను బట్టి తెలిసికొనగలము. దేవదూతలకు సహితఇదియే సూత్రము వర్తించును. కాబట్టి బుద్ధిగత జీవులకు వాటిల్లెడి సమస్త దులు పాపదోషములవలన కాని శిక్షాదండనల మూలమున కాని సంక్రమించుచున్నవి.

శిక్షాదండన లన్నియు మానవ చిత్తసంకల్పమునకు ప్రాతికూల్యములని చెప్పజాలము. తెలిసిన మీదట ప్రతికూలించబడెడి శిక్షలు కొన్ని. ఉ॥ ఒక నేరస్తుడు తన తప్పిదములకు రాగల శిక్షను తెలిసికొన్న మీదట దానికి సుముఖుడు కాజాలడు. తెలియనందున ప్రతికూలించబడెడి శిక్షలు మరికొన్ని. ఉ॥ ఒకడు తానుచేసిన నేరమునకు ఫలితముగా సంక్రమించిన శిక్షను మొదట తానెరుగడు. తెలిసియున్న

పక్షమున దానినిగూర్చి కడు బాధపడెడివాడు. క్రమబద్ధమైన చిత్తవృత్తికి మాత్రము ప్రాతికూల్యములైన దండనలు కొన్ని లేకపోలేదు. ఉ॥ ఘోరపాపదోషమునకు వడిగట్టినవానియందే దేవప్రేమ (C arity) అను పుణ్యము అంతరించి పోవుట.

తరచుగా, పాపదోష ఫలితములగు కీడులు క్రియా రూపములో గోచరించును. శిక్షాదండనల ఫలితముగా కలుగు కీడులు సహనరూపము తాల్చును.

కడన పైనుదహరించిన కీడులు రెంటియందు ఏది గొప్పదని థామస్ మునిమాన్యుడు తర్కించినాడు. దైహిక శిక్షలనుబట్టి చూచినచో వానికంటెను పాపదోష ఫలమగు కీడు కడుఘోరమైనదని తెలియగలదు. వేరొక దృక్పథముతో చూచుట ఆవశ్యము. దేవగుణ ప్రసాదమును పోగొట్టుకొనుట తద్వారా స్వారాజ్యమును గోల్పోవుట యిత్యాదులు మహా ఘోరమైన శిక్షలు. ఇవి మానవజీవిత పరమలక్ష్యమగు అఖండ శ్రేయమునకు ప్రతికూలము లైనందున అంతటి గొప్ప శిక్షలవి.

అయినను శిక్షాదండనల కంటెను పాపదోషమే మహా గొప్ప కీడని చెప్పక తప్పదు. తన్మూలమున మానవుడు దేవ గుణ ప్రసాదమును చివరకు స్వారాజ్యమును గోల్పోవును కాన అది మహాచేటు కరమని చెప్పబడుచున్నది పైబడి పాపదోషమువలన భగవంతునికి మహాపచారము కలుగు చున్నది. అయితే శిక్షాదండనల మూలమున ఆయన నీతి న్యాయములు వెలుగొందుచున్నవి. శిక్షనుండి తప్పించుకొన

వలెనంటే పాపదోషమునకు దూరము కావలెను. పాపదోషము క్రియారూపములో గోచరించును. శిక్షసహనరూపములో కాన్పించును. దుష్కృతములవలన భగవత్ ప్రేమను దూరమై పోదుము. శిక్షద్వారా భగవదానందమును గోల్పోదుము.

కావున శిక్షకు గురికాగలమను భయము కంటెను తద్వారా భగవంతునికి ఘోరఅపచారము కలిగించుచున్నామను భీతినిబట్టి చెడుగును వర్జించవలెనని థామస్ తత్త్వవేత్త నుడివినాడు. తత్ సందర్భమున ఆయన హోరాచియుస్ అను సుప్రసిద్ధ రోమను కవీంద్రుని వ్యాఖ్యములను ఉల్లేఖించినాడు.

"దుష్టులు శిక్షాభీతివలన
దుష్కృతములు చేయ తెగించరు
శిష్టులు సచ్ఛీలన ప్రీతివలన
పాపదోషమునకు పాలుపడరు."

థామస్ మహాశయుడు మేలు డులగూర్చి అపూర్వ చర్చలు జరుపుటకు కారణములేకపోలేదు. అందువలన ఈ సమస్య ఆయన రచించిన ఉద్గ్రంథము లన్నిటిలో గోచరించు చున్నది.

విశ్వసృష్టికి మానవ దుష్కృతములనుండి తత్ ఫలితము లగు సమస్త డులనుండి సముద్ధరించుటయే క్రైస్తవమత పరమలక్ష్యమని కొన్నిమార్లు గోచరించక మానదు.

థామస్ మునిమాన్యుడు మేలు డులనుగూర్చి సమగ్రముగా చర్చించినాడనుట అత్యుక్తి కానేరదు.

# 7వ అధ్యాయము

## వేదము - దైవశాస్త్రము

పవిత్ర రచనలను, కతోలిక మత సాంప్రదాయముల నాధారముగా జేసికొని మనము ఇంతదనుక వేదమునుగూర్చి జరిపిన చర్చలమూలమున, తత్త్వచింతనద్వారా లభించిన పరిజ్ఞానము సమగ్రమైనదని చెప్పవచ్చును. కాని మూలములను వల్లించినంత మాత్రమున వేదశాస్త్రము రూపొందనేరదు. ఏతత్ప్రతిపదికలను సహేతుకముగాను, కూలంకషముగాను తర్కించి సిద్ధాంతీకరించుటయే దైవశాస్త్రమనదగును. ట్లు తీవ్రవాదముల సమన్వయపరచి, ఆయా సత్యములు సహేతుకమనియు సమంజసమనియు నిరూపించి మానవ మేధస్సును ప్రశాంతపరచునది వేదశాస్త్రము.

దివ్యసభలో శాస్త్రానుగుణమైన ప్రబోధము అనాదిగా లేదు. మొదట దేవరాజ్యమునుగూర్చి జనసామాన్యములకు నుపదేశించబడినది. ఆమీదట కాలానుగతి దైవశాస్త్రపాండిత్యము చేకూరినది. ఆయా యుగముల సంస్కృతి సాంప్రదాయముల కనుగుణముగా క్రమబద్ధమైన, శాస్త్రీయమైన పద్ధతిని ధర్మశాస్త్రము రూపొందినది.

ఇక, పదమూడవ శతాబ్దమందు వేదపాండిత్యము అభ్యుదయశిఖరముల నందుకొనినదని చెప్పిన అత్యుక్తి కానేరదు. ఆనాడది విరజిమ్మిన విజ్ఞానజ్యోతులు ఈనాటివరకు క్రైస్తవ ప్రపంచమునకు మార్గదర్శకత్వము వహించినవి. అంత

టితో ధర్మశాస్త్రము పరిపూర్తి చెందినదని భావముకాదు. దాని స్వరూపస్వభావము లు యుగయుగములందు మానవ పరిజ్ఞానమునకు అనుగుణముగా వినూత్న రూపముల వెలుగొందును. క్రొంగ్రొత్త ధోరణులు దానికి మెరుగులు దిద్దగలవు. ఇట్లే దైవావిష్కరణమును గూర్చి విపులముగా, విమర్శకముగా, నిష్పాక్షికముగా చర్చించుగోరు పామరపండితులకు నందుబాటులో నుండునట్లు వ్యధల సమస్యను ఆధునిక పద్ధతులలో ప్రబోధింపవలసి యున్నది.

ప్రప్రథమమున మనము గమనింపవలసిన విషయమొకటి కలదు. వేదశాస్త్రమును కల్లోలిత మనః ప్రవృత్తులలోగాక ప్రశాంత హృదయములతో అధ్యయనము చేయవలసి యున్నది. మనఃక్లేశముల ననుభవించునపుడు వానిని గూర్చి విశ్లేషణము చేయుట సమంజసముకాదు భగవత్ ప్రార్థన కది సముచిత సమయము. "మీలో నెవరేని వ్యధాభరితుడగు పక్షమున ప్రార్థన చేయుటకు ఉపక్రమించు"డని జేమ్సు మునిమాన్యుడు నుడివినాడు (జేమ్సు 5. 3). అప్పుడావ్యక్తి భగవంతుని స్పృశించుట మూలమున బాధోపశమనమును ఆత్మ విశ్వాసమును పొందగలడు. వాదోపవాదములకు, తర్కశిక్షకల కది సమయముకాదు. తద్వారా అతనికి లేశమాత్ర ప్రయోజనముండనోపదు.

సుప్రసిద్ధ ప్రసంగి బాస్సువె మహాశయుడు చరమదశయందు బాధోపశాంతి నిమిత్తము వేదోద్గ్రంథములను కాని తాను రచించిన మహోపన్యాసములను కాని చదువవమని కోర

దు. కాని స్తు [అంతిమదశలో చేసిన సుదీర్ఘ పరమ ప్రసంగమును అరువదిమారులు చదువగా విని బాధోపశమన మును పొందెనని చెప్పబడినది. కాబట్టి వేదశాస్త్ర పరిశీలన ప్రశాంత పరిస్థితులలో చేయవలసియున్నదని వ్యక్తమగు చున్నది. ఆవేదనలందు హృదయపూర్వకమగు ప్రార్థనకుబూను కొనవలసియున్నది. అనవసరములగు ఆవేశములకు, ఉద్రేకము లకు నెడమియ్యక నిశ్చలమనస్సుతో ప్రశాంత హృదయముతో డను సమస్యను పరిశీలింతము.

ఈనాటి వైద్యశాస్త్రము అపూర్వముగా నభ్యుద యము చెంది, బాధోపశాంతికి పలు తెఱగుల తోడ్పడు చున్నది. గత రెండు యుద్ధముల ఫలితముగా మానవా ఘోర యాతనలకు గురియైనది. విశేషించి సునిశితమైన దైహిక బాధలకు ప్రజలు తాళజాలకున్నారు. ఇక మతవిశ్వా సము సన్నగిలిపోయిన ఈ దినములందు పాపదోష ఫలితముల నైతిక ములకు వెఱవకున్నారు. కాబట్టి మనము దైహిక బాధలను, నైతిక ములను రెంటిని దృష్టిలో నుంచుకొని వ్యవహరించవలసి యున్నది.

మును ముగా నిర్వచించుట సులభ సాధ్యము కాదు. శూన్యప్రదేశమును గూర్చి తలపోయుట ఎంత కష్టతరమో మును గూర్చి చింతజేయుట అంత దుస్తరము. మనకు ఇంద్రియ గ్రహణముద్వారా జ్ఞానోదయము కలుగుచున్నది. పంచేంద్రి యముల మూలమున వస్తురూపములు తోలుత మానసము నకు స్ఫురించగా, భావపరంపరలు ఉత్పన్నమగుచున్నవి.

కావున అగోచరమగు శూన్యమును గూర్చి తలపోయుట దుస్సాధ్యము. అట్టితరి రోదసిని గూర్చి (Space) ముందు తలపోసి ఆ మీదట తత్ విరుద్ధమగు శూన్యమును గూర్చి చింతించుట పరిపాటి కాబట్టి శూన్య ప్రదేశమును గూర్చి మనము గడించినది ప్రత్యక్షజ్ఞానము కాజాలదు. అస్తిత్వమును గూర్చి యోచించుట మూలమున లేమిని గూర్చి కొంత గ్రహింపగలుగుదుము.

ఇగ్లీ వికారము ( g iness) ను గూర్చి భావించుటకు పూర్వము సకారమును eauty గూర్చి తలంచవలసి యున్నది. విరూపమును విరూపముగా నిర్వచించుట అసాధ్యము, సౌందర్యమును భావముతో పోల్చి చూచు మూలమున సౌందర్యరాహిత్యమును కొంతవఱకు గ్రహింపగలుగుచున్నాము. ఇటువంటి భావములను సాపేక్షికము లందురు (Re ative). ఉ॥ వన్యమృగములందు అందగాడైన వనచరము మానవులమధ్య కురూపిగా గాన్పించును. సౌందర్యము లోపించగా కలిగినది అందరాహిత్యము లేక వికారము. క్రమము పరిమాణాకృతులు కొఱవడిన ఫలితముగా కలిగినదది. ఇదియే సూత్రము డను భావమునకు వర్తించును. చెడుగునకు అస్తిత్వములేదు. అందువలన డును అభమని నిర్వచించినారు. మంచి లోపించగా కలిగినది చెడుగు లేక డు. ఉ॥ మానవునికి ఖేచరములవలె, పక్షములు లేకుండుట అవగుణము కాజాలదు. వానితో నిమిత్తము లేకయే అతని స్వరూప స్వభావములు సమగ్రమైనవి. పై కెగయుటకు వలసిన సాధన

ములతో నతనికి పనిలేదు. సహజలక్షణములు కొఱవడినప్పుడే సమగ్రతకు ముప్పువాటిల్లును. తద్వారా షు ఆవిర్భవించును. సహజధర్మ సమగ్రతవలన కలిగినది మేలు; సహజధర్మ లోపము వలన కలిగినది డు. ఏతత్ అవగుణము ద్వారా క్రమము భగ్నమగుచున్నది. లక్ష్యసిద్ధికై అనువైన సాధనముల సమకూర్చుటయే క్రమ మనబడుచున్నది. కావున పైనుదహరించిన అవగుణములు లక్ష్యమునకుగాని సాధనములకుగాని సంబంధించియుండును. మొదట లక్ష్యమునకు సంబంధించిన అవగుణములను పరిశీలింతము. ఉ : శుచిగాను, రుచిగాను పాకముల చేయలేని స్త్రీ మంచి వంటకత్తె కాజాలదు కదా కదలికలేని యంత్రమును చెడుదని చెప్పవలదా? బరువులు లాగలేని పశువు వ్యర్థమని చెప్పవలదా? ఇక, మంచిపాకముల చేయుటయే వంటకత్తె పని. యాంత్రాంగముల కదలించుటయే మంచియంత్రముచేయనగిన పని. బరువులను లాగుటయే పశువుయొక్క సత్ లక్షణము.

ఆ మీదట, సాధనములకు సంబంధించిన అవలక్షణములను పరిశీలింతము. ఉ : దృష్టిమాంద్యమువలన నేత్రములు లోపభూయిష్ట సాధనములగుచున్నవి. శీతోష్ణ బాధలను తొలగించలేని నివాసము వ్యర్థసాధనము. ఇట్లే, అనువైన వెలుగునియ్యని విద్యుద్దీపము సత్ సాధనము కాజాలదు.

ఒకొక్కప్పుడు చిత్తభ్రమవలన అవగుణములు ఆవిర్భవింపవచ్చును. సాంప్రదాయములను సహజధర్మము

లను గా పరిగణించినచో ఇట్టివి సంభవించును. ఉ: తన చెలికత్తెలకువలె కోరిన చీరె కట్టలేని యిల్లాలు పరితపించుట పరిపాటి. ఇల్లే తోటి బాలలకువలె తనకును వింతైన ఆటవస్తువులులేవని అల్లరిపిల్ల కినుకవహించును. తనమోటారు శరవేగముతో పోనందుకు చోదకుడు మండిపడవచ్చును.

ఇక, మనకు సంభవించు దులన్నియు ఊహాజనకము లనుట భావ్యముకాదు. కీడొక అవగుణమైనను జగత్తులో దానికి స్థానము లేకపోలేదు. మానవజీవిత పరమావధియు, విశ్వసృష్టికి కర్తయు నగు భగవంతునికి పొసగని అకార్యకలాపమువలనను, నైతికవిలువల విచ్ఛేదమువలనను దు జనించుచున్నది. అతి సున్నితములగు యంత్రాంగములను లేశమాత్రపు టిసుక రేణువులు స్తంభింపజేయు చందమున మానవ దుశ్చర్యలు విశ్వక్రమమును భగ్నపరచి అశేష దుష్ఫలితములకు మార్గ ప్రదర్శకము లగుచున్నవి. ధర్మబద్ధమైనటువంటియు, సముచితమైనటువంటియు, సాధనసంపత్తిని వినియోగించనందున కొన్ని చర్యలు సమగ్రతను గోల్పోయి లోపభూయిష్టము లగుచున్నవి. ఇవియు, సృష్టిక్రమము నుల్లంఘించి, కడలేని దుష్ఫలితములకు దారి యగుచున్నవి.

ఇక భౌతిక దులను గూర్చి పరిశీలింతము. శారీరక బాధలపట్ల హఠయోగులవలె వర్తించుటవలని ప్రయోజనమేమియు లేదు. వాటినిగూర్చి విస్మరించుటయు తగదు. బిడ్డ భూమిపై పడినంతనే చేసెడి ఆక్రందన బాధవలన కలిగినదేకదా. అతడా బాధను కతుకలో ప్రాణమున్నంతవరకు

భరింపవలసియున్నది. వ్యథలలో తరతమ భేదములు కలవు; కాని, బాధబాధే. ఒకడు బలహీనతవలన చెడుగులకు దూరము కావలెనని యెంత తాపత్రయపడునో అంత కఠోర ముగా వానిని అనుభవింపవలసి యున్నది. అతడింకను పెక్కు ఉద్రేకములకు, ఆవేశములకు వివశుడై దుర్భాహ్యమైన మనః క్లేశమునకు గురికాగలడు.

ఇక బాల్యము, కౌమారము, యౌవనము వార్ధక్యావస్థ లకు సంబంధించిన కష్టనిష్ఠురములు, వ్యాధులు, విపత్తులు, కుటుంబవియోగములు, బతుకుతెరువుకొరకు పడునటువంటి పాటులు ఇత్యాది సామాన్య బాధలను దులని ఎంచరు. ఈ యాతనా పరంపరలన్నియు మానవ స్వభావ సిద్ధమని తలపోయుదురు. మతదృష్ట్యా పరికించితిమేని, యివియన్నియు దు లనక మానము. ఏలయన మానవు డనాదిగా ఈ నికృష్ట దశలో లేడని వ్యక్తమగుచున్నది. భయంకర వ్యాధులు, ప్రవ ప్రమాదములు, అకాల వియోగములు, కుటుంబముల విచ్ఛిత్తి యిత్యాది యసమాన్య సంఘటనలను తిలకించితి మేని మానవుని పరిస్థితి మరింత అధ్వాన్నముగా నున్నట్లు తోచకమానదు. అట్టితరి మానవ స్వభావము సహజలక్షణము లనే గోల్పోయినటుల గోచరించకమానదు. ఇంకను, దుర్భా హ్యమైన దుస్సంఘటనలకు అమానుష హింసా కాండకు గురియై నిరాశా నిస్పృహల చెందుచున్నాడు.

ఈ సందర్భమున నాజీ నియంతలు బానిస శిబిరము లందు గావించిన చిత్రవధలను స్మరణకు గొనివచ్చుట సము

చితమని భావించుచున్నాము. వానిని కళ్ళార గాంచిన వ్య_ు
ఆ భయంకర సన్నివేశముల నిట్లు చిత్రించినాడు :

వారిని పెట్టిన బాధలకు కారణము "శమలోపము కాదు; కార్యనిర్వాహణ కొరతయు కాదని నాకు తోచినది. బుద్ధిపూర్వకమైన సమగ్రపద్ధతులతో దీక్షాబద్ధమైన చిత్త సంకల్పములతో నెలకొల్పబడిన నరకకూపము లా బానిస శిఖరములు. మా మలమందు మేము వసించి, మా పురీష మందు మేము మునిగి, మా దుర్గంధమందు మేము అసువుల బాయునట్లు గావించినా రా క్రూరులు. మాలోగల మానవత్వ మును కించపరచి మమ్ము పరమ నికృష్టులనుగా జేయుటకు ఉద్దేశింపబడిన అమానుషచర్య లవి. మాలోగల వ్యక్తిత్వ మును రూపుమాపి, మమ్ము వన్యమృగాలనుగా మార్చి, మా నీచత్వమును మా అనుచరుల అధమత్వమును గాంచి భీతిచెందునట్లు చేసినారు. ఇట్లు మేమందరము ఆత్మవిశ్వాస మును గోల్పోవుటయే ఆ పరమకిరాతుల ముఖ్యలక్ష్యము. ఇది నాజీలకు తెలియని రహస్యముకాదు. అసహ్యమును పుట్టించు మా దీనావస్తను గాంచి మమ్ము మేమే సహించ లేకపోతిమని వారెరుగుదురు".

జగత్తునందుగల మేలు డులు, ఖేదమోదములును చిత్ర లేఖనమందు గల వెలుగునీడలకును, గానకళయందలి శృతి, అపశృతులకును సరిపోలునని చెప్పుట పరిపాటి. ఈ వింత యుపమానముల విన్నటువంటి మా లె బ్రాంక్ మహాశయుడు "చిత్రకళయందు వెలుగునీడలు, గానకళయందు శృతి అప

శ్రుతులుండుట అవస్యమైనచో నిందుచూలాండు గర్భధారణ మూలమున సహ సఅసురులను వికలాంగులను కనవలసిన బాధ్యతేమనియు, ఇంతకు మించిన కుతర్కము వేరొండు లేదనియు సింహగర్జనలు చేసినాడు.

డు డే; దానిని కాదనలేము; లేదనలేము. భీతి గొలుపుదాని నిజస్వరూపమును అంగీకరించక తప్పదు. ఇది ఉన్న వాస్తవము. కాని, దానికి లేనిపోని అస్తిత్వములు ఆపాదించరాదు. చలనము మంచిదేకాని కుంటువడిన చైతన్యము మంచిది కాజాలదు. అయినను, స్తబ్ధతకంటెను లోపభూయిష్టమైన చలనము కొంత మేలుకదా మంచివస్తువునందు సహజ గుణాలోపమువలన చెడుగు ఉండవచ్చునని వ్యక్తమగుచున్నది.

డు ఆవిర్భవించుటకు పూర్వమే భగవంతుడు కలడని గుర్తించవలసి యున్నది. లోపభూయిష్టమైన జగత్తు, లేక పూర్తిగా విషకలుషితమైన విశ్వము సర్వసంపూర్ణుడగు భగవంతుడు కలడని సూచించుచున్నది. సమగతలేని వ్యక్తి ఎంత ఘనుడైనను విలువలేదు. సృష్టికర్తకే అవగుణము లేదు. సర్వసంపూర్ణుడు, అఖండుడు ఆయన.

సర్వోత్కృష్టుడైన భగవంతుడు సర్వసంపూర్ణమగు జగత్తును సృష్టించలేడు. అట్లుసంభవించెనేని కారణ కార్యములకు భేదముండనేరదు. దీనినే అద్వైత మందురు. కాబట్టి భగవంతుడు సాంతమైన విశ్వమునుమాత్రము సృష్టించ గలడు. అది యెంత రమణీయముగా నుండినను, దానిలో డునకుమాత్రము స్థానము లేకపోలేదు.

అటులైనచో, లోపభూయిష్టమైన ఈ జగత్తును సృష్టించవలసిన అవశ్యమేమి? అన్నటువంటి ప్రశ్నకు సమాధానము మానవాతీతమైనది. భగవత్ సంకల్పముల నెఱుగుట ఎవరితరము? అయినను మనమీ సృష్టిప్రణాళికను అర్థముచేసికొనుటకు యత్నించవచ్చును. పూర్తిగా గ్రహింపజాలనిమాట నిజము. ఈ యనంత విశ్వరహస్యముల నన్నిటిని తెలిసికొనుట కంటెను భగవంతునిగూర్చి లేశమాత్రము నెఱుగుట కడు శ్రేయోదాయకము. భగవత్పుత్రులమైన మనము వినమ్రులమై ఆయన విశ్వమందు ఏమి నేల జరుగనిచ్చెనో తెలిసికొందము.

# ౫ అధ్యాయము

## పాపదోషము - దుః

సాధారణముగా ఆధునిక రచయితలందరు దును భౌతికమని నైతికమనియు రెండు తెఱగుల పరిగణించుదురు. కాని, సుప్రసిద్ధ తత్త్వవేత్తయగు థామస్ అక్వైనస్ చెడుగును పాపదోషము అనియు శిక్షాదండనలనియు, సునిశితమైన వేరొక విభజన గావించినాడు. ఉ॥ భగవద్దర్శనమును గోల్పోవుట, నైతిక డేకాని పాపపుచేటుకాదు.

సృష్టిజాతములగు బుద్ధిగత జీవులు, భగవదభీష్టమును ప్రతిఘటించుట మూలమున, పాపదోషమను దు జనించుచున్నది. సార్వభౌముడగు సృష్టికర్తపై మానవమాత్రులు చేసిన తిరుగుబాటువలన కలిగిన డది. ఇట్లు విశ్వ మమునుల్లంఘించుటకు సాహసించినటువంటి పాపకర్ములు ఏతత్ ఫలితముల ననుభవింపకుండుట దురూహ్యము, దుస్సాధ్యము. మానవులు బుద్ధిపూర్వకముగా గొనివచ్చిన విశ్వసంక్షోభమిది. ఇక, బుద్ధిలేని పశుపక్ష్యాది ప్రాణి కోటులన్నియు విశ్వశాంతికి చిచ్చుపెట్టజాలవు. దిగంతములందు కళాకాంతులతో పరిభ్రమించు గోళకోటులు, కనులను మిఱుమిట్లుగొలుపు నక్షత్రరాసులు, ఒక్కమాటలో సృష్ట్యంతయు భగవంతుని మహిమాతిశయముల నిత్యము ర్తించుచున్నవి.

ఇక మానవుని పరిస్థితి వీటన్నిటికంటెను భిన్నమైనది. అతడు జగత్తును ద్వంద్వదృష్టితో పరికించుచున్నాడు. ఆది

స పతులు సహితము మేలు డుల నెఱిగించెడు వృక్షముపట్ల ప్రదర్శించిన దృక్పథ మిదియని చెప్పవచ్చును. ఒకవంక ఆ నిషిద్ధఫలము అందముగాను, ఆనందముగాను ఆకర్షణీయ ముగాను చవిచూడ మాధుర్యముగాను గోచరించి కనులను మిఱుమిట్లుగొలిపినది. వేరొకవంక అది వారికి అనర్థమనియు, శాప గ్రస్తమనియు, మృత్యుదాయకమనియు తెలియనిది కాదు. ఇట్లు వారు భగవదాజ్ఞ నుల్లంఘించుటకు పూర్వము యుక్తాయుక్త విచక్షణచేసి స్వేచ్ఛాపూర్వకమైన స్వయం నిర్ణయమునకు రాగలిగిరి. కావున వారికి నైతిక బాధ్యతలు సంక్రమించిన వని చెప్పక తప్పదు.

భగవత్ మహిమాభ్యున్నతికి తోడ్పడుటయే మాన వుని విద్యుక్తధర్మము. అతడు పశుపక్ష్యాది ప్రాణిసంతతుల కంటెను అధికమధికముగా సృష్టికర్త ఘనతను పొగడవలసి యున్నది. తాను చేయగల స్తుత్యార్పణము స్వేచ్ఛాపూర్వ కమై యుండవలెను. ఇట్లతని జీవితము సహితము సుఖప్రదము కాగలదు. అయినను, తన కసాధ్యమును మానవాతీతములైన ఆ నిత్యానంద సుఖసౌఖ్యములకొఱకు అతడు నిరీక్షింపవలసి యున్నది. ఇది భగవత్ సంకల్పము. ఆయనచేసిన వాగ్దాన ములు నెరవేరితీరును. అంతమాత్రమున, మానవ సహకార సహాయ్యములతో నిమిత్తము లేకపోలేదు. భగవత్ సంకల్ప మును మానవస్వాతంత్ర్యేచ్ఛలను సమన్వయపరచుట మన కసాధ్యము. ఇదియొక వేదరహస్యమని చెప్పకతప్పదు. "నిన్ను సృష్టించిన భగవంతుడు నీ సహకార సహాయ్యములు లేనిదే

నిన్ను రక్షింప''దని అగస్టిన్ మునిమాన్యుడు నుడివిన వార్తలు కడు గమనార్హములు. కావున మానవాత్మల రక్షణమందు ఉభయులు భాగస్వాములు. ఒకవంక సమస్తమును భగవంతుడు నిర్వహించుచున్నాడని వేరొకవంక సర్వమును మానవుడే నెరవేర్చుచున్నాడనియు చెప్పినను అత్యుక్తి కానేరదు. ఎందుమూలమున భగవత్ మహిమాభ్యున్నతికి ముప్పు వాటిల్లుటలేదు. మానవుని గౌరవప్రతిష్ఠలకు ను మూడు టయు లేదు.

పై నుడివిన సూత్రము మానవక్రియ లన్నిటికి – అల్పములు కాని సమధికములు కాని – అన్వయించును. భగవంతుని సహకారము లేనిది మానవు డేకార్యమును చేయజాలడు. మానవ చర్యల అస్తిత్వమునకు భగవంతుడు బాధ్యుడైనను ఏతత్ గుణాగుణములకు మానవేచ్ఛయే హేతుభూతమని చెప్పక తప్పదు. నాస్తిక్యమునకు భగవంతు డెన్నడు బాధ్యుడు కాజాలడు. డునకు అస్తిత్వము లేదు; కావున భగవంతుడు దానికి కర్త కాజాలడు. అందువల్లనే డును అభమని నిర్వచించినారు. దానితో భగవంతునికి ప్రమేయమే లేదు. కావున మానవుడే చెడుగునకు పూర్ణబాధ్యత వహింపవలసి యున్నది.

మానవుడు జన్మతః సమాజికుడు. తనకై తాను జీవయాత్ర చేయజాలడు. అథవా, తాను సోదర మానవులకు దూరమై ఏకాకిగా జీవించినను మానవ సమాజముతో తెగతెంపులు చేసికోజాలడు. అందుచేత మానవచర్యల ప్రభావం

మానవజాతికేకాక సమస్త జగత్తునకు తగిలి రాగలదు. విస్తృతార్థములో మానవ సత్ చర్య దుశ్చర్యలకు విశ్వజనీనత సిద్ధించుచున్నదని భావము. అయినను ఆదిపురుషుని పాపదోషముతోను క్రీస్తు విశ్వరక్షణోద్యమముతోను మానవ కర్మలు సరితూగజాలవు. ఒక్క ఆదము చేసిన పాపదోష ఫలము మానవజాతి మొత్తమునకు సంక్రమించినది. ఇట్లే క్రీస్తు స్లీవపై సమర్పించిన ప్రాయశ్చిత్త ఫలము సమస్త మానవుల రక్షణకు దోడ్పడినది. ఇవి రెండును మానవ చరిత్రలో అపూర్వ ఘట్టములు. తత్కారణమున మేలు కీడుల పట్ల సమస్త మానవాళికి అవినాభావ సంబంధము కలదని వ్యక్తమగుచున్నది. ఒకచో వ్యక్తిగత పాపదోషఫలితములు తరముల తరబడి పొడసూపును. పూర్వులు కావించిన దుశ్చర్యలకు వంశపరంపరాగత ఫలితములు సంభవించుటయు కలదు. ఆలు బిడ్డలను విడనాడు క్రూరుడు కుటుంబ విచ్ఛిత్తికి తోడ్పడుచున్నాడు. ఒక్క కిరాతకచర్య దురూహ్యమైన బాధలకు దోహద మియ్యగలదు. ఇట్లే సత్ చర్యల మూలమున సత్ఫలములు కలుగక మానవు. తద్వారా సమాజమునకు నైతిక బలము సత్ ఫలములు చేకూరగలవు. "అభ్యుదయ పథము నందుకొనిన ప్రతిజీవియు యావత్ప్రపంచమును సమున్నత స్థాయికి కొనిపోగలడని, ఎలీజబెత్ లెజర్ ఉద్ఘాటించినది.

ఇట్లు స్వేచ్ఛాజీవులు వ్యక్తిగతముగా స్వాతంత్ర్యేచ్ఛలను పెంపొందించి సమష్టి శ్రేయస్సునకు దోహదమియ్యగలరు. సుమాతృకవలన సోదర మానవుల హితవుగోరుట

ద్వారా సంఘోద్ధరణకు తోడ్పడగలరు. ఇక ఆధ్యాత్మిక (Su ernatura ) జీవితమందు సహితము వ్యక్తిగత ప్రార్థ నలు, తపశ్చర్యలు సోదరమానవుల శ్రేయస్సుకు పరోక్ష ముగా ( e. Con ruo) నుపకరించగలవు. అయినను స్వా తంత్ర్యేచ్ఛల ప్రాభవము క్షీణించుటలేదు. భగవదనుగ్రహ ప్రభావము వలనకాని, విజ్ఞానోదయము వలనకాని మానవే చ్ఛలకు భంగము కలుగదు. భగవత్ సంకల్పము, మానవ స్వాతంత్ర్యం భగవదనుగ్రహము, పురుష ప్రయత్నము అను నటువంటి శక్తులు అసదృశమైనవి. అయినను మానవ జీవిత మును సమున్నత స్థాయికి కొనిపోగల దివ్యసాధనములు సహి తము ఇవియే.

ఇక స్వేచ్ఛా స్వాతంత్ర్యములు విపరీత ఫలితములకు గురికాకమానవు అనగా కొన్ని చిక్కుపరిస్థితులలో ఒకడు తన స్వేచ్ఛను పురస్కరించుకొని కార్యసాధనకు కడంగ వచ్చును లేక విరమించుకొనవచ్చును. అదియే స్వేచ్ఛను బహుతెరగుల ప్రయోగింపవచ్చును. తత్ సందర్భము లన్నిటి యందును స్వేచ్ఛ నైతిక విలువలను పాటింపవలసి యున్నది. ఒకడు తన స్వేచ్ఛను పురస్కరించుకొని నైతిక శాసనముల నతిక్రమించుట ఎంత పాపభూయిష్టమో తద్విషయమై యుపే క్షించి మిన్నకుండుటయు అంత దోషభూయిష్టము. అనగా స్వేచ్ఛ చెడుగును వరించెడి యవకాశములులేకపోలేదు. దును స్వేచ్ఛ అపేక్షింపవచ్చును; కాని అది స్వేచ్ఛా తత్వమునకు చెందినదికాదు. స్వేచ్ఛ దును ఉపేక్షించుట స్వేచ్ఛ లోప

భూయిష్టమని వ్యక్తమగుచున్నది. ఈ సత్యము మనకు అను భవ సిద్ధము. ఏలయన స్వర్గమందు భగవత్ సందర్శన భాగ్యము చూరగొననటువంటి పుణ్యశీలురు స్వాతంత్ర్యేచ్ఛ లను అనుభూతి చేసినను వారు చెడును వరింప నశక్తులై యున్నారు. దేవరాజ్యమున మానవేచ్ఛ బహువిధ శ్రేయము లను ఎన్నుకొనగలదు కాని, చెడుగును మాత్రము కోరజాలదు సచ్చిదానంద మూర్తియగు భగవంతుని దర్శించువానికి కొదు వేమి కలదు? అట్టి మహద్భాగ్యమునకు దూరమగుట దుస్సా ధ్యము. ఇహమందు మాత్రము మేలు చెడులను ఎన్నుకొన గల స్వేచ్ఛ మానవుని సహజలక్షణము అయినను అది చెడును చెడుగా వరించునని భావముకాదు. చెడుగునకు అస్తిత్వమే లేదు కావున అది దేనిని ఆకర్షింపనేరదు. స్వేచ్ఛ మానవ జీవితమునకు పరమావధియగు భగవంతుని కాదని వేరొక మేలును కోరను వచ్చు.

ఇక మానవుడు తనయున్న తాదర్శములను ఈషణాత్రము విస్మరించు తరి, స్వేచ్ఛ చెడును వరించుచున్నది. ఇట్టి పరధ్యాస అల్పదోషములకు హేతుభూతమగుచున్నది. భగవత్ విశ్వాసము క్షణమాత్రము సడలించబడిన తప్ప, అవి యవ గుణములు కాజాలవు. మానవ జీవితమందు పరధ్యాసలుండక తప్పవు. అయినను స్థిరబుద్ధితో వానిని త్రోసివేసి మనము బాగుపడవలెనని భగవదభీష్టము. తన్మూలమున మన బల హీనతయు భగవదనుగ్రహావశ్యకతయు వ్యక్తములగుచున్నవి. అద్దానికై మనము వినమ్రులమై ప్రార్థించవలసి యున్నది.

ఇంతకంటెను దారుణమైన పాపదోషములు సంభవించుటయు కలదు. చాల విషాదకరమైన సంఘటనలవి. ఇట్టి సందర్భములందు స్వేచ్ఛ, మనకు చిత్తభ్రమ కలిగించి, మనసులను కలవరపెట్టి, దైవ భయమును మనస్సాక్షిని తృణీకరించు ; ఎది. తత్సమయమున, స్వేచ్ఛ ఆయా ప్రత్యేక మేలు నపేక్షించి తద్దానిపై దృష్టిని కేంద్రీకరించుచున్నది. తదన్యములైన నైతిక శ్రేయముల విస్మరించుచున్నది. ఇట్లు మానవ సంకల్పము "స్వార్థమును గోరుచు భగవంతుని, ఆయన ధర్మశాసనముల నిరాకరించుచున్నది" అని అగస్టిన్ వేదాంతి నుడివినాడు. అంతట స్వేచ్ఛ నైతికముగా సంపూర్ణ పతనము చెందుచున్నది. మనవాంఛితములు, అభీష్టములు మన జీవిత పరమలక్ష్యమునకే విరుద్ధములు; కావున మనము భగవంతునికి విముఖులమగుచున్నాము. మహాపాతకమును కట్టుకొనుచున్నాము. ఇంతకంటెను గొప్ప దుర్వార్తల్లనేరదు. ఇట్లు మానవుడు తన గమ్యస్థానమును తప్పి నడచుచున్నాడు. అతడు తన చిత్తము వచ్చినటుల సత్పథమునుండి పతనమై అక్రమ మార్గమందు కొట్టుమిట్టాడుచున్నాడు.

క్రైస్తవునికే ఈ దుర్గతిపట్టినయెడ, అతడు తన "సంస్నపన వాగ్దానముల" భంగపరచుచున్నాడు. భగవదనుగ్రహ భ్రష్టుడగుచున్నాడు.

అతని హృదయము సర్వోన్నతునికి నిలయము కాజాలదు. సంజీవవృక్షమునుండి ఖండించబడిన రెమ్మతో సమానుడతడు. నిరర్థకమైన ఆ శాఖ అగ్నికి ఆహుతికాగలదు. ఇట్లతడు

విశ్వక్రమమును భగ్నముచేసి సృష్టిజాతములకు గర్భశత్రు వగుచున్నాడు,

మేలుడుల నేటి కోరగల స్వేచ్ఛాస్వాతంత్ర్యములకు ప్రతిబంధకములు, అవరోధములు లేకపోలేదు. మను వరించెడు మానవచర్య లన్నియు జగత్తునందుగల చెడుగులను ద్విగుణీకృత మొనర్చుచున్నవి. ధర్మపథమును వీడి, నైతికముగా పతనము జెందినవారలు మృత్యువాతబడి శాశ్వతముగ శాపగ్రస్తు లగుటయు తటస్థించవచ్చును. ఏలయన వారలు స్వార్థమును పరిత్యజించి ప్రేమను వరించినవారు కారు.

ఇక, మానవ స్వేచ్ఛా స్వాతంత్ర్యము లెంత బాధ్యతాయుతములో నంత శ్రేయోదాయకములు; ఎంత ప్రమాద భూయిష్టములో నంత ఫల సాధకములు. లేకున్నయెడ భగవంతు డట్టి స్థితిగతులను మానవునికి సంకల్పించియుండనోపడు. ఆయన నిరతము మన శ్రేయమునే కోరుచున్నాడు. భగవత్ సంకల్పమును మనము పూర్తిగా గ్రహింపలేకున్నను బుద్ధిగతజీవు లందరు మానవులేమి, దేవదూతలేమి తమతమ జీవిత పరమ లక్ష్యమునుగూర్చి తామే నిర్ణయించుకొనగల స్వేచ్ఛాస్వాతంత్ర్యముల పొందియున్నారని చెప్పక తప్పదు. ఈ స్వయం నిర్ణయాధికారము శివ మోదములతో నిండి నిబిడీకృతమైయున్నది. తీరని పోరుసలిపి సౌందర్య కిరీటమును పొందగల అవకాశములు సంకల్పించబడినవి. విశేషించి, భగవంతుని యెడ తమకుగల ప్రేమను ప్రదర్శించుట మూలమున బుద్ధిగత జీవులు ఈ స్వయం నిర్ణయాధి

కారమును చెలాయించగల సదావకాశములు లేకపోలేదు. మానవ సృష్టిలో భగవంతుడు ప్రదర్శించిన విశిష్టత యిదియే.

ఎవరి సహకార సహాయములతో నిమిత్తము లేకయే సర్వ సంపూర్ణుడు, సచ్చిదానంద మూర్తియగు సర్వోన్నతుడు స్వేచ్ఛాపూర్వకమైన మానవ పూజారాధనలను, ప్రేమానురాగములకై నిరీక్షించు చున్నాడనిన ఎంతటి వైపరీత్యము విశ్వసృష్టిలో తాను పరోక్షముగా పొందగల అద్వితీయ గౌరవ ప్రతిష్ఠలకు మానవపూజా పురస్కారములే తార్కాణములు.

భగవత్ దృష్టిలో స్వేచ్ఛా స్వాతంత్ర్యము లెంతయు అమూల్యములు. కావున వాని పరిరక్షణ కాయన కృతనిశ్చయుడై యున్నాడు. అందువలన మానవేచ్ఛల కాయన ప్రత్యక్షముగా నంతరాయముల కలిగించకుండుటయే కాక, ఏతత్ నిర్వహణమందు సహకార సహాయ్యముల నెఱపుచున్నాడు. వాని మనుగడకే ముప్పువాటిల్లకుండునట్లు సంకల్పించుచున్నాడు. ఈ మహా్మత్రమున గోళ కోటులను దిగంతములకు విసర శక్తి సామర్థ్యములు గల విశ్వకర్త మానవ స్వేచ్ఛా స్వాతంత్ర్యముల పట్ల ప్రదర్శించెడు ఓర్మి సహాన భావము లెంతని వచింపగలము? సృష్టి జాతములన్నిటి తనవంక నాకర్షింపగల ప్రజ్ఞానిధి. సృష్ట్యంతయు ఆయనకు స్వంతము. ఆయన చిత్త సంకల్పములకు నిరాఘాటముగా నిర్వర్తించ బడుచున్నవి. ఇక ఆయన ప్రాభవమునకు నంతు లేదు. అయినను మానవేచ్ఛలు నెలకొని యుండుట భగవ

దిచ్ఛ యని మఱువరాదు. "నిన్ను వక్రమార్గముల నడిపించినది ఆయనే యని మొఱపెట్టవలదు; తిరుగుబాటుదారులతో భగవంతునికి నిమిత్తమేమని నీవు తలపోయుచున్నావా ? భగవంతుడు ద్వేషించని నీచమైన దుష్కార్య మేదియు లేదు.

ఆయనకు వెఱచి తద్దాని నెవరు ప్రేమించేదిలేదు. మానవు లావిర్భవించుటకు పూర్వము దేవుడు వారిని కలిగించినాడు. సృష్టిచేసి, వారిని తమ తమ స్వేచ్ఛా సంకల్పములకు విడనాడినాడు. అయినను, వారి క్రమ శిక్షణకై ఆజ్ఞల నందజేసినాడు. ఆ యాదేశముల నీ వాచరించితివేని, తిరుగ నిన్నవి కాపాడి ఆయన దయకు పాత్రునిగా జేయ సాక్షీభూతములగును. నిప్పునీరు నీ కర్పించి నీ కిష్టమైన దానిని యెన్నుకొనుమని చెప్పిన చందమున, జీవన్మరణములు, జీవన దుర్దశలు, మానవుని సమక్షమున నుంచబడినవి. వాని నేఱికోగల (స్వేచ్ఛయే) నీ కియ్యబడిన వరము."

అధ్యాపకుని గ్రంథము 5. 8.

మానవ స్వేచ్ఛాస్వాతంత్ర్యముల కాపాడుటకు భగవంతుడు పరోక్షముగాను,పటిష్ఠముగా తన్ను తానావిష్కరించుకొనవలెను. తన్మూలమున కలుగు జ్ఞానోదయము నిగూఢముగాను నిర్దుష్టముగా నుండవలెను. ఏతత్ మార్గదర్శకత్వము అగమ్యముగను సగోచరముగా నుండవలెను. పైనుడివిన విడ్డూరపు పరిస్థితులందుమా తము భగవత్ విశ్వాసమును పదర్శింప నవకాశము లున్నవి. సర్వము సుస్పష్టముగా తెలిసిన యెడ, విశ్వాసమునకు స్థానమే లేదుకదా

ఈ విశ్వాసము మానవులను పరమపథమందు పురోగమింపజేయుచు, స్వర్గసుఖమునకు నాందిగా పరిణమించుచున్నది. అయినను అయ్యది నిగూఢము, నిరాఘాటమైనందుచేత స్వాతంత్ర్యేచ్ఛలకే ముప్పు వాటిల్లుటలేదు. కావున మానవులు స్వేచ్ఛాయుతమైన ప్రేమాను రాగముల భగవంతునిపట్ల ప్రదర్శింపగలరు. దివ్యజ్ఞానము సహితము మానవేచ్ఛలకు అవాంతరము కాజాలదు.

ఇక, జీవన్ముక్తులు బహు కొందరు మను వరింపలేని మాట వాస్తవము. భక్తాగ్రేసరులలో సహితము అటువంటి వారు బహుఅరుదు. వారు సహా తమ పవిత్రకరణ మంతయు భగవదను గ్రహాబద్ధమని వాపోవుదురు. తాము పాపకర్ములమని సవినయముగా భావించెదరు. చెడుగుతప్ప తామేమియు చేయజాలమని వగచుదురు.

మానవస్వేచ్ఛా సంకల్పమును పటిష్ఠము చేయుటకు భగవంతుడు దేవగుణ ప్రసాద మను సాధన సంపత్తిని మన కంద చేయుచున్నాడు. ఈ మహావరమును అనుభూతి చేయుట కసాధ్యము: వర్ణనాతము. విజ్ఞానమును గూర్చి చెప్పబడిన స్తుతివాక్కులు దేవగుణ ప్రసాదమునకు చక్కగా వర్తించును. "మనోవికాసమును ప్రసాదింపగల ప్రభావ మందుగలదు. సమున్నతమున కది ప్రత్యేకించబడి యున్నది. మూలమున ఒకటిగానున్నను, కార్యపరత్వమున బహుళము. సూక్ష్మమైనను సులభ గ్రాహ్యము. అపూర్వ చైతన్యము గల శక్తియది; అభేద్యమైనది, ప్రామాణికమైనది, సౌజన్యత

సద్భావములు కలది; సునిశితమైనది, తిరుగులేనిది, దయా దాక్షిణ్యములు కలది; సమస్త అవగుణములకు, చింతలన్నిటికి దుర్గమమైనది.”                                 విజ్ఞాన గ్రంథము 7-22.

ఇట్లు, దేవగుణ ప్రసాదము ప్రోద్బలము లేని సౌజన్య సభ్యతలతోను మానవాత్మల పవిత్ర పరచగల శక్తి సామర్థ్యములతోను అలరారుచున్నది.

స్వాతంత్ర్యేచ్ఛల వలన జగత్తునందు ఎడు ఆవిర్భవించినను, తద్వారా భగవత్ మహిమాభ్యున్నతి మానవ కళ్యాణములు ద్విగుణీకృత మగుటకు కడలేని సావకాశము లేర్పడుచున్నవి.

# ౭ అ ధ్యా య ము

## కీ డు - శి క్షా దం డ న లు

భగవంతుని స్వభావ లక్షణములగూర్చి మనకుగల భావముల కనుగుణముగా డను సమస్య నవలోకించుదుమని బెర్గ్సన్ మహాశయుడు నుడివినాడు. కొందరు భగవంతుడు దయాదాక్షిణ్యములు లేని పాషాణ హృదయుడనియు, తన సంతుష్టికొరకై సృష్టిజాతముల హింసపెట్టెడి పరమ కిరాతుడనియు మరికొందరు ఏమి జరిగినను ఉపేక్షించి మిన్నకుండెడి అమాయకుడనియు అభిప్రాయపడుచున్నారు. ఇట్లు తలపోయుట సమంజసముకాదు. వాస్తవముగా నతడు అనంత దయామయుడు. పాపకర్ములు తమ దుర్దశయందు నశింపవలయునని ఆశించడు. కాని వారలు పశ్చాత్తప్తులై హృదయపరివర్తనము చెందవలయునని ఆయన యభీష్టము. మానవు డెవడు భ్రష్టుడు కావలయునని ఆయన సంకల్పించడు. ఆయన అనంత న్యాయశీలుడు, మహాధర్మాత్ముడు. ఆయన నెలకొల్పిన భౌతిక, నైతిక శాసనములు సర్వదా అమలు జరుగుచునే యుండును. తీవ్రపరిస్థితులందు వానిని సడలింప ఆయనకు శక్తి కలదు. కాని బలవత్తర కారణములున్న తప్ప అటు లెన్నడు చేయడు. బుద్ధిగతజీవి తాత్కాలికమైన పరీక్షలకు లోనగుట, నైతికసూత్రములలో నొకటి. దేవదూతలకు పెట్టిన పరీక్ష క్షణికము. వారలాధ్యాత్మికస్వభావులుకావునవారలకత్యంతకుశాగ్ర బుద్ధికలదు. అందుచేత సుమనస్కులు భగవదనుగ్రహమును అణుమాత్రమున అంగీకరించుటయో లేక తృణీకరించుటయో

# ౫ అధ్యాయము

## కీడు - శిక్షా దండనలు

భగవంతుని స్వభావ లక్షణములగూర్చి మనకుగల భావముల కనుగుణముగా డను సమస్య నవలోకించుదుమని బెర్గ్‌సన్ మహాశయుడు నుడివినాడు. కొందరు భగవంతుడు దయాదాక్షిణ్యములు లేని పాషాణ హృదయుడనియు, తన సంతుష్టికొరకై సృష్టిజాతముల హింసపెట్టెడి పరమ కిరాతుడనియు మరికొందరు ఏమి జరిగినను ఉపేక్షించి మిన్నకుండెడి అమాయకుడనియు అభిప్రాయపడుచున్నారు. ఇట్లు తలపోయుట సమంజసముకాదు. వాస్తవముగా నతడు అనంత దయామయుడు. పాపకర్ములు తమ దుర్దశయందు నశింపవలయునని ఆశించడు. కాని వారలు పశ్చాత్తప్తులై హృదయపరివర్తనము చెందవలయునని ఆయన యభీష్టము. మానవు డెవడు భ్రష్టుడు కావలయునని ఆయన సంకల్పించడు. ఆయన అనంత న్యాయశీలుడు, మహాధర్మాత్ముడు. ఆయన నెలకొల్పిన భౌతిక, నైతిక శాసనములు సర్వదా అమలు జరుగుచునే యుండును. తీవ్రపరిస్థితులందు వానిని సడలింప ఆయనకు శక్తి కలదు. కాని బలవత్తర కారణములున్న తప్ప అటు లెన్నడు చేయడు. బుద్ధిగతజీవి తాత్కాలికమైన పరీక్షలకు లోనగుట, నైతికసూత్రములలో నొకటి. దేవదూతలకు పెట్టిన పరీక్ష క్షణికము. వారలాధ్యాత్మికస్వభావులుకావునవారలకత్యంతకుశాగ్ర బుద్ధికలదు. అందుచేత సుమనస్కులు భగవదనుగ్రహమును అణుమాత్రమున అంగీకరించుటయో లేక తృణీకరించుటయో

నిర్ణయమునకు రావలసియున్నది. భగవత్ సమక్షమున తుది నిర్ణయము చేయుట కడు సులువు. సచ్చిదానందమూర్తియగు భగవంతుని ఎవడును నిరాకరించలేడు. ఆయనను విధిగా ప్రేమించును. అట్టియెడ స్వాతంత్ర్యేచ్ఛ లుండనేరవు. ఇక పరీక్షయులేదు. ఆ కాలపరిమితియు మనకు తెలిసియున్న పక్ష మున జీవితలక్ష్యసిద్ధినిగూర్చి ఉపేక్షించి కాలహరణము గావింతుము. కడవరకు నిర్హేతుకముగా జీవించుదుము. సర్వజ్ఞు డగు సర్వేశ్వరుని చిత్తసంకల్పములు దురూహ్యములు కదా! ఆయన ఏర్పాటుచేసిన స్వేచ్ఛావిధానము తిరుగులేనిది. ఇష్టా నిష్టములు లేనిదే ఎవడును మేలు డులనుగూర్చి నిర్దుష్ట నిర్ణయమునకు రాజాలడు. స్వాతంత్ర్యేచ్ఛలు లేనిదే మాన వుడు దేనిని బాధ్యుడుకాడు. స్వేచ్ఛాపూర్వకమైన తీర్మాన మును గావించిన మీదట దాని బాగోగులకు అతడే బాధ్యుడు.

క్రమబద్ధమైన భగవత్ సృష్టిలో కలుగు అక్రమ సంఘటనల వలన డు వాటిల్లుచున్నది. ఇది ప్రకృతిశాసనము లకు సంబంధించిన వేరొక నైతికసూత్రము. డుమూలమున బాధలు సంక్రమించును. అందుచేత భగవంతుడు కఠినాత్ము డనుట అవివేకము. క్రమానుగతముగా నడచెడి యంత్రమునకు అవాంతరములు కలిగించినయెడ అది చెడి దుష్ఫలితములకు గురియగును. ఈ సూత్రమే విశ్వక్రమమునకు వర్తించును. ఉదాహరణకు ఒక అబద్ధము మనుష్యులలో భయసందేహముల రేకెత్తించి, అనేక అనృతములకు దారితీయును. ఇట్లే తాగు బోతులలో గల యవలక్షణములు తన సంతానమునకు సం

మించితీరును. వేరొక ముష్కరుని ఛాందసము, దారుణ యుద్ధమునకు దారితీయ, ఏతత్ దుష్ఫలితములకు వాడే బాధ్యుడు.

ఇట్టి దుస్సంఘటనల భగవంతుడు జరుగనీయుట దేని కని కొందరమాయకులందురు. భగవంతుడు సర్వశక్తివంతుడైనను అకారణముగా సృష్టిచట్టములను, ప్రకృతి నియమములను సడలించుటకు చిత్తగించడు. మహిమాద్భుతములు ధర్మస్థాపనకు, మతసత్యముల ఋజువు పరచుటకు, ఒకని భక్తి తత్పరతలను చాటిచెప్పుటకు ఉద్దేశింపబడినవి. భగవంతుడు మాటిమాటి కిట్లు ప్రకృతి నిలయముల సడలించెనేని మానవుడు శాస్త్రవిజ్ఞానమును గడింపలేడు శాస్త్రపరిశోధనలకు ఆస్కారముండదు. హిరోషిమ నగరముపై అణుబాంబును ప్రయోగించినపుడు, భగవంతుడు అణుశక్తి సూత్రముల సడలించి దానిని పేలకుండ చేసెనేని అణుశక్తిని మానవ కళ్యాణమునకు వినియోగించుటకు దుర్లభముగా యుండెడిది.

అటులైన భగవంతుడు దుష్టులమాత్ర మేల శిక్షింప రాదని ప్రశ్నింతురు. తత్ సందర్భమున సహితము ప్రకృతి నియమముల సడలించి పై జెప్పిన నైతిక సూత్రమును భంగ పరచవలయునుకదా అట్టితరి లోకరక్షణోద్యమమునకు స్థానమేలేదు. దుష్టశిక్షణ మూలమున భగవత్ విశ్వాసమునకు ఆస్కారముండదు. వ్యక్తిగత స్వాతంత్ర్యచ్ఛ లంతరించును. అదృశ్యుడైన భగవంతుని ప్రేమభావముతో సేవింపక ఆయనను భయసందేహములతో పూజింపవలసి వచ్చును. ఇక సత్కార్యములకు నైతిక విలువలు చేకూరవు.

స్వాతంత్ర్యేచ్ఛలకు కొలది అననుకూలము ( is-a vantages) లున్నటుల, ప్రకృతి నియమములకు కూడ లేక పోలేదు. కొన్ని యెడల దోషరహితులకు డు వాటిల్లుట అసమంజసముగా గోచరించును. ఏలయన, భగవత్ భక్తిలేని ముష్కరులు జీవితము నొక లీలగా భావించి, తుచ్ఛవాంఛలకు నెడమిచ్చి వక్రమార్గముల పట్టుదురు. ఇక అల్పబుద్ధులు జీవితము నిరర్థకమనియు, నీతిన్యాయములకు స్థానము లేదనియు భావింపక మానరు. దోషరహితులు అకారణముగా తమకు వాటిల్లిన డులను భరింపలేక నిరాశానిస్పృహలకు గురియగుదురు. క్రీస్తు సహితము స్లీవనుండి తుదిగడియలలో "నా సర్వేశ్వరా! నా దేవుడా నన్నేల చేయి విడిచితివి" అని ఎలుగెత్తి పలికి నిరాశాపూరిత హృదయులకు అభయహస్త మిచ్చినాడు. దేవుడు తనబిడ్డల శక్తికి మించిన పరీక్షల నంపరు. వారా పరీక్షలందు నెగ్గునటుల సహకరించుచున్నాడు. అకారణముగా ఘోర బాధలకు గురియైన వారి దుస్థితిని, మనము అనుభవపూర్వకముగా తెలిసికొనిన మీదట, వారి యెడ మనము నిజమైన సానుభూతిని ప్రదర్శింపగలము. డు వలన మేలు చేకూరినను, అది ఎన్నటికి మేలు కానేరదు. కొన్ని యెడల అది అనేక అపాయములకు హేతుభూతమగును. "మమ్ము శోధనయందు ప్రవేశింప నియ్యక, డులోనుండి మమ్ము రక్షించు"డని చెప్పినటుల, క్రీస్తుస్వామి మన కాదేశించిరి.

## ౫ అ ధ్యా య ము

# కీడువలని ప్రయోజనములు :
# వ్యధల నిరోధము

కీడు (వస్తుతః) స్వతః మేలు కానేరదు. ఏలయన కీడునకు ప్రత్యేక అస్థిత్వము లేదని ముందు నుడివియున్నాము. కావున దానిని అభవము అనుచున్నాము. అయినను కీడువలని ప్రయోజనము లేక పోలేదు. భగవంతుడు కీడులను జరుగ నిచ్చి, తన్మూలమున మేలు చేకూర్చగలడు. విశేషించి ఆయన చెడుగు మూలమున విశ్వసృష్టికి ఆధ్యాత్మిక వికాసమును, సౌందర్యమును, శ్రేయమును సాధించగలడు. జడ పదార్థములందు నిగూఢమైన సంకుచిత శక్తి అణురూపమున మహత్తర కార్య సాధనకు వినియోగ పడుచున్నది. ఇది మనకు అనుభవసిద్ధము. ఉదాహరణముగా ఒక మహానదీ ప్రవాహమును నిరోధించి ఆనకట్ట మూలమున మహత్తరశక్తిని జనింపజేయగలము. ఇట్లే ఒక వృక్షము విస్తారఫలముల నీయవలయునంటే దాని రెమ్మలను అవశ్యముగా మట్టగించవలయును. ప్రేక్షకుల కిది యెంతయో వినాశభూతమని తోచును. వాస్తవముగా నిరర్థకములైన రెమ్మలు తొలిగించబడుచున్నవి. ద్రాక్ష లతలను భూస్వామి మట్టగించిన మీదటనే విస్తార ఫలముల నిచ్చును. బహుశః, దీని మూలమున ద్రాక్షకు ప్రయోజనము లేకపోయినను, భూస్వామి కది కడు లాభదాయకము కదా

ఇట్లే భగవంతుడు మానవుని సమున్నత దశకు కొని పోవుటకు, డు నొక సాధనముగా వినియోగించుచున్నాడు. ఈ భావార్థములో మనము చెడుగు వలన, వ్యథల మూలమున, చివరకు పాపదోషముల ద్వారా సహితము ప్రయోజనముల పొందగలము. ఇంతియేగాక డఃమూలమున చెడుగుల కంటెను అధికమైన మేలులు మనకు సంక్రమించునని చెప్పక తప్పదు.

డుల వలని మొదటి ప్రయోజన మేమనగా విశేష బాధలకు గురికాకుండునట్లు భగవంతుడు మనలను వారించుట కవి సహాయ పడుచున్నవి. దైహిక బాధలు అందు నిమిత్తము ఉద్దేశించబడినవి. శరీరావయవములలో నొకటి గాయపడినపుడు అది బాధారూపమున ప్రత్యక్షమగుచున్నది. ఇట్టి దైహిక బాధను డనజాలము. అవి కేవలము, అపాయమునకు లాంఛన ప్రాయములు జీవితావసరము లన్నియు ఆనంద దాయకములైన, జీవితాశయములను గూర్చి విస్మరించుదుము. కావున వ్యథలతో పనిలేదని చెప్పజాలము. సుఖము లోక దాని నొకటి మరపింపజేయును. గ్రంథ పఠనా నిమగ్నుడైన వ్యక్తి విందారగించుట విస్మరించును. భోగలోలసులను మేలు కొల్పుటకు వ్యథలు చక్కని సాధనములు. బాధోపశాంతి చేకూరువరకవి సమసిపోవు. వానిని మనస్కరించకుండుట భావ్యముకాదు. బాధారహితమగు వ్యథలు నిరర్థకములు. మనలను వారింప శక్తిలేని బాధలు నిష్ప్రయోజనములు; చేటుకరములు కూడా. ఇట్లే రోగ చికిత్సకు ప్రతిబం

ధకముల కలిగించెడి వేదనలు నిరుపయోగములు. మత్తుపదార్థములు లేని దినములలో శస్త్రచికిత్స చేయుట కడు దుష్కరముగా నుండెడిది. వైద్యశాస్త్రము పురోగతి చెందిన యీ దినములలో బాధలను నివారించుటకు పెక్కు సాధనములున్నవి. సాధారణముగా బాధలవలన కలిగెడి హాని కంటెను శ్రేయమే గొప్పదని చెప్పక తప్పదు.

పై నుదహరించిన అంశములు జంతుజాలములకు సహితము ఇంచుమించు వర్తించును ప్రాణులు బుద్ధిగత జీవులవలె బాధలను అనుభూతి చేయలేవు. మానవులలో సహితము ఇట్టి తరతమభేదము లున్నవి స్వేచ్ఛాజీవులు వ్యధలనుగూర్చి సహేతుకములైన విమర్శలు చేయగలరు. తన్మూలమున పెక్కు ప్రశ్న లుత్పన్నమగును. బాధకు గురియైన అవయవమేది ? ఈ బాధ విషమించునా లేక గుణమించునా ? ఇవి తాత్కాలికములా లేక దీర్ఘకాలికములా ? ఈ రుగ్మతకు హేతువేమి ? పనిచేయలేని పక్షమున బ్రతు కేమికావలెను ? ఇత్యాది భయసందేహములు దారుణ బాధలకు హేతుభూతము లగును.

మరి, జంతుజాలములకు ఇటువంటి విమర్శనాశక్తి లేదు. కావున అవి మనోవేదన, చిత్తసంక్షోభము లేకయే బాధలననుభవించును. అయినను ముందురాగల అపాయములగూర్చి జాగరూకత వహింపగలవు. మానవులు వానితో క్రూరముగా వర్తించినపుడు అవి మరింత బాధచెందుట తటస్థించును. తత్ సందర్భమున నైతిక దువలని దుష్ఫలితములకు సృష్టిజాతములు సహితము గురియగుచున్నవని స్పష్టమగుచున్నది.

మనస్సాక్షికి బాధ కలిగించెడి డు వేరొకటి కలదు. ఈ మనోవేదన తాత్కాలికమైనది. ఇటువంటి బాధలను లక్ష్య పెట్టని మనస్సాక్షి కరుడుకట్టిపోవును. పాపమునకు వడి కట్టినమీదట కలిగెడు గర్వాంధము లజ్జావిశేషములకు సంబంధించిన ఆవేదన వేరొకటి కలదు. దీనినే మృత్యుకారణమైన "యిహలౌకిక పశ్చాత్తాప"మని పవిత్ర పౌలుడు నుడివినాడు. ఇది నిరాశాజనకము; కైనుని క్లేశమువంటిది. "పారలౌకిక పశ్చాత్తాప"మని మరియొకటి కలదు. ఇది భగవద్దత్తమైనది. దీని మూలమున హృదయపరివర్తనము, ఆత్మశాంతి లభించును. ఒకప్పుడు పూర్ణపశ్చాత్తాపము భగవదనుగ్రహము వలన అంతరాత్మలో నుత్పన్నమగుచున్నది. వేరొకప్పుడు బాహ్యకారణములవలన జనించుచున్నది. ఉదాహరణముగా: దుస్సంఘటనలు, దైవదండనలు, భగవత్ప్రతినిధుల హెచ్చరికలు మొదలగునవి.

పరీక్ష లన్నియు శిక్షాదండనలని భావించుట తగదు. పుట్టు గ్రుడ్డివాడు దృష్టిపొందిన అద్భుత సంఘటనను, శుభవార్తలందు చదువగలము. తత్సందర్భమున క్రీస్తు నుడివిన పలుకులు కడు గమనార్హములు. వానికి జాత్యంధత్వము ప్రాప్తించుటకు అతడు చేసిన దుష్కృతములుకాని అతని జననీజనకు లాచరించిన పాపదోషములుకాని కారణములని చెప్పబడలేదు. ఇట్లే భగవంతుని అసంతుష్టివలన కలిగెడు శిక్షాదండనలు లేకపోలేదు. న్యాయకర్తల కాలమును జూడ జనములు నిజదేవుని మరచి విగ్రహారాధనకు పాల్పడినపుడు భగవంతుడు వారిని

కడు నిడుముల పాలుచేసెను. పదునారవశతాబ్దమున జరిగిన మతసంస్కరణలకు కారణములు లేకపోలేదు తత్ఫలితముగా కలిగిన విషాద సంఘటనలకు ఈర్ష్యాసూయలకు, భయంకర రక్తపాతమునకు, అశాంతి అలజడికి మతాధిపతుల నిర్లక్ష్య భావము పాపదోషములు కారణములని చెప్పక తప్పదు. ఇది యంతయు దైవనిర్ణయము. ట్లు దివ్యసభ భగవత్ శిక్షా దండనలకు గురియైనది.

ఇదే విషయము వ్యక్తులనుగూర్చి యిదమిద్ధముగా చెప్పజాలము. పరీక్షలు వేరు, శిక్షలు వేరు. కొన్నియెడల వ్యథాభరితులే యీ విషయములగూర్చి నిర్దిష్టముగా నిర్ణయింప గలరు. అశాశ్వితములగు శరీరముల శిక్షించి శాశ్వితములగు ఆత్మలను రక్షించినందులకు వారు భగవంతునికి కృతజ్ఞులై చరించుదురు.

ఇక పారలౌకిక శిక్షలుసహితము మనలను వారించుటకు నుద్దేశించబడినవి. భౌతిక వస్తువులను దుర్వినియోగ పరచినందుకు నరకాగ్ని ప్రాకార చర్యగా గైకొనబడినది. జీవితాశయముల విస్మరించి వక్రమార్గముల బట్టినవారిని వారించుటకై నరకకూపము సృష్టించబడినది నిత్యనరకాగ్ని బాధలనుగూర్చి తలపోసి, యనేకులు పాపమును వీడి, పరమపథము నధిష్టించినారు.

ఇక్లే ఉత్తరించు స్థలమందు మానవాత్మలు పొందు శిక్షాదండనలు అనేకులు పూర్ణపశ్చాత్తప్తులై ఉగ్రతప

మాచరించుటకు హేతుభూతములైనవి. మరి యనేకుల ది భక్తిమార్గ ప్రదర్శకమైనది.

కడన దుఃఖభూయిష్ఠమైన యీ యనంత విశ్వమును పరికించితిమేని యేతత్ ఘోరయాతనలు, విషాదసంఘటన లన్నియు పాపదోషఫలితములని తెలియక మానవు. సృష్టి జాతముల నాదిగా భగవంతునిపై దాడిచేసినను భగవత్ ప్రేమ మును పూర్తిగా భగ్నము చేయజాలవు. కాని, దాని కళా కాంతులను మఱుగుపరచి వికృతరూపము నాపాదించగలవు. పాపభూయిష్ఠమైనటువంటియు, ఘోరయాతనలకు గురియై నటువంటి యీ విశ్వసృష్టిని సర్వజ్ఞుడగు భగవంతుడే వినూత్న పరచి సమస్త కళలను హరించగలడు; ఆ తొల్లింటి సౌందర్య లావణ్యముల చేకూర్చగలడు.

# ౫ అధ్యాయము

## కీడువలని ప్రయోజనములు :
## పాపదోష పరిహారము

పాపదోష ఫలమగు డు మూలమున, మానవ పాపమును విమోచింప దలచిన భగవంతుని విజ్ఞాన సద్భావములెంతని వచింపగలము జగద్రక్షణ యొక వేదరహస్యమని లోగడ చెప్పితిమి. మానవుడు బాల్యావస్థనుండియు తా జేసిన దుష్కృతములను బాధల మూలమున పరిహరించుటకు, తెలియని రీతిని యత్నించును. తదుద్దేశముతో పూర్వులు ప్రాయశ్చిత్త బలులను సమర్పించిరి. ఇంతమాత్రాన భగవంతుడు పాపమునకు ప్రాయశ్చిత్తమును అవశ్యముగా కోరుచున్నాడని చెప్పుట భావ్యముకాదు. ఆయన సర్వసంపూర్ణుడు. ఆయనకు కొదువేమియు లేదు. సృష్టిజాతముల తిరుగుబాటు భగవంతుని అనంత ప్రశాంతతను విచ్ఛిన్నము చేయలేదు. పాపకర్ముడు స్వేచ్ఛా పూర్వకముగా ప్రాయశ్చిత్తము చేయుటకు పూనుకొనుచున్నాడు తా జేసిన దుష్కృతములకు తానే పశ్చాత్తప్తుడై భగవంతుని క్షమాభిక్షమును పొందుచున్నాడు. ఇట్లు తా భగ్నపరచిన విశ్వక్రమమును చక్క జేయుచున్నాడు. కొన్ని యెడల పాపాత్ముడు పూర్ణ ప్రాయశ్చిత్తమును చెల్లింపజాలక ఇతరుల సహకార సాహాయ్యములను అర్థించుటయు కలదు. ఇట్లె తానితరులతో సహకరించక మానడు. శిక్షాపూర్వకములగు సహకార సాహాయ్యములు మానవజాతి సమైక్యతను, భ్రాతృత్వమును చాటుచున్నవి.

అనుద్దేశ పూర్వకమైన బాధలు పాపపరిహారమును చేయజాలవని గుర్తించుట ఎంతయు అవశ్యము. ప్రేమపూర్వకమైన బాధలు, అంగీకార యోగ్యమైన వ్యథలు, భక్తిప్రద మైన యాతనలు మాత్రము పాపదోషములను పరిహరించ గలవు.

"ఓ పాప కర్ములారా వివేకులై వర్తింపుడు. బాధలను అధికమధికముగా సహించుట మాత్రము చాలదు. ఇహలౌకిక యాతనల ననుభవించువారికి, పారలౌకిక సుఖసౌఖ్యములు చేకూరుననుట తథ్యమేకాని కర్కశ హృదయుల సూత్రము సర్వదా వర్తించదు. స్లీవారోహణము చేసెడివా రనేకులు స్లీవపై నసువుల బాసిన జగద్రక్షకునికి సుమారముగ నున్నారు. స్లీవారోహణము కొందరకి రక్షణ, మరికొందరికి శిక్షణ. క్రీస్తు స్వామి కిరుప్రక్కల కొరతవేయబడిన తస్కరద్వయములో నొకనికి భగవదనుగ్రహము, వేరొకనికి దారుణ శిక్షలు సంక్రమించినవి. స్లీవ యొకనికి రక్షణప్రదము, వేరొకనికి చేటు కరము. స్లీవ ద్వారా ఒకని సహనము స్వర్గసీమ నందుకొనినది, వేరొకని దుస్సహనము నరకకూపమున దిగినది" అని సుప్రసిద్ధ ప్రసంగి బొస్సువె మహాశయులు నుడివినారు.

ఇక దైవసుతుని ఆవేదనల విషయమై జరిగిన యపూర్వ విధానమిది. హింసలను భరింపశక్తి గల మానవ స్వభావమును దరించి ఘోరయాతనలకు గురికాగలిగెను. ఏ పాపదోష మెఱుగని ఆ పరమపావనమూర్తి లేశమాత్రమైన శిక్షకుపాత్రులు కారు. జన్మకళంక మతనిని స్పృశించను లేదు. అయినను మానవ

జాతికి తలమానికమైన ఆదిపితస్థానము నలంకరించి శాపగ్రస్త
మైన మానవాళిని సముద్ధరించ పూనినాడు. పరమపితయెడల
సోదర మానవుల యెడలను, తనకు గల గాఢానురాగమును
ప్రదర్శించుటకు నరావతారమెత్తి, తీవ్రయాతనలకు గురియై
మృత్యుపథమును అనుగమించినాడు.

తత్ సందర్భమున ఆయన పొందిన నిందావమాన
ములు, దుఃఖానుభూతులు, ప్రదర్శించిన సహనశీలత క్షమా
గుణములు నిరుపమానములు. భగవత్ సుతుడైనందున
ఆయన కార్యకలాపము లన్నియు అమూల్యములు, అనంత
ములు కావున లేశమాత్రమైన శ్రమతో జగత్తును రక్షింపగల
శక్తి ఆయనకు సంక్రమించినది. అత్యల్పములైన అవమాన
ములు సహితము, మానవ జాతిపిత ఆదము ప్రదర్శించిన
గర్వమునడంచి భగ్నమైన సృష్టి క్రమమును చక్కబరచ
గలవు.

వాస్తవముగా ఆయన అల్పములైన శ్రమలతో తృప్తి
పడక నీచమరణమునకు లాంఛనమైన స్లీవయాతనలను ఆలింగ
నము చేసినాడు; క్రీస్తు సహించిన దైహిక బాధలను అంతగా
నూత్ననిబంధన వివరించదు. కాని ఆయన పొందిన అమా
నుషకరమైన నీచాతి నీచమైన మరణమును విపులముగా మన
దృష్టికి కొనివచ్చుచున్నది. గ్రీకులు, రోమనులు మహాపరా
ధము చేసిన కిరాతుల క్షను విధించెడివారు. సభ్యతగలవా
రెవరు దీనినిగూర్చి లేశమాత్రమైనను ప్రస్తావించరు. రోమను
రాజప్రతినిధియగు వెర్రెస్, గావియుస్ అను నాతనికి స్లీవ

శిక్షను విధించినప్పు డాతడు, "నేను రోమను పౌరుడను" అని దిగంతములు మారు మ్రోగునట్లు ఆక్రందన చేసినాడు. ఈ వృత్తాంతమును స్మరించితిమేని భీతికలుగక మానదు. ఇక జూదల కిది 'పట్టణాంతర సీమ'కు చెందిన దుస్సంఘటన. ఈ నికృష్ట మరణమునకు గురియైనవాడు శాపగ్రస్తుడని జూదుల భావము. "ఉరికంబము నెక్కెడు వ్యక్తిపై దేవుని శాపము దిగివచ్చు"నని పూర్వవేదము చాటుచున్నది.

సువిశేషకారులు స్లీవయాతనలకు విశేష ప్రాముఖ్యత నియ్యకపోయినను మనకది చిరస్మరణీయము. స్లీవవేదనలు క్రూరాతి క్రూరమైన హింసలని చెప్పక తప్పదు.

"క్రీస్తు స్లీవపై ఆక్రందన చేయలేదు; కాని ఆయన ముకుళిత ముఖారవిందము వికృత రూపము దాల్చినది ...... ఆయన బొట్టన వ్రేలు విపరీతముగా కంపించినది. మధ్యనాళము దెబ్బతిన్నది ...... విద్యుద్ఘాతమువలె వర్ణింపరాని బాధ ఆయన చేతి వ్రేళ్ళకు ప్రసరించినది. విస్ఫులింగమువలె భుజ స్కంధముల కెగబ్రాకి కంఠస్థలమును సంధించినది. మానవు డెవ్వడు సహింపరాని తీవ్రబాధ ......... నాడీమండలమును తాకిన మహాదారుణఘాత ఫలితమది ......"

"నాలుక దప్పికతో పిడుచగట్టుక పోయినది. ఆయన రూపురేఖలు దీర్ఘాకృతిచెందినవి. జీవకళలు మరుగైపోవు చున్నవి. వికృతవదనము రక్తసిక్తమై కరుడుకట్టినది. నోరు తెర చుకపోవుచున్నది. క్రిందిపెదవి జారిపోచున్నది. చదునైపోయిన నాసికారంధ్రములనుండి స్రవించు రక్తబిందువులు, నోట

పెదలు లాలాజలము, చిబుకమున కలియుచున్నవి. నోరెండి పోవుచున్నది. గొంతుక మండుచున్నది. ఏమియు మింగుడు బడుటలేదు. దాహముతో తల్లడిల్లు చున్నాడు."

"... ... చేతుల కండరములు ఎక్కడికక్కడ బిరబిగుసుకొని పోవుచున్నవి. ఎళ్ళన్నియు సడలిపోవుచున్నవి. వేళ్లు కొంకరులుపోవుచున్నవి. ఎంతగా కృంగికృశించినా డాయన... ... ... అవిగో వంకరలు తిరిగిపోవుచున్నవా కాళ్ళు మెలికలు తిరుగుచున్నావా జానువులు, ముడుచుకపోవుచున్నవా బొట్టన వేళ్ళు ... ... దీనినే మనము గుఱ్ఱపువాతమందుము, ఇక శరీరమంతయు మ్రానైపోయినది. ... ..."

పై నుదహరించిన విషయములు అభూతకల్పనలు కావు. సుప్రసిద్ధ వైద్యశాస్త్రవేత్త పీటర్ బార్‌బెట్ చేసిన పరిశోధనల మూలమున తెలియవచ్చిన అమూల్య వృత్తాంత మిది. తత్ సందర్భమున ఆయన నుడివిన పలుకులు కడు గమనార్హములు. "క్రీస్తు మార్గము ననుగమించుటకు నొకడు మహాభక్తుడైనను కావలయును లేక పరమమూర్ఖుడై యుండవలెనని నా నిశ్చితాభిప్రాయము. నేను మాత్రము ఆ భక్తికృత్యమును సక్రమముగా చేయలేకున్నాను."

క్రీస్తు అనుభవించిన యిటువంటి అమానుషమైన బాధలనుగూర్చి తలపోయునపుడు మనలో భయసందేహములు పొడసూపకమానవు. జగద్రక్షణకై యీ ఘోరబాధలతో నిమిత్తము లేకపోయినను క్రీస్తు వానికి తలయొగ్గుట కడు శోచనీయముగా కాన్పించును. శ్రమబాధలు లేవి లోక

రక్షణోద్యమముద్వారా భగవంతుని నీతిన్యాయములు, పాప దోషముల దారుణత్వము, ప్రాయశ్చిత్తపు విలువలు ప్రత్య క్షము కాజాలవు. ఇపుడు క్రైస్తవులు పాపదోషముల మాలి న్యమును, నీచత్వమును స్లీవమూలమున తెలిసికొనగలరు. భగవంతుడు న్యాయశీలుడు కావున దయాదాక్షిణ్యములు ప్రదర్శించియు ప్రాయశ్చిత్తమును కోరుచున్నారు.

మరియు క్రీస్తు సహించిన ఘోరయాతనలు పరమపిత యెడల, సోదరమానవులయెడను, తనకు గల గాఢానురాగ మును నిరూపించుచున్నది. ఆయన అత్యల్ప శ్రమలతో మనలను విముక్తిచేసియున్న పక్షమున భగవంతుడు మనకై సిద్ధపరచిన స్వర్గసామ్రాజ్య సుఖముల విలువను గ్రహించెడి వారము కాము. "భూతలముపై తా నెడబాయనున్న స్వ యుల నింకను ప్రేమించి, తన ప్రేమను సంపూర్తిగా బుజువు పరచ నిచ్ఛగించెను" జ్వా : 1 : . స్లీవ మన స్మరణకు గొనివచ్చెడి సందేశ మిదియే. లోతుగా నాలోచించితిమేని మనము పాపమాచరించి దైవప్రేమను తృణీకరించియున్నాము కాన వ్యథాభరితమగు పాపపరిహారము పతిప్రేమకు చిహ్న ముగ నున్నది. క్రీస్తు విషయమై చెప్పబడిన అంశములు కొలది మినహాయింపులతో సామాన్య క్రైస్తవునికి సహితము వర్తించును "మీ నిమిత్తము నే ననుభవించు బాధలను గూర్చి సంతోషించుచున్నాను. ఏలయన క్రీస్తు తన శరీర మగు దివ్యసభ నిమిత్తము తా చెల్లించిన యాతనలందు బుణపడియున్న వానిని, నేనీ భౌతిక దేహముద్వారా

సంపూర్తి చేయుచున్నాను." కొలో: :2. "తాచెల్లించిన యాతనలందు ఋణపడియున్నవి" ఏవి? తాచెల్లించిన అమూల్య ప్రాయశ్చిత్తమునకు సంబంధించినంతవరకు ఆయన విడచిపెట్టిన ఋణమేదియు లేదు. మన ప్రేమానురాగము లకు సంబంధించినంతవరకు మనమే పూర్తిగా ఋణపడి యున్నాము. బుద్ధివివరము తెలియనంతవరకు స్తు చేసిన ప్రాయశ్చిత్త ఫలములు మనకు లాభసాటి కాగలవు. ఆ మీదట మన మాయన శ్రమబాధలలోను, పరమపిత యెడల సోదరమానవుల యెడలను తా ప్రదర్శించిన ప్రేమానురాగము లందును, భాగస్వాములము కానిదే ఆయన సముపార్జించిన పాపపరిహార ఫలములందు పాలుపంచుకొనలేము. "ఎవడేని నా మార్గమున రాదలచిన, అతడు స్వాగమును పరిత్యజించి అనుదినము తన స్లీవను గైకొని నన్ననుగమింపవలెను." లూ: 9:23. మన ప్రభువు భరించిన పెనుభారపు స్లీవను మన మును ధరింపవలయును. తత్ సందర్భమున సిరేనియా సిమో నుడు మనకాదర్శప్రాయుడు. స్తు తన యాతనలతోసహా మన బాధలను పరమపిత కర్పించిన చందమున, మనమును మన వ్య లతోసహా ఆయన వవేదనలను పరమపిత కర్పించు నటుల శక్తి నొసంగెను.

"సమస్త మానవులకు తలమానికమైన స్తుస్వామి ని, ఆయన అనుచరులమైన మనకును మధ్య అవినాభావ సంబంధ బాంధవ్యములు కలవు. కావున సామాన్య వ్యాధిగ్రస్తుడు సహితము శయ్యపై పరుండి, స్తు స్లీవపై అనుభవించిన

ప్రయాతనలను వ్యక్తీకరించగలడు. పైబడి, అతడు తన శయ్యపై నిశ్చయముగా, నిర్దిష్టముగా క్రీస్తు శ్రమలను, ఘోర మరణమును, భక్తాగ్రేసరుల వేదనలను, అమరవీరుల మరణమును ప్రతిబింబింపచేయగలడు... అనామకుడైన ప్రతి రోగిష్టుడును క్రీస్తుస్వామి యాతనలను, ప్రార్థనలను, శ్రమ లను, ఏతత్ఫలములను వ్యక్తీకరించి, ఆయా వేదనలందు, ప్రార్థనలందు, బాధలందు, సత్ఫలములందు, సుగుణములం దును భాగస్వామి యగుచున్నాడు. ఇట్లే అనామకుడైన ప్రతి రోగిష్టుని వ్యాధి బాధలు, శ్రమలు, ప్రార్థనలు, సుగుణములు, పుణ్యఫలములు క్రీస్తుస్వామి ప్రయాతనలు, శ్రమలు, సుగు ణములు ఏతత్ఫలము లన్నియు ఒకే కోశమం దుంచబడును" అని ప్యూగి e uy మహాశయుడు చక్కగా నుడివినాడు.

సోదర మానవులతో మనకుగల అవినాభావ సంబంధ బాంధవ్యముల మూలమున, మనము అన్యుల పాపదోషము లకు సహితము పరోక్షముగా ( e Congruo) పరిహారము చేయగలము. అయితే క్రీస్తు మానవజాతికి తలమానికముగా నున్నందున ఆయనమాత్రమే పాపములకు ప్రత్యక్ష ప్రాయ శ్చిత్తమును ( e Con i no చెల్లించి దైవన్యాయమును నెగ్గించగలడు. అయినను భగ్నమొందిన సృష్టిక్రమము నుద్ధ రించుటకు మన బాధలు సహితము తోడ్పడగలవనుట నిక్క వము.

మనలో ప్రేమ కొరవడినపుడు, భగవదభీష్టము ప్రతి ఘటించబడినపుడు, సహనలత అంతరించినపుడును శిక్షా

పూర్వకముగా సృష్టి క్రమము నెలకొల్పబడెను. భగవంతుడు బాధ నొందడు. ఆయన సర్వమున కర్తుడు. పాపదోషములకు శిక్ష, పుణ్య క్రియలకు సంభావనల నొసంగుటద్వారా భగవంతుడు పరోక్షముగా మహిమపరచబడును. శిక్షాపూర్వకముగా కలుగు మహిమ బాధల ననుభవించుట మూలమున ద్విగుణీకృతమగుచున్నది. భగవంతుడు డును జరుగనిచ్చునే కాని దాని కనుమతించడు. "సమస్తమానవులు రక్షణనొంది సత్యమును పరిగ్రహించుట"యే దేవుని నిర్దిష్ట సంకల్పము.

తిమొ : 2.

# 2 వ అ ధ్యా య ము

## కీడువలని సత్ప్రయోజనములు :
## కీడు, సమగ్రతను ప్రసాదించు శక్తి

డునకు సంబంధించిన వేరొక అంశమును గూర్చి పరి శీలించుదము. హెబ్రేయులకు వ్రాయబడిన లేఖలో క్రీస్తు ఆ వేదనలమూలమున పరిపూర్ణత చెందెనని చెప్పబడినది. "దేవదూతల కంటెను కొలదిగ తక్కువ దశలో నవతరించిన జేసువను వ్యక్తి, తా ననుభవించిన మరణమువలన, గౌరవ మహిమలతో పట్టాభిషిక్తుడగుట మన మిపుడు గాంచనగును. భగవత్ సంకల్ప కరుణవలన ఆయన మృత్యువు కెఱయై అందరి పేరిట దానిని చవిచూచెను. భగవంతుడు సమస్త వస్తువులకు అంత్యగతియు, సర్వమునకు ప్రప్రథముడు. ఆయన సార్వభౌమ అధికారమున కనుగుణముగా, తన పుత్రులందరిని మహిమాన్వితులగుటకు చేరబిలిచి, వారలను సముద్ధరింప బూనిన ఆ రాకొమరుని జీవితమును వ్యథా కిరీటాలంకృత మొనర్చెను."

హెబ్రే : 2. 9– 0.

క్రీస్తు స్వతసిద్ధముగా సర్వసంపూర్ణుడు; కావున ఆయ నకు సమగ్రత నేల ఆపాదించగలము? ఆయన మానవ స్వభావ మందు భగవత్ పరిపూర్ణతను నిర్దిష్టముగాను నిరుపమానము గాను వ్యక్తీకరించబడినది. అనగా భగవంతుడు క్రీస్తునందు మూర్తీభవించినాడని భావము. ఇత్యాది మానవమాత్రుల

పరిమిత జ్ఞానమున కనుగుణముగా జరిగిన సంఘటన. ఆయన పరమ పవిత్రుడు. ఆయనలో గల దేవగుణ ప్రసాదము పరిపూర్ణమైనది. వ్యధల మూలమున మానవమాత్రులమైన మనము క్రైస్తవ సమగ్రతను సాధింపగలుగుట సహజము. ఈ దుర్భర బాధావిధానము క్రీస్తు నెవ్విధమున పరిపూర్ణుని చేయగలదో తెలియకున్నది. ఆయన సర్వసంపూర్ణుడు; ఆయనకు కొదువేమియు లేదు.

"ఘోర యాతనల వలన క్రీస్తు మానవవ్యధానుభవమును గడించి తన్మూలమున మానవజాతికి తలమానికముగాను ప్రధానాచార్యుడుగా నుండుటకు సంపూర్ణయోగ్యతలను సముపార్జించె"నని లైట్‌ఫుట్ వేదవేత్త సమాధానము చెప్పినాడు.

భగవత్ సుతుడు నరావతార మెత్తినపుడు ఆయన ధరించిన మానవత్వము దోషభూయిష్టము, శిక్షాభూతమును. ఇక, మానవజాతి దోషరహితమై వ్యధానుభూతి లేనిదై యున్నయెడ క్రీస్తు తీవ్రయాతనలను అనుభవింపవలసిన అగత్యమే లేదు. కాని దోషభూయిష్టము వ్యధాభరితమగు మానవజాతికి తలమానికముగా నుండి, యీ వికృత శరీరమును ధరించెను. "అపాదమస్తక క్షతగాత్రమది. అందెక్కడ ఆరోగ్య చిహ్నములు లేవు." ఇజయాస్ 1.6 లోకమున కవతరించినది మొదలు క్రీస్తు జీవితము ఆనందమయమై యున్నయెడల ఆయన మన యనుంగు సోదరుడు కాజాలడు. మనకు బాధోపశమనము చేకూర్చలేడు. "ఆయన స్వయముగా ఆవేదనా

పరీక్షకు గురియై శోధనలందు మనతో సహకరించుటకు శక్తి పొందెను.'' హే బ్రే : 2. 8. మానవజాతి పెనుభారపు వ్యథలను ఆయన తలదాల్చి వారియెడ సానుభూతిపరుడు కాగలిగెను. "ఆయన సహితము అవమానములచే నావరింపబడినందున తెలియని రీతిగా వారు చేసిన తప్పిదములను అనుభూతి చేయగలిగినాడు''. హే బ్రే. 5.2.

క్రీస్తు అనుభవించిన దారుణ వేదనలను గూర్చి తలపోసితిమేని, మన మాకులపాటు చెందక మానము. ఏలయన మన పాప దోషములే తద్దానికి హేతుభూతములు. "మన దుష్కృతముల నిమిత్త మాయన క్షతగాత్రు డాయెను'' . జయాస్ : 5 ,. ఘోర యాతనల మూలమున తా గడించనున్న క్రీస్తు ప్రతిష్ఠలు ఏతత్ బాధల మధురానుభూతికి కొంత తోడ్పడినవి. ఆయన జీవితమున కవి "మకుటాయమాన''మని పవిత్ర గ్రంథము చాటుచున్నది.

మరి యీ బాధల మూలముననే ఆయన అర్చకత్వము సంపూర్ణతను సాధించినది. "మానవ పాపదోషముల విమోచనార్థము నైవేద్యములను, బలులను సమర్పించుటకుగాను భగవంతుని కడ వారల పక్షమున ప్రతినిధిగా నుండుటకుగాను ప్రత్యేక ప్రధానాచార్యుడు సోదరమానవుల మధ్యనుండి ప్రత్యేకించబడుచున్నాడు.''

హే బ్రే : 5. .

మానవుల మధ్యనుండి యెన్నుకొనబడిన అర్చకులు సహితము పాపకర్ములు. వారలు సోదరమానవుల పాపదోష

ముల నిమిత్తము విమోచన బలులను అర్పించుటకు పూర్వము తమ స్వకృతములకొఱకు నైవేద్యములను పెట్టవలసియున్నది. ఇక ప్రస్తుత విషయము అటుల కాదు. ఆయన నే పాపదోష మెఱుగడు. కాని పాప ఫలితములగు శిక్షావమానముల భరించెను. ఆయన సంస్నపము పొందిననాడే పాపులతో పరి గణించబడెను. "మనకు కలిగిన నిందావమానములందు మన ప్రధానాచార్యుడు మనయెడ సానుభూతి చూపలేడని కాదు" హెబ్రే. 4. 5. ఆయన కడు సాత్వికుడు. సహృదయుడు. తనాశ్రయించినవారందరిని ఆదరించిన దయాళుడు. మానవు డెన్నడు కనివిని యెఱుగని మహాదారుణ యాతనల అనుభ వించుట మూలమున ఉత్తమ ఆచార్యుడై, భగవత్సన్నిధాన మున పరమ పవిత్రుడును, సోదర మానవులకడ మహా క్షమా న్వితుడును కాగలిగెను. ఘోరావేదనల వలన సమగ్రతను పొందినది ఆయన వ్యక్తిత్వముకాదు. ఆయన పావనత్వము కాదు. కాని సమస్తమానవాళికి తలమానికముగాను, ప్రధానా చార్యుడుగాను, తాను వహించిన పాత్ర మూలమున పరిపూర్ణ తను పొందినాడని గుర్తించవలెను.

ఎవరెవరి పవిత్ర జీవితాదర్శ తల కనుగుణముగా ఆయన అనుచరులు వ్యధలమూలమున సమగ్రతను సాధించుదురు. మొదట మరియమాత సూత్రము అక్షరములా వర్తించును. సర్వోన్నతుని మాతగా ఆమె వహించిన పాత్ర యెంత అపూ ర్వమో ఆమె నెఱపిన పవిత్ర జీవిత మంత అద్వితీయము. ఆమె యమలోద్భవియై భగవంతుని విశిష్టానుగ్రహములతో

పూరించబడి, పరమాత్మ శక్తివలన దేవసుతుని గన పాత్రురాలైనది. ఆమె భగవత్పుత్రునికి మాతయేగాక లోకోద్ధారకుడైన క్రీస్తు జననిగా వెలుగొందింది, దుర్భర దుఃఖమునకు గురియై వినూత్న పరిపూర్ణతను సముపార్జించినది. తన్మూలమున భగవంతుని ప్రేమానురాగముల జూరగొన్నది. ఇంతియే గాక మానవు లందరి నాకర్షించగల మహత్తర శక్తిని సాధించినది.

ఆమె ఏపాప మెఱుగని పరమపావని కావున ఆమె భరించవలసిన వ్యధలు సహితము మహాదారుణమైనవని చెప్పకతప్పదు. మును సిమియోనుడు గుడిలో నుడివిన భవిష్యద్వార్తలు నిరర్థకములు కాజాలవు. "నిశాతదుఃఖ కృపాణ మొకటి నీ హృదయమును ఛేదించును".

సుప్రసిద్ధ కవిపుంగవుడు, పాల్ క్లాడెల్ వ్యాకులమాతను గూర్చి విరచించిన వార్తలు చిరస్మరణీయములు. పెనుభారపు శ్లీవ కంబమును భుజస్కంధములపై నిడుకొని, జనసందోహముల నడుగిడు ఆ క్షతగాత్రుని దర్శింప నేతెంచెను మరియ మాత ముకుళిత వదనారవిందమును పరికింపుము "తన పేదరికపు కనపు కొడుకును గాంచ వీధిగుమ్మమున వేచియున్నది; కంటు తడిబెట్టినదిలేదు; పెదవి కదిపినదికాదు; తన చూడ్కులను స్వామివంక ప్రసరింపజేసి, దీర్ఘ నిశ్వాసములతో నిరీక్షించుచున్నది; జనని తన తనయుని యవలోకించుచున్నది; దివ్యసభ తన ముక్తిదాతను వీక్షించుచున్నది; చరమదశయందున్న యోధుని యాక్రందనవలె యామె హృదయము తన

పుత్రుని సంధింప నుద్వేగముతో నుజ్జూత లూగుచున్నది. దేవుని సమక్షమున నిటారుగా నిలిచి తన అంతరాత్మను ఆయన పఠించునటుల ఆవిష్కరించుచున్నది. ముందువెనుకా డని ఉదారహృదయ మది; ఆమె నివేదనమునకు కొదువలేదు; పొడచి తెరచిన ఆ యెడద అన్నిటిని ఆక ంపు చేసుకొన్నది; సమస్తమునకు సమ్మతించినది; తన యెదుట సాక్షాత్కరించిన భగవంతునివలె తానును ఆయన సమక్షమం దున్నది; తన గర్భమున ధరించిన యీ వర కొమరునితో సమ్మతిపడి, ఆయనకడ కాచుకొనియున్నది; ఆమె మారాడక ఆ పవి త్రాతి పవిత్రునికడ వేచియున్నది."

ఆమె దుఃఖభారమును స్వేచ్ఛాపూర్వకముఁగా రసా వహించినదని కవిపుంగవుడు నొక్కి వక్కాణించుట కడు ముదావహము. బాధలయెడ ఇచ్ఛాపూర్వకమగు ఇట్టి అంగీ కృతిని వెలిబుచ్చుటవలన సమ గతను సముపార్జించగలము. ఏలయన ప్రామాణికపు ప్రేమకు, వీరోచిత అనురాగమున ది లాంఛనము. ఒక్క ప్రేమమూలముననే (C arity) మాన వాత్మలు సమగ్రతను పొందగలవని యెన్నడు మఱువరాదు. భగవ ద ష్టమును నెఱవేర్చుటయే ఆమె జీవితాశయము కావున ఎప్పుడు తదనుగుణముగా నడచుకొనినది. "నీ మాట ప్రకారము నా కౌనుగాక" లూ: . 8. భగవత్ సుతుని మాతగను, జగద్రక్షకుని జననిగను ఆమె తన పా తను చక్కగా నిర్వహించినది. అందుచేత స్తు ఆమె నుద్దేశించి

పలికినవార్తలు కడు గమనార్హములు. "సర్వేశ్వరుని వాక్యము నాలకించి దాని నాచరించెడువారు ధన్యులు". లూ:    :28.

మరియు నూతన జీవితములోవలె మహాత్ముల విషయమున సహితము ఇది నిక్కువము. ఆదినుండియు దివ్యసభలో సత్యమతము నిమిత్తము ఆత్మబలిదానము చేసినటువంటి అమరజీవులు గౌరవించబడినారు. వారనుభవించిన బాధలు వారి విశుద్ధ ప్రేమకు చిహ్నములు. క్రీస్తు యాతనలలో భాగస్వాములైనందున, వారాయన అనుచరులుగా పరిగణించబడిరి. "ఎవడేని నా సేవకుడు కాదలచినచో, వాడు నా మార్గమున అనువర్తింపవలెను. అప్పుడు నే నెక్కడుందునో అక్కడ నా సేవకుడు సహితము నుండగలడు. జా: 2:26.

భక్తాగ్రేసరు లనేకులు సందర్భానుసారముగా నాత్మబలిదానముచేయ నవకాశములేక, వీరోచితముగా క్రైస్తవ జీవితమును నెఱపినారు. వీరలు సహితము దివ్యసభస్తుతి గీతములకు పాత్రులైరి. మార్టిన్ భక్తుడు మతద్వేషుల ఖడ్గమున కెఱగాకయే, అమరజీవి కిరీటము పొందినాడని చెప్పబడినది. ఇట్లు బహుసంఖ్యాకు లిదియే దీక్షవహించి, అరణ్యముల కేతెంచి, బ్రహ్మచర్యమునుబూని, యుగతప మాచరించి ధ్యాననిష్ఠాగరిష్ఠులై విషయానురాగములవీడి, శత్రుతయముతో పోరుసలిపి, క్రీస్తు నిమిత్తము ఘోరయాతనల ననుభవించి అమరజీవులుగా చరితార్థులైరి.

ఇక, పాపకర్ములేకాక పుణ్యశీలురు సహితము దుర్భర వ్యధలకు గురియై తన్మూలమున సమగ్రతను సాధించలేక

పోలేదు. పేరెన్నికగన్న వీరవనిత జాన్ ఆఫ్ ఆర్క్ విషాద
గాథ యిందుకు చక్కని తార్కాణము.

భగవదభీష్టానుసారముగా ఇరువదేండ్ల యబల సైన్య
ముల సేకరించి, అశ్వారోహిణియై, కదనభూమిలో సంకుల
సమరము సాగించి,ఆంగ్లేయ నియంతల నోడించి, తన మాతృ
భూమికి దాస్యవిముక్తి చేకూర్చి, ఫ్రాన్సు దేశపు అనామక
రాకొమరునికి పట్టముగట్టిన యీ అపూర్వగాథ యావత్ప్రపం
చము నట్టూత లూగించక మానదు. అంతటితో నామె తాను
వహించిన వీరోచితపాత్రను విరమించి జపతపముల నాచరించి
స్వార్థమునువీడి, మానవసేవాధురంధరయై, భక్త్యానురక్తుల
జీవితమును చాలించినయెడ ఆమె యొక మహాపవిత్రురాలని
ప్రజలు పొగడి తెగడెడివారు. కాని తా నిప్పు డార్జించిన ప్రతి
ష్ఠలు, ఆమెకు చేకూరెడివికావు. అయితే ఆమె తన జీవి
తము నట్లు ప్రశాంతముగా చాలించినదికాదు. యుద్ధభూమిలో
విజయభేరిని మ్రోగించినమీదట తాను పట్టాభిషిక్తునిగా
జేసిన రాకొమరుడు తాను కలలుగన్న రారాజు తన్ను
శత్రువులకు వప్పజెప్పి స్వామిద్రోహి కాగా, వారామెను
మంత్రగత్తెయని, పతిత వనితయని, పశ్చాత్తాపములేని పాపి
యని నేరారోపణచేసి ఖండించి, చెరయందుంచి సమస్త
నిందావమానములకు గురిచేసి, చివరకు ఆమెకు మరణదండన
విధించి, చితిపై దహనబలి గావించిన విషాదగాథ జగద్విది
తము. ఇటులా బాలామణి దుర్భరవ్యథలు, చిత్రవధల మూల
మున సమగ్రతను సాధించి అమరజీవియై జగద్విఖ్యాతి గడిం
చుట భగవత్సంకల్పమని వ్యక్తమగుచున్నది.

ఈ సందర్భమున భక్తాగ్రేసరుల జీవితములనుండి యశేష సాదృశముల నెత్తి చూపించవచ్చును. వీరిలో నొక్కరును బాధలకు దూరమై ఘనతకెక్కినవారు కారు. ఇక, క్రైస్తవ రాజయోగులే కాదు, జనసామాన్యములు సహితము క్రైస్తవ వాతావరణములో పుట్టి పెరిగినవా రెల్లరు జీవితమందు బాధలను, నిందావమానములను, అపార్థముల నెదుర్కొని తీరవలెను. ఒక్కమాటలో, మన జీవిత మొక రని పోరని చెప్పిన అత్యుక్తి కానేరదు.

ఇంకను లోతుగా నాలోచించినయెడ వ్యథలమూలమున సామాన్య క్రైస్తవుల జీవిత మెటుల పరిపక్వము చెందునో తెలిసికొనగలము. మొదట బాధలవలన మనకుగల ఆధ్యాత్మిక అభిరుచులు సునిశితము లగును. ఆత్మవికాసము చేకూరును. మన దృక్పథము పవిత్రమగును. అగ్నిపరీక్షలకు గురికానివారు పై సుగుణములకు నోచుకోలేరు. కొందరు భక్తులు భయసందేహములకు సందిగ్ధావస్థల లోనగుచున్నారు. ఇవి లేకున్నయెడ, వారల భక్తి మందకొడిగా నుండెడిది. మరికొందరు భగవదభీష్టానుసారముగా భక్తిమార్గమున సమున్నతస్థాయినందుకొని ఘోరయాతనలకు గురియగుచున్నారు. ఇక రాజయోగులు ఆధ్యాత్మికముగా మరణించిన మీదటనే జీవన్ముక్తు లగుచున్నారు. తన్మూలమున జనించు వికాసాభ్యుదయములకు సంతోషానందములకు ప్రతిగా వారు చెల్లించు ఋణమిది. సచ్చిదానందమూర్తియగు భగవంతుని యపూర్వ పవిత్రతను గాంచి, వారు తమ్ము తామంత

మొనర్చుకొనుచున్నారు. ఇట్లు వారాయన ప్రేమను పూర్తిగా స్వాంతమగుచున్నారు.

ఇక వ్యథలమూలమున సోదరమానవులయెడ మనకు గల ప్రేమానురాగములు పెంపొందగలవు. స్వార్థపరత్వ మంతరించిపోగలదు. సోదరమానవుల బాధలను అనుభవ పూర్వకముగా అవగాహనము చేసికొనుట అత్యావశ్యము. లేకున్న వారియెడ నిజమైన సానుభూతిని ప్రదర్శింపలేము. ఆరోగ్యవంతుడు వ్యాధిగ్రస్తుని దుర్భరదుస్థితిని, నిస్సహాయ తను, అవమానమును ఆకళింపుచేసికోలేడు. ఇట్లే పరీక్షలకు గురికానివాడు సోదరమానవుల దురవస్థను, చిత్తచాపల్య మును, అశాంతిని యనుభూతి చేయలేడు. నిరాశానిస్పృహ లకు వశము కానివారు, వ్యథలతో కృంగి కృశించి కుమిలి పోయెడివారి నైరాశ్యమును, నికృష్టస్థితిని, ప్రేమవియోగ ములను లేశమాత్రము గ్రహింపజాలరు.

బాధలద్వారా భగవత్ భక్త్యానురక్తులు అద్భుత ముగా నభివృద్ధి చెందగలవు. మనయెడల భగవంతునికి గల గాఢానురాగమును ఆకళింపు చేసికొనుటకు వేదనలు దివ్య మైన సాధనలు. క్రీస్తు శ్రమలకు సరిపోలు యమయాతనలకు వివశుడైన తప్ప ఎవడును ఆయన దుర్భరబాధలను అనుభూతి చేయలేడని, థామస్ అకెంపిస్ ఋషిపుంగవుడు నుడువు చున్నాడు. క్రీస్తు భరించిన బాధలందు భాగస్వామి కాగల్గిన వాడు ఆయన సాధించిన మహిమాన్విత విజయమందును పాలివాడు కాగలడన్న నెఱనమ్మికను, యాతనలు మన

యందు జనింపజేయుచున్నవి. ఆవేదనలందును ఆధ్యాత్మిక అంధకారమందును, దేవుడు మనలను విడనాడినట్లు తోచినప్పుడెల్లను, యిక సర్వావస్థలందును, బాధలమూలమున మనము భగవంతునియెడ ప్రామాణికులముగా నుండగలము. ఇట్లు శ్రమలు అశేషపుణ్యసముపార్జనకు తోడ్పడుచున్నవి. వ్యధలు, మానసిక, దైహిక శక్తులకు సహితము మెరుగులు దిద్ది, వానికి సంపూర్ణతను చేకూర్చును. ఇట్లవి సునిశితములై సమున్నత స్థాయికి రాగలవు. మానవులకు గంభీరతను సాహసమును, యిత్యాది వీరోచిత లక్షణముల ప్రసాదించెడి ఏదో దివ్యశక్తి బాధలలో గూఢమైయున్నది. ఒక్కమారవి మనలను స్పృశించిన చాలును. వానిలో గల క్రియాశక్తి వెల్లివిరియగలదు. తద్వారా బాల్యావస్థలో కౌమార లక్షణములు, కౌమారమందు వయోవస్థ గుణములు, వయోవస్థలో పురుషలక్షణములు, పురుషదశలో వీరోచితగుణములు, వీరదశలో భక్త్యానురక్తులు చేకూరునని యొక మహాశయుడు నుడివినాడు.

ఇక పారలౌకిక క్రమమందు (Su ernatura పరీక్షలు నిందావమాన హింసలమూలమున మానవాత్మలు సముచిత పరిపూర్ణతనొంది, క్రీస్తునాథుని యద్భుత శరీరమగు దివ్యసభయందు తమకై ప్రత్యేకించబడిన స్థానముల నలంకరించును. శ్లీవయే దివ్యజీవితమునకు లకము.

థామస్ అకెంపిస్ మునిమాన్యుడు విరచించిన సుప్రసిద్ధ గ్రంథమందు "శ్లీవపథమే రాజమార్గ" మనునది యొక

యపూర్వ్యఘట్టము. "శమబాధలు గతించినను తదనుభావానుభూతు లెన్నటికి సమసిపో"వను వార్తలు స్మరణకు రాక మానవు. అందువలన తీవ్రయాతనల యనుభూతి పవిత్రీకరణ శక్తిగా పరిణమించుననుట కడు సమంజసము.

"క్రీస్తు నాథుని గౌరవ ప్రతిష్ఠలందు భాగస్వాముల మగుటకంటెను ఆయన భరించిన దుర్భర వ్యథలందు పాలివారల మగుట కడుంగడు శ్రేయస్కర"మని జేసు సమాజ నిర్మాత ఇగ్నేష్యస్ ఋషిపుంగవుడు నుడివిన వార్తలు చిర స్మరణీయములు.

# ౫ అ ధ్యా య ము

## వి శ్వ కీ డు (Cosmic Evil)

భూగోళమును గూర్చి ప్రాచీనుల అభిప్రాయములు వేరు, ఆధునికుల భావములు వేరు. తన్మూలమున డునుగూర్చి పెక్కు సమస్యలుత్పన్న మగుచున్నవి. శాస్త్రపరిజ్ఞానములేని పూర్వీకులు జగత్తు పరిణామమును గూర్చి సంకుచిత భావముల ప్రదర్శించిరి. ఈ భూగోళమె విశ్వమంతటికి కేంద్ర స్థానమని భావించిరి. భూతలమున కింతటి ప్రాధాన్యతను ఇచ్చినవాడు మానవుడు, కావున సమస్త డులకు మానవ పాపదోషములే హేతుభూతములని తలపోయుటయు కడు సులువు.

గత శతాబ్దమునుండి శాస్త్ర పరిశోధనల మూలమున విశ్వపరిణామమును గూర్చి పెక్కు సత్యములు తెలియవచ్చినవి. భూమి ఉపగ్రహములందు నొకటిగా పరిగణించబడుచున్నది. గతమందు దానికి గల ప్రాముఖ్యత గతించి పోయినది. అయినను సృష్టి స్వరూపమును గూర్చి మానవుని విజ్ఞాన పరిధులు పెరిగెడు కొలది భగవంతుని అనంతశక్తి సామర్థ్యములు, అఖండ విజ్ఞాన వివేకములు ద్యోతకమగుచున్నవి. తత్ఫలితముగా డును గూర్చి మనకుగల అభిప్రాయములు పరిణామము చెందుచున్నవి. తాను చేసిన సృష్టిని గాంచి భగవంతుడు "సర్వము శుభకరమై యొప్పుచున్న"దని నుడివిన వార్తలు ఈ నాటి పరమసత్యములే. విశ్వమంతయు భగవత్

సృష్టియనియు, ఆయన సర్వమేలుల స్వరూపియనియు, కావున దునకు ఆయన హేతుభూతము కాజాలడని క్రైస్తవమతము నొక్కి వక్కాణించుచున్నది. అందువలన మానవ పాప కృత్యములే చెడుగునకు మూలమని పూర్వ వేదము చాటు చున్నది.

జీవశాస్త్ర పరిశోధనల మూలమున సృష్టిరహస్యము లనేకములు తెలియవచ్చినవి. విశేషించి మానవశరీరమందలి జీవకణములు స్వతసిద్ధముగ పెంపొందు శక్తి గలిగియు మృత్యువున కేల యెరయగుచున్నవో శాస్త్రవేత్తలకు దురూహ్యముగ నున్నది. ఇట్లే విశ్వమంతయు అనేకవిషయములందు వక్రమార్గముల పట్టినటుల తోచును. క్రైస్తవులు, మానవ జాతి పతనమే యీ విశ్వసంక్షోభమునకు కారణమని నమ్ముచున్నారు. ఆది నుండియు సృష్ట్యంతయు శాప గ్రస్థమైనటుల తోచక మానదు. దీనికి మించిన పరిష్కార మార్గము వేరొకటి కాన్పించదు.

జ్యోతిర్మండలములు పంచత్వ మొందవని పూర్వులు భావించిరి. జ్యోతిశ్శాస్త్ర పరిశోధనల మూలమున విశ్వమంతయు భ్రష్టమగునని తెలియుచున్నది. కాబట్టి కేవలము భూతలమందే పాపమావిర్భవించెనని చెప్పజాలము.

మానవ సృష్టికి పూర్వమే విశ్వమందు పాపదోష ముత్పన్నమై మానవ పతనమునకు మార్గప్రదర్శకమైనటుల తోచును. ఆదికాండమందు ఉదహరించబడిన అపూర్వకాల సర్ప విషయము ఆలోచించితిమేని పై జెప్పినది బోధపడ

గలదు. దాని పుట్టు పూర్వోత్తరముల గూర్చి మనకేమియు తెలియవు. అది మొదటి నుండియు భగవంతునికి వ్యతిరేకియై, ఆయనను ధిక్కరించెడి వారికి నాయకత్వము వహించినది. "వాడాదినుండియు నరహంతకు"డని క్రీస్తు నుడివిన మాటలు దీనికి వర్తించును జ్వా: 8: బహుశః తత్పూర్వమే ఆ సర్పము విశ్వసంక్షోభమును కలిగించియుండును. తత్ సందర్భమున మనికేయుల సిద్ధాంతము నంగీకరింప జాలము. సైతాను భగవత్ సమానుడు కాడు. అతడు భగవత్ సృష్టి. సర్వేశ్వరుడు అనుమతించిన మేర కతడు వ్యవహరించగలడు. సైతాను చేసిన చెడుగును భగవంతుడు చక్క పరచి విశ్వమందు అపూర్వ క్రమమును నెలకొల్ప గలడు. "నీవద్భుత రీతిని సృష్టించి మరింత అతిశయ విధమున పునరుద్ధరించితివి." ఎన్ని చెప్పినను జగచ్చరిత్రి మానవ సృష్టితో ప్రారంభము కాలేదని స్పష్టమగుచున్నది. ప్రప్రథమముగ దేవదూత లనదగు ఆధ్యాత్మిక జీవులు భగవంతుని పై తిరుగుబాటు చేసినవి. మానవుని సమ్మతిమూలమున (Com ici y) సైతాను 'లోకాధిపతి' కాగలిగెను. ఈ మాటలు క్రీస్తు నోట వెలుబడినవి. ఎడారిలో ఉగ్రతప మాచరించు క్రీస్తుస్వామిని గాంచి, విశ్వసామ్రాజ్యాధి పత్యమును ఆయనకు ఒప్పగించుదునని చెప్పి ఆ అబద్ధముల కోరు ఒక్కమారు సత్యము పలికినాడు. "ఇవియన్నియు నా వశముచేయ బడినవి, నా కిష్టమైన వారెవరికైనను వానిని నేనొసంగ గలను." లూ. : 6.

జగత్తునందు చెడుగును ఆమూలాగ్రముగ పెరి వేయుటకు క్రీస్తు ధైర్యసాహసములతో సైతాను పై పోరుసలిపెను. సువిశేషకారుడైన లూకా ( :2 ) వినియోగించిన 'సాయుధుడైన బలవంతుడు' అనుమాటలు క్రీస్తుకు వర్తించును. అతడు సైతాను దుర్గమును వశము చేసికొనును. క్రీస్తు లోకమునకు అవతరించి మానవజాతికి బోధచేసి వారి జాడ్యముల స్వస్థపరచి వారితో సహకరించుటయే గాక విశేషించి మానవులను సైతాను బారినుండి తప్పించుటకు యత్నించెను. "దుష్టునినుండి మమ్ము రక్షించు"డని పరలోక జపమందు వేడుకొనుచున్నాము. మత్తై ; 6 : . ఈ భీషణపోరాటమందు సైతానుకు పూర్ణవిజయము చేకూరినట్లును, క్రీస్తుకు సిలువపై పూర్ణాపజయము కలిగినట్లు లోకము భావించినను అది వాస్తవము కాదు. "ఇంతకు మునుపే లోక ప్రముఖునికి తీర్పు విధింపబడెను." జ్వా : : 1 "నాపై వానికేమియు అధికారములేదు." జ్వా : : 30. అని క్రీస్తు శంఖారవము చేసెను. అవిధేయతమూలమున సైతాను పురికొల్పిన విశ్వ సంక్షోభమును క్రీస్తు తన వినయ విధేయతల వలన చక్కబరచెను. ఆయన 'పునరుత్థానమే' దీని తార్కాణము. కాని లోకాంత పర్యంతము సైతాను పగసాధించుటకు యత్నించును. తత్కారణమున దివ్యసభ యుగముల తరబడి ఘోర హింసాకాండకు గురియగుచున్నది.

దైవీకసంస్థయగు తిరుసభపై విజృంభించిన దుష్టశక్తులు బలీయమైనవనియు శక్తివంతములనియు మరువరాదు.

అయినను అవి చేయగల చెడుగు పరిమితమైనది. ఈ సైతాను బలములు తమలక్ష్య సిద్ధికై మానవులను ప్రేరేపించుటయే గాక, భౌతిక ప్రపంచమును సహితము, వక్రమార్గముల పట్టించునట్లు తోచుచున్నది. తద్దానికి వలసిన సాధన సంపత్తియు లేక పోలేదు. కావున దివ్యసభ అప్రమత్తతతో పోరు సలిపి పైశాచికశక్తులను పారద్రోలవలసి యున్నది. సింహగర్జనలు చేయుచు సైతాను లోకమంతయు సంచరించు చున్నదని పవిత్రపత్రుడు నుడివిన మాటలను తిరుసభ దృష్టిలో నుంచుకొని విశ్వవ్యాప్తమైన యీ దుష్టశక్తులతో సంకుల సమరము జరుపుచునేయున్నది.

మధ్యయుగములందు పైశాచిక శక్తులు వింతవర్ణనలకు, అభూతకల్పనలకు గురియైనవి. తత్ఫలితముగా ఆధునికు లీ దుష్టశక్తులనుగూర్చి శంకించుటకు మొదలిడిరి. ఇక భగవంతుని అస్తిత్వమునుగూర్చి సందేహించువారు సైతాను శక్తియుక్తులనుగూర్చి అనుమానించక మానరు. అట్టితరి భగవత్ శక్తులకు, పైశాచిక బలములకు మధ్యగల తరనిపోరు వీరలకు దురూహ్యముకదా ఇక ప్రపంచములో మనము దినదినము గాంచెడి ఘోర అన్యాయములకు, అక్రమములకు, ఈర్ష్యాసూయలకు, దారుణకృత్యములకు, కేవలము మానవులే బాధ్యులనుట సబబుకాదు. సైతాను ప్రేరేపణలకు గురియై వానితో సహకరించెడువారు అనేకులు. క్రీస్తుకు, సైతానుకు మధ్య జరిగిన సంకుల సమరమునుండి మనము విశ్రమించలేము. అధికసంఖ్యాకులను వినాశనమొనర్చుటయె దుష్టశక్తుల కర్త

వ్యము. కావున, క్రైస్తవులు క్రీస్తుస్వామితో సహకరించ వలసిన బాధ్యత యెంతయు కలదు.

గతమందు జగద్గురువర్యులు పై నుదహరించిన అపాయములను మనదృష్టికి కొనివచ్చినారు. పరమపదించిన 2 వ భక్తినాథపోపు మహాశయులు తిరుసభను ప్రతిఘటించె. ఈ దుష్టశక్తుల నుద్దేశించి "భగవంతుని ద్వేషించి మానవ జాతికి దు రప్పించుటయే ప్రధానాశయముగాగల నరకశక్తుల మూలమున, యిట్టి దుస్సంఘటనలు జరుగుచున్న"వని నుడివినారు.

ఇంతవరకు దుకు సంబంధించిన సమస్యలు కొంత స్పష్టీకరించబడినను పరిష్కారము కాలేదు. చిత్తసంక్షోభము నివారించి ఆత శాంతిని శాశ్వతముగా చేకూర్చగల నిర్దిష్ట సమాధానమును గొప్ప మేధావులు సహితము కనుగొనజాలకున్నారు.

927 వ సం॥రము సు ప్రసిద్ధ తత్త్వవేత్త 'బెర్గ్సన్' (Bergson) దుఃఖ సంబంధించిన కొన్ని సమస్యలనుగూర్చి జాక్ షెవలియె ac ues C eva ier తో కొన్ని సంభాషణలు జరిపినాడు. వాని సారాంశమిది : "ఏదోకడు వ్యథల సమస్యను భగవత్ దృక్పథముతో పరి ంచినయెడల అది యెటుల పరిణమించునో యని తెలియగోరుచున్నాను. అప్పుడా సమస్య సమసిపోవును; కావున దానినిగూర్చి వాడిక శంకించ డనుకొందును. అయితే యీ సమస్యతో నింకను సతమతమగుచున్న సామాన్య వ్యక్తుల ప్రయోజనార్థము,

తద్దానిని స్పష్టీకరించుటకుగాను, యీ సమస్యనుగూర్చి తనకు గల పూర్వ అభిప్రాయమును, తాగడించిన భగవత్ దృక్ప థముతో సమన్వయపరచి, రెంటి గల భేదాభేదములను తెలియజెప్పుటకు సమర్థత యుండవలయునుకదా. ఇక, దైహిక, మానసిక బాధలన్నియు పరీక్షలని చెప్పబడుచున్నవి. కాని నా అంతరాత్మ కాదనుచున్నది. అయినను లోగడ నే నుదహరించిన భగవత్ దృక్పథమునుబట్టి చూచిన ఆక్షేపించలేను."

ఇచ్చట బెర్గ్సన్ విశ్వవ్యాప్తమైన ..డును గూర్చి ప్రస్తావించుచున్నాడు : "జీవితమునకు హేతువేమి ? నిరంతర వ్యథాభరిత జీవులుండుటకు కారణమేమి ? మానవుని విషయమందురా ? అవి వానికి భగవత్ సాక్షాత్కారానుభూతిని కలిగించును. ఇక ప్రాణుల విషయమేమిటి—అన్న సమస్యను జీవన్ముక్తుడు(Mystic) మనస్కరించడు. ఇకతత్త్వశాస్త్రవేత్త జీవుల అస్తిత్వమును అభినందించగల స్థాయికి రావలయునంటే తత్త్వశాస్త్రాతీతమైన జ్ఞానవెలుగును పొందవలయును. కేవలము జీవులుగానున్న పరిస్థితిలో మన విలువేమిటి ? అసలు జీవమువలని ప్రయోజనమేమి ? తనకు తానే యెరయుగుటయా? కేవలప్రాణులు దైవసాన్నిధ్యము చేరగల స్థాయికి రాజాలరు. దీనినే సృష్టివైచిత్ర్యమందురు. తద్దానికి హేతువు భగవంతుడని చెప్పవలసియున్నది. ఉదారత్వము వ్యథల సమస్యను, తద్దానికి సంబంధించిన విషయములను విప్లీకరించగలదు కాని యిది తత్త్వశాస్త్రజ్ఞులఅభిప్రాయము మాత్రమే.

చెడుగు పూర్తిగా అంతరించుటయే జీవన్ముక్తుని అభీష్టము. అఖండ శ్రేయమందు (Su reme Goo చెడుగొక భాగమై యుండిన బాగుండునని తలపోయును. కాని అది యెట్లో చెప్పజాలడు.

ఇదియే ప్రశ్నకు పూజె ( . ou et గురుపుంగవు డిచ్చిన సమాధానమిది. ఆయన ఈ సమస్యకు సంబంధించిన వాదోపవాదముల పేర్కొనినమీదట, సాంతములు అనంతములు కాలేవనియు, యిట్లే సృష్టిజాతములు భగవంతునితో సరితూగ వనియు, ఏతత్ జ్ఞానము సర్వమందు సహితము పరిమిత మనియు చెప్పినమీదట పై నుదహరించిన ప్రశ్న కిట్లు సమాధాన మిచ్చెను : "మానసిక బాధ లేకయే, దైహిక వ్యథలను అనుభవించవచ్చును. శారీరక యాతనలు మన శ్శాంతికి అవాంతరములు కాజాలవు. మానసిక వ్యథలు లేవనికాదు; కాని భగవంతుడు దయార్ద్రహృదయుడు. తన్మూలమున ఆయన దయాదాక్షిణ్యములు వెలుగొందు చున్నవి ... భగవంతుడు మహాశక్తినాత్ముడని భావిం చెదము ... ఆత్మశాంతి అన్నిటికంటెను గొప్పది. మనము ఆయన పాలన క్రింద నున్నామని మరువరాదు. నా చేతనైనది చేసి, శేషించినది ఆయన కర్పించుదును." "ఇక ప్రాణులనుభవించెడి బాధల విషయమేమి ? వాటి పెంపుదలకు మాంసాహారము అత్యావశ్యము. కాన ఒకదాని నొకటి బాధ పెట్టుట తటస్థించును. అంతమాత్రమున వాటి జీవితముపై వెగటు కలిగినదని చెప్పజాలము. అవి బాధలను పూర్తిగా

అనుభూతి చేయలేవు. తెలియనిరీతిని భరించును. మానవుని విషయ మట్టుల కాదు. వ్యధలు వాని స్మృతిపథములో మెదలుచు అనుక్షణము సంపూర్ణబాధను కలిగించును. ప్రాణుల బాధలు క్షణభంగురములు. బాధలమూలమున మానవుడు సమున్నతస్థాయి నందుకొనగల విశిష్టత అతనిలో కలదు…"

"జీవశక్తులు స్వయం వ్యాపనమునకై ప్రాకులాడు చుండును. ఏతత్ లక్ష్యసిద్ధికై ఇతరప్రాణులను వినియోగించును… …"

"భగవంతునికి విరోధముగా చేయబడు దుష్కృతములన్నియు సాంతములైనను (nite) వాని నిమిత్తము స్తు భగవదభీష్టానుసారముగ అర్పించిన ప్రాయశ్చిత్తము అనంతమైనది, అమూల్యమైనది… …"

పూజే గురువరేణ్యు డొసంగిన సమాధానమునకు, ముఖ్యముగా ప్రాణుల బాధల విషయమై చెప్పినదానికి బెర్గ్‌సన్ మహాశయుడు సంతృప్తిని కనబరచెను.

బెర్గ్‌సన్ పేర్కొనిన సమస్యలకు కార్మెల్ మఠాధికారిణి యిచ్చిన సమాధాన సారాంశ మిది: ఈ ఘోర సమస్యకు జీవన్ముక్తుడు (Mystic) సహితము బుద్ధిపూర్వకమైన సమాధానము నియ్యజాలడు. అతడు సూచించు పరిష్కృతి పరోక్షజ్ఞానముపై ఆధారపడియున్నది. అయినను అది సత్య విదూరముకాదు. ఏలయన భగవంతుని అనంత శక్త్యను రాగముల గూర్చియు, ఆయన సర్వమేలుల స్వరూపమును, సమున్నత విశ్వక్రమమును గూర్చియు, జీవన్ముక్తునికిగల

పరోక్షజ్ఞానము అపూర్వస్థాయికి చెందినది. ఇట్లతడు మేలుకు అంతిమ విజయము చేకూరగా ఏతత్ సమస్య పరిష్కారమగునని అనుభూతి చేయును... ..."పరమానంద భరితుడగు జీవన్ముక్తునికి బాధలు సుఖదాయకములగును. అనగా అవి పరిణామము చెందుచున్నవి. ఇక భగవదభీష్టానుసారముగా బాధల ననుభవించు సామాన్య క్రైస్తవుని కవి ఆనందదాయకములగును. అనగా అవి అపూర్వమార్పునకు గురియగుచున్నవి. తద్విషయమై వారికిగల నెరనమ్మిక, నిశ్చితానుభూతి, ప్రేమానురాగములు అద్వితీయములు. హేతువాదమున కిచ్చట వ్యవధి లేదు. దీనినిగూర్చి ఇంకెటుల చెప్పవలెనో తెలియకున్నది. భగవంతుని ప్రేమానురాగముల గూర్చియు, ఆయన సర్వ మేలుల స్వరూపమును గూర్చియు, వారికిగల దివ్యజ్ఞానము ( ntuitive know e e అపూర్వమైనది, హేతువాదమున క ·తమైనది. తన్మూలమున మనశ్శాంతి కలుగును. సంశయ నివారణమగును. శాంతిభద్రతలు చేకూరును." బెర్గ్‌సన్ ఈ ప్రశ్నోత్తరములకు ముగ్ధుడైపోయినాడు.

ఇంతకు వ్యధల సమస్య ఒక పరమ రహస్యముగా నుండక మానదు. అయినను సకల మేలుల స్వరూపియగు భగవంతుని అపార కరుణమూలమున అయ్యది పాక్షికముగ వెలుగొందించబడినది.

# వ అధ్యాయము

## డు - ఏతత్ భవితవ్యము

గతితార్కిక భౌతికవాదుల ప్రభావమువలన, ఈనాడు మానవులలో బహుసంఖ్యాకులు డునకు భవితవ్యము లేదని ఘంటాపథముగా చాటుచున్నారు. అనగా మానవ శ్రమ బాధలు త్వరలో అంతమొందగలవని వారల వాదము. తత్కారణమున ఈ వర్తమాన కాలమందు పీడిత ప్రజానీకము మహత్తర త్యాగము చేయుచున్నది. కష్టనిష్ఠురములను ఓర్మితో సహించుచున్నది. భీషణ పోరాటము సాగించుచున్నది. ఎందుకన మానవ వ్యవస్థకు అనుగుణమైన స్వేచ్ఛాస్వాతంత్ర్యములు, నీతి న్యాయములు, శాంతి సామరస్యములు, సర్వమానవ సౌభ్రాతృ సమానత్వములు త్వరలో నెలకొల్పబడగలవని వారి ని[illegible]. ఒక్కమాటలో సర్వము నిత్యకళ్యాణము, పచ్చతోరణములతో తులతూగెడి సుదినము రాగలదని వారి నెరనమ్మకము. ఇక, విజ్ఞానశాస్త్రాభ్యుదయముల మూలమున సమస్తజాడ్యములు సమసిపోవ, మానవులు పూర్ణారోగ్యవంతులై చిరకాలము మనగల రను ఆశాభావము చాల మందిలో పాతుకపోయినది.

తద్విషయమున క్రైస్తవులు అభ్యుదయకాములుకారని మార్క్సు అనుయాయులు ఆక్షేపించుదురు. పైబడి, వ్యథాభరితులకు భగవంతుడు మరులోకములో న్యాయము వగదెంచగలడను క్రైస్తవ సిద్ధాంతమును అవహేళనము చేయుదురు. కాబట్టి, వ్యథల భవితవ్యమును గూర్చి దివ్యసభ

ప్రబోధముల పరిశీలించుట మన ప్రస్తుత కర్తవ్యము. చెడుగు శాశ్వతముగా మనగలదనుట నిర్దిష్టమైన క్రైస్తవబోధ. పైశాచిక బలములు, పాపకర్ములు దేవునికి దూరమై నిత్య నరకాగ్నిలో కాలుదురనుట తథ్యము. శిక్షాదండనలు నైతిక విలువలను సమన్వయపరచి కొంత మేలు చేకూర్చినను, అవి దుతో కూడినవని చెప్పకతప్పదు. సుప్రసిద్ధ వేదశాస్త్రవేత్త యగు ఆరిజన్ (Ori en) ఈ విషయమును కాదని వాదించి నను దివ్యసభ ఆయన అభిప్రాయములతో ఏకీభవించినదికాదు.

అటులైన డువిషయమై మన యాశలన్నియు నిరర్థక ములా ? లేదు. మన నిరీక్షణా సమ్మకములు భగవంతుని వాగ్దానముపై నాధారపడియున్నవి. సచ్చిదానంద మూర్తి యగు భగవంతుని వెదకెడి వారికి సర్వ శ్రేయములు వనగూడు నని వేదము చాటుచున్నది. కావున తదన్యములన్నియు లేశ మాత్రములు. అంత్య దినమున వినూత్న లోకములు గోచర మగును. అనగా భౌతిక పదార్థము మహిమాన్వితమగును. విశ్వసృష్టి దివ్యజ్యోతులతో వెలుగొందును. ఆయనచే నెన్ను కొనబడినవారికి దుఃఖదురితములు దూరమైపోవును. భగ వంతుడు వారి అశ్రుకణములను తన హస్తముతో తుడిచి వేయును. వారనుభవించు నిత్యానందమును ఎవరును తీసి వేయజాలరు. సమస్తులు సంతృప్తి నొందుదురు.

ఇహలోకమున సహితము దేవగుణ ప్రసాదమూలమున భగవంతుడు మనకు స్వంతమగుచున్నాడు. ఆయన సహాయ్య వర ప్రసాదములు మనలో అనుక్షణము వెలుగొందుచున్నవి. ౦క, ఇహలౌకిక సుఖసౌఖ్యములు, పారలౌకిక సంతోషానంద

ములకు సూచన ప్రాయములు – ఇక్కడ మన మాయనను సాక్షికముగ అనుభూతిచేయగలుగుదుము. ఇప్పుడు మన సంతోషము సంపూర్ణమైనది కాదు. కాబట్టి వ్యధలకు వ్యవధి కలదని స్పష్టమగుచున్నది. క్రీస్తుస్వామి దీనిని గూర్చి ప్రస్తావించిరి. తనను అనుగమించ కాంక్షగలవారు తమ స్లీవను గైకొనవలయునని నుడివినారు. "జేసు క్రీస్తునందు పవిత్ర జీవము నెఱప నాసించువారందరు హింసలకు గురియగుదురు." అని పవిత్ర పౌలుడు నుడివెను. 2 తిమ : 3 : 2.

క్రైస్తవమతము ప్రబలిన ప్రదేశములందు బాధోపశమనము కొంతవరకు చేకూరును. ఆత్మవికాసమును, శాంతి సామరస్యములను, స్వాతంత్ర్యేచ్ఛలను ప్రసాదించు దివ్య సందేశ మది. పాపవిమోచన సంస్కారమువలన ప్రజల పెను భారములను తగ్గించును. మానవ సౌభ్రాతృత్వమును పెంపొందజేసి ఈర్ష్యాసూయలను రూపుమాపును. అయినను లోకముయొక్క పాపములను బొత్తుగా తొలిగించలేదు. భగవద్విశ్వాసము గొప్పగా వెలుగొందిన యుగములందు సహితము పరమ పాపులు జీవించిరి. పాపముతో సహా బాధలును పెంపొందును. భక్తులు పెంపొందుకొలది ఉగ్ర తపోనిష్టలు సహితము పెంపొందును.

క్రీస్తు తన శుభవార్త విశ్వవ్యాప్తముగా బోధింపబడునని వచించెను కాని సమస్త ప్రజలు హృదయ పరివర్తనను చెందుదురని చెప్పుటకు ఆధారములులేవు. వేరొకచో లోకాంత్యమున భగవద్విశ్వాసము సన్నగిల్లునని సూచించెను. "మనుష్యకుమారుడు తిరుగ వచ్చినపుడు ఆయన భూతలమును

పై భగవద్విశ్వాసమును కనుకొనగలడా ?" లూకా : 8 : 8.
"మనుష్యకుమారుడు విజయము చేయునపుడు సమస్తము నోయుని దినములలోవలె యుండును" మత్తే : 2 : 7.

లోకాంత్యమునకు పూర్వము పైశాచిక బలములు భగవత్ సేవకులపై సంకులసమరము సాగించి తమ శక్తి యుక్తుల వినియోగించి వారిని నాశనముచేయుటకు యత్నించునని 'అపోకలప్స్' గ్రంథము ఉద్ఘాటించుచున్నది. కావున ప్రళయకాలమువరకు బాధలు నిలచిపోవునని స్పష్టమగుచున్నది.

ప్రపంచము అంతరించెడివరకు మానవులు దారిద్ర్యము, అశుకణములు, భక్తిపారవశ్యము, దైవచిత్తాన్వేషణము, దయాదాక్షిణ్యములు, శాంతి సామరస్యముల సాధించుట మూలమున భూతలమున సుఖింపగలరు. మృత్యుంజయుడగు క్రీస్తుస్వామివలె మనము అంతిమదశలో యాతనలను జయింపగలము. అప్పుడు లోకము వినూత్నపరచబడి మహిమాన్వితమగును.

మనస్తత్త్వమును అనుసరించి క్రైస్తవుని దృక్పథము ఆశాజనకము, లేక నిరాశాజనకము కాగలదు. అయినను భగవత్ బోధలకు తలయొగ్గును. ఈ యనంత విశ్వమందు చెడుగునకు పరిమితమగు స్థానము లేకపోలేదు. ఇది భగవత్ సంకల్పము. సర్వజ్ఞుడైన భగవంతుడు మాత్రము చెడుగు మూలమున మేలు చేకూర్చగలడు. నిజాయితీగల క్రైస్తవ పౌరులకు లోకాంత్య పర్యంతము పోరు సలుపవలసిన బాధ్యత కలదు.

వ అ ధ్యా య ము

# వ్యధలకై సహాయత్తము

డు లేక వ్యధలమూలమున మనస్సాక్షికి సంబంధిం చిన పెక్కుసమస్య లుత్పన్న మగుచున్నవి. తద్వారా బాధ లను ఆహ్వానించుటయా లేక తృణీకరించుటయా అనునటు వంటి ప్రశ్న ఉదయించుచున్నది. మానవ జీవితములో ముడి వడియుండి యెన్నటికిని పూర్తిగా సమసిపోనటువంటి బాధ లను నివారించుట సమంజసమా? ఇట్లు వ్యధలను నిరాకరిం చుట దైవనిర్ణయమును పతిఘటించుట కాదా మానవా యా యమూల్యమైన సాధనసంపత్తిని జారవిడుచుట హాని కరము కాదా? ఇటువంటి చిక్కు ప్రశ్నలను పరిష్కరించు టకు పూర్వము జాగరూకతతో పరిశీలించవలసి యున్నది. ఆమీాదట సామాన్య సూత్రముల రెంటిని ప్రతిపాదింప వచ్చును. మొదట వ్యధలు వస్తుతః చేటుకరములు కాన, చెడుగును మన మెన్నడును వరింపరాదు. రెండవది వ్యధలకు సంబంధించిన చెడుగు సాపేక్షికము ( e ative vi ). పాప దోషమునకు సంబంధించిన డు అఖండమైనది (A so ute vi ). ఈ రెంటికిని సహా సభేద మున్నది. కాబట్టి సర్వజ్ఞు డైన భగవంతుడు కొన్ని యెడల బుద్ధిగతజీవులు సాపేక్షిక డులుమూలమున కొంత శ్రేయమును సాధించగలుగుదురు.

ఇక, వ్యధలకై సమాయత్తపడవలసినది యెట్లు వైరాగ్యము లేక విరక్తిమూలమున వ్యధలకై సంసిద్ధులము

కాగలము. అనగా రాగద్వేషములను విడనాడుట, సుఖాసుఖ ములను ఉపేక్షించుట ( n i rence) యని భావము.

ఆదిలో స్టోయికులు, ప్లటోనిస్టులు ఈ వైరాగ్యమును సాధింపపూనిరి. వారిదృష్టిలో వైరాగ్య మనగా తుచ్ఛవాసనలు, బాధలు లేకుండుటయని యర్థము (A at eia). కొందరు క్రైస్తవ మునిమాన్యులు కొలది సవరణలతో తత్ వైరాగ్యవిధానమును స్వర్గసాధనకు నాందిగా చేయబూనిరి.

పొంతుస్ పోరుడు, ఎవాగియుస్ మహాశయులీ వైరాగ్యస్థితిని (A at ieia) చక్కగా సిద్ధాంతీకరించినారు. "భగవత్ధ్యాన నిష్ఠాగరిష్ఠత ఆధ్యాత్మిక జీవితమునకు పరమావధియనియు, వైరాగ్యము తద్దానికి ప్రాతిపదిక యనియు నుడివినారు. మన అంతరాత్మ భగవత్ సాక్షాత్కారమును పొందవలెనంటే విషయానురాగముల బొత్తుగా పరిత్యజించి సమున్నతస్థాయి నందుకొనవలయును. విషయానురక్తికి హేతుభూతమైన తుచ్ఛవాసనలను, శరీరేచ్ఛలను అడంచిననే తప్ప ఆత్మలక్ష్యసిద్ధి పొందనేరదు. ఇక, తుచ్ఛవాసనలను సుగుణముల ద్వారా జయింపవలసియున్నది. సుగుణములను దివ్యజ్ఞానమూలమున నలవరచుకొనవలయును. దివ్యజ్ఞానము ప్రార్థనద్వారా లభించును. ప్రార్థనవలన కలిగెడు ఆత్మజ్యోతి దైవసాక్షాత్కారానుభూతికి మార్గ"మని ఆయన ప్రబోధించెను.

విరక్తిమూలమున రాగద్వేషములు సమసిపోగా ఆత్మ దైవప్రేమకు నిలయమగుచున్నది. అయ్యది పైశాచిక శోధనలను పూర్తిగా తొలగించలేక పోయినను, పరధ్యాసలేని

ప్రార్థన, ఆత్మవికాసము, స్వప్నమువంటి ప్రశాంతతలను ప్రసాదించగలము.

ఈ వైరాగ్య సిద్ధాంతమునకు పాశ్చాత్యు లంత ప్రాధాన్యత నియ్యలేదు. రాగద్వేషము (assions) లన్నియు చెడుగని వీరు భావించరు. భక్తజెరోము నుడివినట్లు శరీరేచ్ఛలను అన్నిటిని అణచివేయుటద్వారా, మానవుడు శిలావిగ్రహమైనను కావలయును; లేక భగవత్స్వరూపుడైనను కావలయును. అయినను మనము నిరర్థకములగు శ్రమబాధలకు దూరమై మనశ్శాంతిని, ఆత్మవికాసమును కాపాడుకొనవలసియున్నది. ఉద్రిక్త పరిస్థితులకు నెడమియ్యక, ప్రశాంతముగ నుండుట అవశ్యము. విశేషించి, యీ యాంత్రిక నాగరికత మూలముగ ప్రజాబాహుళ్యము చలనచిత్రములు కనులను మిఱుమిట్లు గొలిపెడి విద్యుద్దీపముల యొక్కయు దూరశ్రవణ యంత్రములు, అశ్లీల ప్రచురణలు, అసభ్య ప్రచారముల యొక్కయు దుష్ఫలితములకు గురియగుచున్నారు. మరియు మన జీవితములు సర్వసాధారణముగా బాధాక్రాంతమని మరువరాదు. ఇట్లు తలపోయుటద్వారా చిత్తభ్రమ, నిరాశా నిస్పృహాలకు దూరము కాగలము. భగవదభీష్టానుసారముగ వర్తించుటకు యత్నించుదుము. ఈ సందర్భమున మరియమాత పునీత బెర్నబెత్తతో నుడివిన వార్తలు కడు గమనార్హములు. "ఇహలోకమున నిన్ను నే సుఖపెట్టుదునని చెప్పజాలను. కాని పరలోకములో నీవు సుఖపడగలవు." భగవంతుని ప్రేమించి ఆయన చిత్తసంకల్పముల నెరవేర్చువాడు పారలౌకిక సుఖసౌఖ్యముల నిచ్చుటనే కొంత చవిచూడ

గలడు. భూతలముపై మనము సంపూర్ణ సుఖ మొందగలమని తలపోయుట వట్టి భ్రమ.

అయినను మనము అనావశ్యములైన విషయానురాగ ముల పరిత్యజించి, సాధనములు జీవితాశయములని తలపక, అనావశ్యములు అవశ్యములని పొరపడక ఆత్మవికాసము నార్జించుటకు యత్నింపవలయును. ఆంతరంగిక దారిద్ర్యమును అలవరచుకొనవలయును.

చివరన మనము ఇహలౌకిక జీవితమును పరమలక్ష్య మని భావింప తగదు. "నే చేయు పనికంటెను నా జీవితము అతి పవిత్రమని యెంచను" అని పవిత్ర పౌలుడు నుడివిన వార్తలగూర్చి తలపోయుదుము.

ఎన్ని చెప్పినను బాధలనుండి పూర్తి విముక్తి పొంద నేరము. అది వాంఛనీయమునహాకాదు. హానికరమగు బాధ లకు అనావశ్యమగు వ్యథలకు నెడమియ్యరాదు. మానవజీవిత ములో నెక్కువ శ్రమలు ఈ వర్గమునకు చెందినవని అనుభవ పూర్వకముగ తెలిసికొనగలము. ఇటువంటి నిరర్థకములగు ఆవేదనలకు భయాందోళనలకు దుఃఖదురితములకు దూరమై మెలగుట కడువివేకము మరియు సహేతుకము.

ఇంతమాత్రమున మనము యాతనిపట్ల కఠినాత్ములమై చరింపవలయునని భావముకాదు. మానవుడు శరీరాత్మల సమన్వితుడు కావున అతడు ఇహలౌక పారలౌకిక సరిహద్దుల యందు చరించుచున్నాడు. అసలు విషయానుభూతి లేకుండుట అతని స్వభావమునకే విరుద్ధము; జగత్కళ్యాణమునకు విశ్వ క్రమమునకు విఘాతము కల్పించుట యగును.

## ౫ అ ధ్యా య ము

# సోదర మానవుల బాధోపశమనము

వర్తమాన ప్రాపంచిక సమస్యలపట్ల మన కాసక్తి లేదనియు వ్యథాభరితులగు సోదర మానవుల నాదరించుట లేదనియు క్రైస్తవ మతేతరులు మనపై నేరారోపణ చేయుట కేవలము చరిత్రకే విరుద్ధము. నిజాయితీగల ప్రతి క్రైస్తవుడు, విశేషించి క్రైస్తవ భక్తాగ్రేసరులు దురవస్థయందున్న దీనుల నాదుకొనినట్లు యుగముల తరబడి మనకు ప్రబల నిదర్శనములున్నవి. "దయార్ద్రహృదయులు ధన్యులు; ఏల యన వారలు దయాదాక్షిణ్యములకు పాత్రులని క్రీస్తుచేసిన ప్రబోధములు సాక్షీభూతములు.

ఇక, దారిద్ర్య నివారణోద్యమమునకు అంతులేదు. తత్ సందర్భమున ప్యాగి పండితుడు ( eguy నుడివిన వార్తలు కడు గమనార్హములు : "మనమెంత చేసినను, ఏమి చేసినను, మనము చేసిన దానికంటెను ఎన్నియో రెట్లు పెరుగుచునేయున్నది. ఒక ప్రక్క చేయుచున్నచో వేరొక ప్రక్క విపరీతముగా పెంపొందుచున్నది. వ్యవసాయక్షేత్రము నొక దానిని దహించుటకు నిప్పురవ్వ చాలును. యేండ్ల తరబడి చేసిన పని మూలముగ ఆ క్షేత్రము చేకూరినది. విధ్వంసము చేయుట కడు సులువు. నెలల తరబడి పరిశ్రమించిన ఫలసాయము లభించును. విసుగు విరామము లేకుండ పని చేసిన మీదటనే అది ఫలించినది. దగ్ధము చేయుటకు ఒక

విస్ఫులింగము చాలును. ఇట్లే ఒకడు పెరిగి పెద్దవాడు కావలయునంటే యేండ్లు గడచును. అతని పోషణకు విశేషభోజన సామగ్రి అవశ్యము. ఇక పనిబాటులకు ఎడతెరపిలేదు. ఇట్లు ఎన్నియో విధముల శ్రమించిన మీదట అతడు పెంపొంద గలిగెను. ఇంతటి వ్యయప్రయాసలతో పోషించిన మనుష్యుని ఒక్క దెబ్బతో చంపవచ్చును.... ...ఒక అరక 0 యేండ్లు పనిచేయ వలసియున్నది. ఇక ఖడ్గము యీషణ్మాత్రమున తెగటార్చ బలవత్తరమగుచున్నది."

ఏది యెట్లున్నను, ప్రాపంచిక దారిద్ర్య నివారణా సమస్యను పరిష్కరించుట అవశ్యముకాదు. ప్రథమమున మనము దానిని అర్థము చేసికొనవలసి యున్నది. బాధలు అనివార్యమైనపుడు, బాధితుల దీనాలాపములకు చెవి యొగ్గి ఓర్మితో ఆల ంచుట మూలమున, వారి కొంత ఉపశాంతి చేకూర్చగలము. ఏలయన యిట్లు చేయుట ద్వారా మనమును వారి బాధలందు భాగస్వాములమై, వారియెడ ఆసక్తి చూపుచున్నామని వ్యక్తమగుచున్నది. పునీత మర్గరీత మరియమ్మకు ఒకానొకపుడు రెండు వేలికురుపులు (జట్టలు లేచి బాధపడిన విషయమును తన ఆత్మగాథలో పేర్కొనినది. అందు మొదటిదాని వలన, ఆమె దారుణ బాధల ననుభవించినది. రెండవదానిని ఒకరుకని సానుభూతిని ప్రదర్శింపగా ఆమెబాధ మరుగై పోయినది. ఇంకను, మన ప్రయత్నముల ద్విగుణీకృత మొనర్చి బాధోపశాంతికి తోడ్పడవలసి యున్నది. తద్విషయమున కడు వివేకముతో వర్తించవలసి

యున్నది. విద్యాభ్యాసమందు బాలుని సుశిక్షింపజేయుట సత్సేవ కాజాలదు. కాని సామాన్యముగా బాధల నివారణోద్యోగమందు పాల్గొనుట అవశ్యము. బాధోపశాంతికంటెను ఏతత్ కారణాంతరముల తొలగించుట కడు మేలు. నిరుద్యోగ నివారణకు తాత్కాలిక సహాయమును చేయుటకంటెను శాశ్వతముగా ఆ సమస్యను పరిష్కరించుట మేలుకదా నిరర్థకములగు దాన ధర్మములకై విస్తార ధనమును వ్యయపరచుట కంటెను నిష్టదారిద్ర్యులను బాగుపరచుట యెంతయు సబబు.

ఇటువంటి సూచనల నెన్నింటినైనను పేర్కొనవచ్చును. కాని మనము స్వబాధలకు తలయొగ్గినను సోదర మానవుల వ్యథలను గూర్చి విస్మరించుట, సమంజసము కాదని దృష్టియందుంచుకొనవలసినది.

# 7వ అధ్యాయము

## స్వబాధోపశమనము

స్వబాధోపశమన విషయమై, మనస్సాక్షి సంబంధిం చిన పెక్కు సమస్యలు ఉత్పన్నమగుచున్నవి. వ్యధలమూల మున మనకు కలుగు నిర్దిష్ట ప్రయోజనములగూర్చి యింతకు మునుపే తెలిసికొంటిమి. వైద్యశాస్త్ర పరిశోధనల ఫలితముగా బాధలను ఉపశమింప జేసెడు పెక్కు ఔషధములు లభించినవి. సుఖప్రసూతికి చికిత్స లేకపోలేదు. ఇక మత్తుమందు లనేక ములు కలవు. క్రైస్తవు లిట్టి సాధనములను ఎంతవరకు విని యోగించుకొనవచ్చు ననునది ప్రశ్న.

పవిత్ర స్మరణకు పాత్రులైన 2వ భక్తినాధ జగద్గురు వర్యులు తద్విషయమై పెక్కుమారులు చేసిన సూచన లివి: "వేదనలతో నీవు బిడ్డలను కనుదు"వను ఆదిశాపము ననుస రించి, స్త్రీలు ప్రసవవేదనలను భరింప బాధ్యులుకారా అని ప్రశ్నింపగా పోపు గురువర్యులు అట్టి బాధ్యత యేమియు లేదని నుడివిరి. పైబడి, ఆదిశాపమువలన మానవజాతి పతన మొందినను ప్రకృతిశక్తులపై మానవునికి ఆధిపత్యము కలద నియు, సృష్టిజాతములను తన ప్రయోజనార్థము వినియోగింప వచ్చుననియు, ఇట్లే ప్రకృతి ప్రసాదించు సాధన సంపత్తిని దైహిక బాధలను నివారించుటకు ప్రయోగించవచ్చుననియు ఉద్ఘాటించిరి. వేరొకమారు పోపుమహనీయులు దైహిక బాధల నివారణోద్దేశములగూర్చి యిట్లు ప్రస్తావించిరి. "ఈ

సందర్భమున పెక్కింటిని పేర్కొనవచ్చును. కాని వీటన్నిటి భావార్థము లేక తాత్పర్యము ఒకటియే. లోతుగా ఆలోచించిన యెడల బాధలు క్రమేణ మన శ్రేయస్సుకు ప్రతిబంధకములుగా పరిణమింపవచ్చును. కొన్ని యెడల మన ఉన్నతాశయములకు సహితము ముప్పు వాటిల్లవచ్చును. అయినను, కొన్ని పరిస్థితులందు కొందరి కవి అవశ్యమని చెప్పక తప్పదు. సామాన్యముగా మానవులు బాధలవలన కలుగు దుస్థితినుండి తప్పించుకొనుటకు యత్నించుదురు. ఇక మానవజాతి బాధలను సంపూర్తిగా తొలగించలేకపోయినను, వారి దుష్పరిణామములను కొంతవరకు అదుపాజ్ఞలలో నుంచగలుగును."

జగద్గురువర్యులు బాధోపశమనమువలన లభించు విశేష ప్రయోజనముల కొన్నిటిని పేర్కొనినారు. ఉదహారణకు, శస్త్రచికిత్స చేయుటకు పూర్వము వ్యాధిగ్రస్తుని బాధను నివారించి వానిని ప్రశాంత పరిస్థితిలో నుంచుట అవశ్యము కదా మన శరీరము బాధాకరమైనపుడు మనశ్శాంతి యుండనేరదు. ఆత్మశాంతి లేనియెడ యే పనికి పూనుకోలేము. భగవద్ధ్యానము చేయలేము. భగవదభీష్టమును నెరవేర్చలేము. క్షమాబుద్ధిని గోల్పోదుము. అగ్నిపరీక్షలకు గురియై నెగ్గలేము. ఉదారముగ పరిత్యాగము చేయలేము. కాబట్టి బాధోపశమనమునకై ఔషధములను తదితర వైద్యచికిత్సలను వినియోగింప వచ్చునని వారు నుడివినారు.

ఇక, మతము నిమిత్తము ఆత్మబలిదానము చేసిన త్యాగమూర్తులవలె మనమును పరీక్షాకాలమందు వ్యథలను

ఆలింగనము చేయవలయును. ధర్మసంస్థాపనార్థము సాంఘి కోద్ధరణకై బాధలను అనుభవించి తీరవలయును.

"ఇటీవల మనజీవితములో, ఆదర్శప్రాయులైన క్రైస్తవ భక్తాగ్రేసరులు అనేకులు భగవద్విశ్వాసమును పరిరక్షించుటకు వారములు, నెలలు, చివరకు యేండ్లతరబడి ఘోరయాతనకు గురియై, దివ్యసభచరిత్రకు మెఱుగులు దిద్దినారు" అని పోపు మునిమాన్యులు వేరొక సందర్భమున నుడివినారు.

# వ అ ధ్యా య ము

## అనివార్య బాధల యంగీకృతి

"క్రైస్తవుడు దినదినము సూర్యోదయము మొదలు సూర్యాస్తమయమువరకు భగవంతునిపట్ల, ప్రభుత్వము, తోటిమానవులు, జీవితోద్యోగములయెడ, తన విద్యుక్త ధర్మములను నెరవేర్చి, దీక్షతో ప్రార్థించి శక్తివంచనలేక పరిశ్రమించి, మమకారముల నడంచి సోదరమానవుల ప్రేమించి, స్వార్థమును పరిత్యజించి భగవదభీష్టమును ఉదారముగ నెరవేర్చిననాడు అతని జీవితము జగద్రక్షణకు లాంఛనమైన స్లీవయొక్క వెలుగునీడలలో నునుచున్న"దని పరమపదించిన 2వ భక్తినాథ జగద్గురువర్యులు ఉద్ఘాటించిరి. అనగా స్లీవయే సమస్తమునకు లక్ష్యమని వ్యక్తమగుచున్నది.

ప్రతి క్రైస్తవుని జీవితము అనివార్యమగు బాధ లనేకములకు గురియగుచున్నది. విశేషించి, ఆధునిక యుగమందు నాగరికులు సహితము భుక్తికొరకు విధిగా చేయవలసిన దైనిక పరిశ్రమ యెంతయు కలదు. మరియు పారిశ్రామిక యుత్పత్తికి గల ప్రాధాన్యత భగవత్ ధ్యానమునకు లేకున్నది. అయినను ఈ నవయుగ నాగరిక జీవితమం దెన్ని అవగుణములున్నను, దానిని మనము త్రోసిరాజనజాలము. కాబట్టి మనము ఒక యంత్రాగారమువలె కొంత యాంత్రిక జీవితమున తగుల్కొని యున్నాము. ఎంతచేసిన విరుగు తరుగులేని శ్రమ యిది. ఈ పనులను మన మెంత దీక్షతో చేసినను, సక్రమముగా

నిర్వర్తించినను, ఎంత నమ్మకముగా నెరవేర్చినను, కష్టములు మాత్రము తప్పవు. ఇక మనమెంత జాగరూకత వహించినను, బాధలనుండి పూర్తిగా తప్పించుకొనుట కష్టసాధ్యము.

కామ క్రోధ మదమాత్సర్యముల నడంచి నైతికముగా జీవించుటకు మనము చేయు ప్రయత్నము లన్నియు వ్యధా భరితములు. ధనాపేక్ష, కలుపుగోలుతనము పేరు ప్రతిష్ఠలకు ప్రాకులాడుచు భోగలాలసులై జీవించెడు ప్రజలమధ్యన జీవిత స్థాయి కనుగుణముగా సమగత సభ్యతలు వినయవిధేయత లను అలవరచుకొనుట బహు దుర్ఘటమైన విషయం. నేటి సాంఘిక జీవితమందుగల ఈ దుర్భర పరిస్థితులను గుర్తించ కుండుట ఆత్మవంచన కాగలదు. తత్ సందర్భమున కలిగెడి వియోగములు, విభాగములు, యాతనపరంపరలు విస్మరింప రానివి. బిడ్డలుపెరిగి పెద్దవారై తమ జీవితవిధానమును తాము నిర్ణయించుకొని గృహస్థ, బ్రహ్మచర్య వ్రతములు పూని ఎవరిమార్గమున వారు పోవునపుడు, సమిష్టి కుటుంబములు వ్యష్టి గృహములుగా తయారగుచున్నవి. చివరకు వృద్ధదంపతు లుండిపోగలరు. ఇక అకాల మరణములు, దురూహ్యమైన దీర్ఘవ్యాధులు, తరాలవరకు తలయెత్తని వంశపరంపరాగత ప్రలోపములు ఉన్నట్లుండి ప్రత్యక్షమగుట తటస్థించును. వేయేల, ఎవరికి తగిన స్లీవ వారి లేకపోలేదు. అది వారి చిత్తానుసారము కాకపోయినను, తమ శక్తికి మించినదిగా తోచినను, పెనుభారమై గోచరించినను, వెరువక భగవదను గ్రహ సహకార సాహాయ్యములతో మోయక తప్పదు.

వస్తుతః బాధలకు ఆధ్యాత్మికవిలువ లేదు కాని అవి భగవదభీష్టమని భావించి, సహనశీలతతో భరించినప్పు డవి యమూల్యములు కాగలవు. "సమస్త విషయములందు మనము భగవంతుని ప్రేమించి, సేవించుచున్నామని నిరూపించుటకు బాధల స్వీకార మొక గుర్తు. ఇట్టి సంపూర్ణ సంకల్పమే క్రైస్తవధీరోదాత్తతకు లాంఛన"మని రిశేషులైన 2వభక్తి నాథ జగద్గురువర్యులు నుడివిరి.

పూర్ణపరిత్యాగముకంటెను, వినయ విధేయతలు కడు ప్రేమ భాజకములు కావున, స్వయంకల్పితములైన వ్యధల కంటె సందర్భానుసారముగా ఆవిర్భవించిన బాధలను ఆలింగనము చేయుట కడు శ్రేయస్కరము. ఇట్టి బాధల స్వీకార మూలమున మానవుడు ఆధ్యాత్మిక సంపూర్ణత, సమగ్రతలను సాధించగలడు. "స్వపరిత్యాగమువలన భగవత్ సాన్నిధ్యమునకు పాదచారివై పోదువు. తదన్యములైన బాధలను స్వీకరించుటద్వారా అశ్వారాజముపై పోగల"వని ప్రాచీన భక్తిమార్గ ప్రదర్శకులు ఛలోక్తిగా చెప్పెడివారు.

## ప అ ధ్యా య ము

# స్వేచ్ఛాపూర్వకమైన వ్యధలు

నిజాయితీగల ప్రతి క్రైస్తవుడు భగవత్ సంకల్పితము లైన శ్రమబాధలను అనుభవించుటయేగాక స్వచ్ఛందమైన ఆత్మత్యాగమును సహితము అలవరచుకొనుట అవశ్యము. ఎవరైనను భగవత్ ప్రేమచే ప్రేరేపించబడి, తమ ఆత్మ పవిత్రీకరణము నిమిత్తము స్వయంసంకల్పితములైన బాధలకు గురియైన పక్షమున అట్టివారిని ఆక్షేపించుటయు భావ్యము కాదు. ఇక క్రైస్తవుడైనవాడు దివ్యమతోన్నతాశయములను, నైతిక విలువలను దృష్టిలో నుంచుకొని వ్యధలకై నిరీక్షించును కాని, స్వార్థపరత్వమునకు పేరు ప్రతిష్టలకు కాదు. విశేషించి తాననుభవించు శ్రమబాధల మూలమున తన యొక్కయు సోదర మానవులయొక్కయు పాపదోషములను పరిహరించుటయేగాక భక్తిమార్గమున దినదిన పురోగతి చెందగలడు.

“మన రక్షకుని యాతనా పరంపరాగత జీవితము భక్తాగ్రేసరులు గడిపిన వ్యధాభరిత చరిత్రలును, క్రైస్తవధీరోదాత్తతకు ప్రబల నిదర్శనములు. పైబడి యీ వర్తమాన కాలమున, మన కండ్లయెదుట ఎందరు స్లీవభారమును ప్రేమ పూర్వకముగా వహించుటలేదు ఇట్టి సాదృశ్యము లన్నియు వ్యధలలోని వేదరహస్యమును, మానవాత్మలరక్షణ ఉద్యమమందు వానికి గల ప్రాముఖ్యతను స్పష్టపరచుచున్న”వని

పరమపదించిన జగద్గురువర్యులగు 2 వ భక్తినాథపోపుగారు వర్ణించియున్నారు.

వ్యథలనుగూర్చి పైనుదహరించిన ప్రబోధనలు దివ్య సభ ఆధ్యాత్మిక జీవిత సాంప్రదాయములలో సుగోచరము లగుచున్నవి. క్రైస్తవభక్తులు త్యాగశీలతకు నిచ్చిన ప్రాముఖ్య తను ఒక్కమారు సింహావలోకనము గావించిన సదరు విషయ ములు సువిదితములగును. తపశ్చరణ విషయమున కొందరు విపరీత పోకడలకు గురియైనది వాస్తవము. కొన్ని యెడల తత్ విషయమై మనస్పర్థలు లేవని చెప్పజాలము. వక్రమార్గ మున బట్టిన తపోనిష్ఠలు ఆత్మశాంతిని కాని, ఆత్మవికాసమును కాని చేకూర్చలేవు. ఇక దైవసాక్షాత్కారము శూన్యము. అయినను భక్తాగ్రేసరు లనేకులు కఠోర తపమాచరించి, దైవ సాక్షాత్కారమును పొందగలిగి రనుట నిర్వివాదాంశము.

స్లీవపై వవేదనలో యున్న క్రీస్తుకు విషకలుషిత మగు ద్రాక్షరసమును త్రాగనిచ్చిరన్న సంఘటనను, పరమ పదించిన 2వ భక్తినాథ జగత్ గురువర్యులు పలుమారులు మన దృష్టికి కొనివచ్చిరి. ఈ మిశ్రమ పానీయము క్షత గాత్రు లకు చిత్తభ్రమ కల్పించి, బాధోపశమనమును చేకూర్చుటకై యుద్దేశించబడినది. తత్ సమయమున స్వామి దాని నందిం చిన వారియెడ అనురాగమును చూపుటకై చవిచూచెనే కాని పూర్తిగా త్రాగలేదు. ఏలయన ఆయన అనుభవించు మరణ వేదన తుదిగడియ లతి పవిత్రములు. బాధోపశమనము నకు అది సమయముకాదు. ఇట్లు తన్నుతాను సంపూర్తిగా

బలిదానము గావించు కొనెను. విస్తృతార్థముతో ప్రతి స్తువునికి ఏది వర్తించును. తన జీవితాంతిమ క్షణము లలో స్వామిని అనుకరించుట ఎంత వాంఛనీయము. ఒకవేళ శ్రమ నివారణకై అతడు మత్తుపదార్థములను స్వీకరించినను ఆక్షేపించవలసిన పనిలేదు. అయినను చరమ దశయందు స్తుస్వామి బాధలలో భాగస్వామి యగుట కడు ప్రశంస నీయము. తనమూలముగ అతనియందు ఒక దివ్యశక్తి ఉత్ప న్నమై భక్తిపారవశ్యము కలుగును. ప్రేమ అను వార్తలో వ్యథల సర్వస్వము నిండి నిబిడీకృతమైయున్నది. భగవంతుడు ఇహలోకమున వ్యథలకు వ్యవధికల్పించి తద్వారా మానవ పాపదోషముల మోచించి తనకడలేని ప్రేమాను రాగములను లోకమునకు చాటినాడు. బాధలకు అస్తిత్వము లేకపోయినను వానిని గాఢాలింగనముచేయుటద్వారా, మానవులు భగవత్ ప్రేమను సోదర ప్రేమను ప్రకటించుటకు పెక్కు సావకాశము లను పొందుచున్నారు.

# ఉపసంహారము

నేటి విశ్వ పరిస్థితులు తిలకించిన, దాని పురోగమనము పల్లెటూరి పామరులకు సహితము గోచరింపకమానదు. ఆర్థిక, రాజకీయ, ఖగోళ, రసాయన, భౌతిక, పరమాణు, వైద్య, సాంకేతిక శాస్త్రములలో విశ్వము త్వరితగతి పురోగమించు చున్నది. తత్ఫలితముగ మానవుని భౌతిక జీవితము కొంత సుఖవంతముగ సాగిపోవుచున్నది. కాని వాని ఆధ్యాత్మిక జీవితము దైహిక జీవితముతో పాటు సుఖవంతముగ జరిగిపోవుచున్నదని చెప్పజాలము. నానా జాతుల ప్రస్తుతపు పరిస్థితులను, వారు అనుభవించుచున్న కష్టములను, భయభీతులను, శాంతి లేములను, వ్యక్తుల స్వేచ్ఛారహితమును, పరికించినచో మానవుని జీవితము మొత్తముమీద పురోగమించుటకు బదులు తిరోగమించుచున్నదా యని; మానవుని ఆధ్యాత్మిక నైతిక జీవము కృశించిపోవుచున్నదా యని అనిపించును. సాంకేతిక శాస్త్రములలో అనేక దేశములు గొప్పగ పురోగమించుట గాంచుచున్నాము. కాని ప్రపంచములో నేడు శాంతి భద్రతలుగల రాజ్యమొకటి కానరాదు. దేశములలో శాంతి సమాధానములు అగుపడవు. ప్రజలలోను అవి మృగ్యముగ నున్నవి. తత్ఫలితముగ మానవులు — ఉన్నవారలు, లేనివారు, విజ్ఞానులు, విజ్ఞానరహితులు, విద్యావంతులు, విద్యలేనివారు, రాజకీయవేత్తలు, రాజకీయవేత్తలు కానివారు, పాలకులు, పాలితులందరు నానా బాధలనుభవించుచున్నారు. బాధలులేనివారి నొకరినీ గాంచలేము. ఇవి యంద

రిని వెన్నాడి వచ్చుచున్నవి. పుట్టినదిమొదలు మోక్షము జేరువరకు నీడవలె మనలను వెంబడించుచున్నవని అందరికి తెలిసిన విషయము. అవి మనస్సులందు సంక్షోభము కల్గించు చుండును. దుఃఖసమస్య ముడిని మనము విప్పకొనజాలక తిక మకలుపడి వానివలన పొందవలసిన మేలుకుబదులు అనేక పర్యాయములు బాధల నెక్కువజేసికొని మనోశాంతిని పూర్తిగ పోగొట్టుకొనుచున్నాము. దుఃఖ సమస్య మనల నెప్పుడును ఎదుర్కొనుచునే యుండును. కాని దానివలన ఎక్కువ బాధలకు గురికాకుండుటకు ప్రయాసపడుచు మేలు పొంద యత్నింపవలయును. దుఃఖ లనుభవించుచునే వాని మూలమున పొందవలసిన శ్రేయస్సును, తెలియని తనము వలన అనేకులు వృథాగా పోగొట్టుకొనుచున్నారు. కొందరు ఎక్కువపాపమునకు ఒడిగట్టుకొనుచున్నారు. ఇది విషాద కరము.

బాధలన్న ఎవరికిని ఇష్టములేదు. అవి మానవ స్వభా వమునకు కంటకముగ నున్నవి. ఐనను, దైవ పరిపాలనా విధా నములో వానికి స్థానము లేకుండ పోలేదు. దేవుని యుద్దే శ్యము కాదని మానవుడు తన స్వాతంత్ర్యమును దుర్వినియోగ పరచి లోకమున బాధలు ప్రవేశ పెట్టినను, దేవుని పరిపాల ననే నాశనము జేయ తలపెట్టినను భగవంతుడు వానిమూలము ననే మేలు చేకూర్చ సంకల్పించెను. జగద్రక్షకుడైన జేసు క్రీస్తువు రక్తము చిందబోసి—వెతల ననుభవించి లోకమును రక్షించెను. వెతల మూలముునను రక్షణ ఫలితము మానవు నికి లభించునటుల సంకల్పించెను. కాన బాధలలో భగవత్

స్వరమును వినదగును—హితకరమగు భగవద్వాక్యములను, హెచ్చరిక నొసంగు వాక్యములను, కృపారసముగల భగవద్వాక్యములను విననగును. బాధలమూలమున భగవంతుడు మానవుని జీవమును పవిత్రవంతముగను, ఉజ్జ్వల వంతముగను చేయ నిచ్ఛగించుచున్నాడు. అపాయకరమైన వక్రమార్గమున నడచుచున్న మానవుని సక్రమ మార్గమునకు పిలుచుచున్నాడు. ఈ లోకములోనే పాపపరిహారము చేయుటకు అవకాశ మిచ్చుచు బలము ఒసంగుచున్నాడు. ఇట్లు మానవునికి శ్రేయస్సు కలుగునట్లు చేయుచున్నాడు.

“అపరాధములను చేయువారిని నీవు మెల్లమెల్లన గద్దించుచున్నావు. వారు తమ దౌష్ట్యమువిడిచి ప్రభుడవైన నిన్ను నమ్ముకొనునట్లును తమ పాపములను తాము జ్ఞాపకమునకు తెచ్చుకొనునట్లును వారిని శిక్షించుచున్నావు.” జ్ఞానకాండము 12:2-6. “నా కుమారుడా ప్రభువు విధించు శిక్షను తృణీకరించకుము. ఆయన నిన్ను గద్దించినప్పుడు విసుగు జెందకుము. ప్రభువు తాను ప్రేమించువారిని శిక్షించి తాను దగ్గరతీసెడు ప్రతి కుమారుని దండించును, అని కుమారులతో సంభాషించునట్లు మీతో సంభాషించు ఆయన హెచ్చరికను “మరచితిరి” (హెబ్రీయులు 2:5-6 అను దైవవాక్యములలో గల పై పేర్కొనబడిన సత్యము అర్చశిష్ట పెద్ద, చిన్న తేరేజమ్మల, ఎలిజబేతమ్మల, కత్తరీనమ్మల, ఆగతమ్మల, ప్రాన్సీస్కమ్మల, మార్తీనమ్మల, మేరీ ఆఫ్ కొరటో నమ్మల, స్లీవఅర్లప్ప, దోమినిక్కు, ఇగ్నేషియుస్, ప్రాంసిస్సు,

అగస్టీనుల, దమియానుల, చిన్నప్ప రాయప్పలవంటి లక్షలాది స్త్రీ పురుషుల పవిత్ర జీవములో ప్రత్యక్ష మగుచున్నది.

కొన్ని దుల సమస్య విషయమై ప్రజలు కొంత మట్టుకైనను తెలిసికొన్న వారి ఆధ్యాత్మిక జీవమునకు శ్రేయోదాయకముగను బాధోపశమనదాయకముగ నుండునని కతోలిక తల్లిదండ్రులు తమ బిడ్డలను పెద్దలు తమ యాధీనములో నున్న వారిని చిన్నప్రాయమున నుండియే కష్టములు నెటుల సహించ వలసినది, తనూ్మలమున ఎట్లు మేలు పొందవలసినది నేర్చుకొనిరావలయునని, అట్లొనరించుట వలన తమ బిడ్డలకు గొప్ప మేలుచేసిన వారగుదురని, దుల సమస్యను గూర్చి వివరింపబడినది.

# బాధల సమస్య

ప్రపంచములో భయంకరమైన యుద్ధములు జరుగు చుండును. వాటి పర్యవసానముగా కొన్ని కోట్లమంది మను ష్యులు మరణించు చుందురు. లక్షల కొలది అంగహీను లగుదురు. ఈ అభాగ్యుల బంధుజనము వర్ణింపరాని మనో వేదనలకు గురియగుదురు. ఇంక నెందరో ఇల్లును వాకిలిలేక, యనాథలై యాకలి బాధచే మాడుచు, యన్నమో ప్రభూ యని యంగలార్చుదురు. దేవుడు సర్వశక్తి వంతుడైనచో యటువంటి భయంకర యుద్ధములు జరుగకుండ యెందుకు ఆపకూడదు ?

ప్రపంచంలో ననేకులు కుష్ఠు, క్షయ, పక్షవాతము, మొదలగు భయంకర వ్యాధులకు గురియగుచున్నారు. చాల మంది తల్లి గర్భము నుండియే కుంటిగనో, గుడ్డిగనో, చెవిటి గానో, మూగగనో జన్మించుచున్నారు. దేవుడు దయగల తండ్రియైనచో, వారి నావిధముగా పుట్టించుట యెందులకు ?

దుర్మార్గులు సుఖించుచుండ, సన్మార్గులు దుఃఖించు చున్నారు. పాపులు ధనవంతులగుచుండ, పుణ్యవంతులు పేద తనములో మగ్గుచున్నారు. దేవుడు న్యాయవంతుడైనచో యిటువంటి యన్యాయముల నెటుల సహింపగలడు ? ఇట్టి సమస్యలను గురించి తలంచని వ్యక్తి యుండడు.

లోకములో జన్మించు ప్రతి వ్యక్తి యెదుర్కొనవల సిన సమస్యలలో బాధల సమస్య యొకటి. మానవుడు తల్లి

ప్రసవ వేదనలలో జన్మించి, తన మరణవేదనతో గతించును. ఈ బాధల సమస్య ఉయ్యాలలో మొదలిడి సమాధిలో నంత్యమగుచున్నది.

బాధలు 'చెడుగు లేక డు' అను దానిలో నొక భాగము. లోకములో మంచి చెడుగులు గలవన్నది అందరెరిగిన సత్యము. దేవుడు యేమిలేమినుండి సర్వమును సృష్టించెను అనగా సర్వవస్తు సముదాయమునకు యునికి నిచ్చెను. దేవునిచే సృష్టింపబడిన సకల వస్తువులు మంచివే. ఈ విషయమును మరొక విధముగా జెప్ప వలెనన్న దేవుడు సృష్టించిన మంచికి ఉనికి గలదు.

'చెడు' అనునది యొక యునికి గాదు, ఉనికి లోపించడమే 'చెడు'. ఉదాహరణముగా, మనుష్యునకొక కాలు లేకపోవడము 'చెడు' యనబడును. కాలు యను ఉనికిలేక పోవడమే కుంటితన మను చెడు సంభవించుచున్నది. ఏమిలేమి నుండి సృష్టించుటలో దేవుడు ఉనికి నిచ్చెను గాని యునికి లోపించినందున గలుగు 'చెడు'ను తాను చేయడు. చెడునకెల్లపుడు కారకుడు మనుష్యుడే గాని దేవుడు మాత్రము గాజాలడు. ఈ యునికి లోపమునకు మానవు డేవిధముగా కారకుడగు చుండునో యీ క్రింది యుదాహరణము విశదము చేయును. శిల్పి పాల రాతిలో నొక చక్కని విగ్రహమును తయారుజేయుట కతనికి తన పనితనమునకు తోడు మెత్తని పాలరాయి, దానిని చెక్కుటకు సున్నితమైన పనిముట్లు గావలయును. సరియైన పాలరాయి లోపించినా,

సున్నితమైన పనిముట్లు లేకపోయినా, యెత డెంత గొప్పకళా కారుడైనను, చక్కటి విగ్రహమును చెక్కలేడు. అదేవిధముగా దేవుడు తన సృష్టి కార్యక్రమమునందు మానవుల నుపయోగించ చిత్తగించెను. మానవుల సృష్టిలో దేవుడు మనుష్యులను తనలో భాగస్వాములనుగా జేసికొనెను. తల్లి గర్భమున పిండమును చేయుటలో తల్లిదండ్రుల శుక్ల శోణితములను బిడ్డ శరీరమును జేయుటకు ఉపయోగించి, ఆత్మను తాను ప్రత్యేకముగా సృష్టించును. తల్లిదండ్రుల శుక్ల శోణితములు లోప భూయిష్ఠములైనచో బిడ్డ యవిటిగా నుండును. రక్తములో + . . భాజకముగల స్త్రీ, − . భాజకముగల పురుషునితో సంసారము చేసినపుడు నూటికి తొంబది తొమ్మిది పాళ్ళు చనిపోయిన బిడ్డ జన్మించుననియు, తల్లికి ప్రాణగండమని వైద్యశాస్త్రము తెలుపుచున్నది. సవామేహము (Sy i is) భయంకర వ్యాధితో బాధపడు స్త్రీ పురుషుల బిడ్డలు తరచు అంధులుగా జన్మించు చున్నటులగూడ వైద్య శాస్త్రము చెప్పుచున్నది. వీటినిబట్టి జూడ బిడ్డల యంగ వైకల్యమునకు కారణము మనుష్యులేగాని దేవుడు గాడని విదిత మగుచున్నది. జర్మను తట్టు అను వ్యాధి గర్భవతియగు స్త్రీకి వచ్చిన, ఆ స్త్రీ గర్భములోని బిడ్డ 99% గ్రుడ్డిగానో చెవిటి గానో, మూగగానో జన్మించును. ఇదే విధముగా సర్వబాధలకు ప్రథమ కారకుడు మానవుడేగాని దేవుడుగాదు.

'చెడు' అనునది రెండు విధములు. నైతిక సంబంధమైనది (Mora , శరీర సంబంధమైనది ( ysica . నీతి

సంబంధమైన చెడుగు పాపమనబడుచున్నది. శరీర సంబంధమైన చెడుగు బాధలు లేక కష్టము లనబడుచున్నది. పాపమను చెడును పరమేశ్వరు డెన్నడు ఏవిధముగాను జేయడు. దానికి సమ్మతించడు. పాపము జరుగకుండా నాపగల శక్తిగలిగియుండిగూడ మానవులు పాపము చేయకుండ నాటంకపరచడు. దానికి తాను నరులకిచ్చిన యమూల్య వరమగు "స్వేచ్ఛ"ను గౌరవించుటయే కారణము. మానవుడు స్వతంత్రముగా జీవించుచు, దేవుని దెలిసికొని సేవించి, ప్రేమించి, నిత్య జీవమును బొంది సుఖింపవలయునని నిఖిలేశుని నిర్ణయము. అట్టి తన నిర్ణయమును తాను భంగపరచడు.

శరీర సంబంధమైన 'దు' విషయములో దేవుడు స్వయముగా కారకుడు గాకపోయినను, మధ్యస్థ కారకుల ద్వారా కారకు డగుచున్నాడు. భగవంతుడు బాధలను పంపడు. అయినను ఇతరుల ద్వారా అవి సంభవించునప్పుడు అందుకు తాను సమ్మతించుచుండును.

బాధలసమస్య లోకములో పూర్తిగ మనస్సుకు తృప్తి నివ్వగల జవాబుకొరకు వెదకుట వ్యర్థమని నా తలంపు. బాధల సమస్యను పూర్తిగా పరిష్కరించడ మీలోకములో సాధ్యమగు కార్యముగాదు. కష్టములకు కారణము కనుగొని, వాటిని పరిష్కరించ వచ్చుననుకొనుట వృథా ప్రయాసము. ఇది దేవునిలో దాగిన దివ్య రహస్యము. ఆ రహస్యమును పూర్తిగా దెలుపుటకు ఆతడు చిత్తగించలేదు. అయినను అటువంటి దివ్య రహస్యములను గురించి యాలోచించడము జ్ఞానవంతుల లక్షణము.

మానవజాతి కడగండ్లకు కారణము వారి పరిమితము గల స్వభావమని వాదించవచ్చును. ఆది అంత్యము లేనిది దేవస్వభావము మాత్రమే దేవుడు మానవుని పరిమితి స్వభావము గలవానినిగా మాత్రమే సృష్టించగలడు. దేవ స్వభావము తప్ప యితరమేదియు నాది యంత్యములు లేనిదిగా నుండుటకు వీలులేదు. ఎందుకనిన యపరిమితమైన రెండు యునికిలుండుట విరుద్ధము. wo in ni e eings is a contra-iction.

దేవుడారంభములో ఆదాము ఏవలను సృష్టించినప్పుడు వారికి పరిమిత స్వభావమిచ్చి గూడ బాధలు లేకుండా జేయగూడదా ? మానవ శరీరము కృ నశించుట లోను, బాధలకు శీఘ్రగాహియైన మెదడు గలిగియుండుటలోను మానవునికి పరిమిత స్వభావము గలదు. ఆ విధముగా శరీరము క్రుళ్ళకుండా, మెదడు బాధలకు శీఘ్రగాహి గాకుండా సృష్టించ గూడదా యని ప్రశ్నించవచ్చును.

దేవు డారంభములో ఆదాము యేవలను పరిమిత స్వభావులుగా సృష్టించి, వారి స్వభావ సిద్ధముగాని యితర వరములతో వారిని పూరించిరి. మొదట మానవుని జ్ఞానము పరిమితమైనదైనను, ఉన్నంతలో పూర్తిగా నుండెను. దేనినిగూడ యతడనుభవము ద్వారా తర్కించి కనుగొనవలసిన యవసరములేదు. సుఖముగా జీవించుట కవసరమైన జ్ఞానమును దేవుడతని కిచ్చెను.

మానవుని యుపయోగార్థము సృష్టింపబ న చేతనా చేతన వస్తుసముదాయ మంతయు నతని యదుపులో నుంచ బడెను. విషసర్పములు, క్రూరమృగములు, పిడుగులు, తుపానులు, మొదలగు ప్రకృతి సహజ శక్తు లతనిని అంటుటకు వీలులేదు. సర్వమున కతడు సార్వభౌముడు.

మానవ శరీరము సహజ స్వభావముద్వారా క్షీ నశించ వలయును ; కాని మరణమున కాహుతిగాకుండా వర మిచ్చినారు. "జీవుల నిర్మూలించుట దేవున కానందముగాదు" W S. . 3). మానవున కాత్మశరీరముల నిచ్చి, యవి యెల్లప్పుడేకమై యుండుటకే దేవుడు సృష్టించెను. ఆవిధముగా నుంచుటకు, మానవ సహజ జీవమునకు తోడు దాని క ంత మైన జ్ఞానజీవము (Su er-natura ) గూడ నిచ్చెను. ఈ జ్ఞాన జీవమును బొందుటకు మనుష్యుల కెటువంటి హక్కులేదు. అది దేవునిచే నుచితముగా నివ్వబడినది. ఈ జ్ఞానజీవము ద్వారా నరుడు దేవునికి మా త్రమే లోబడి సృష్టి నంతటిని యేక ధాటిగా పాలించుచుండెను.

మానవ జాతికి మూల పురుషుడైన-మావన జాతి ప్రతినిధి ఆదాము ఏవలా స్థితియం దెంత కాలముండిరో మనకు తెలియదుగాని కొంత కాలమైన పిదప వారు గర్వాంధకారులైరి. తాము గూడ దేవునివలె నుండవలయునని యాసించిరి. దేవుని యాజ్ఞను ధిక్కరించిరి. నిఖిలేశుని యాజ్ఞను ధిక్కరించుటకు వారికి స్వేచ్ఛగలదు గాని పర్యవసానము విర్ణయించుటకు వారికి స్వేచ్ఛలేదు. వారల

ధిక్కారఫలితము తమకు, తమ సంతతికి నలవిగాని, వర్ణింపరాని, యంత్యములేనిబాధలను తెచ్చిపెట్టినది. జ్ఞానజీవము వారినుండి దీసివేయబడినది. మానవ సహజ జీవము మాత్రమే మిగిలినది. ఎప్పుడైతే మానవుడు మనుజేశ్వరున కెదురు దిరిగి "నేను విధేయించను" యని రొమ్ము విరచినాడో, యప్పుడే మిగతా సృష్టియంతయు "నేను నీకు సేవజేయను" యని మానవుని ధిక్కరించినది. మానవుని యాత్మ కివ్వబడిన దివ్య శక్తులు-విశ్వాసము నమ్మిక దేవ ప్రేమ-నశించినవి. ఆత్మ యదుపులో యుండవలసిన శరీరముగూడ మానవుని యదు పులో నుండి తప్పుకొని యాత్మపై తిరుగుబాటు చేయ మొద లిడినది. ఆదాము శృంగార వనమునుండి వెళ్ళగొట్ట బడెను. మానవు డప్పుడు తన పాపఫలితముగా నల్లకల్లోలమై, కిరాత కత్వ మొంది యతని యదుపునుండి విడిపోయిన లోకములో జీవించుట కెడ తెరిపి లేకుండా పోరాడవలసి వచ్చెను.

ఆదాము మానవ జాతికి మూల పురుషుడైనందు వలన తాను జేసిన పాపమువలన తనకు తన సంతతికి జ్ఞానజీవమే గాకుండ, యితర దివ్యవరము లన్నిటిని పోగొట్టు కొనుటకు కారణ మాయెను. మానవుని గ్రహణశక్తి ( eason) యంధకార బంధురమైనది. మనసు (Wi ) బలహీనమైనది. ఎల్లప్పు డతసి శరీరము యొక్క పశువాంఛలవైపే మొగ్గుచు, మృగ సమాను డయ్యెను. పాపము కట్టుకొనక ముందు పర మేశ్వరు నన్నిటికన్న యధికముగా ప్రేమించిన మానవుడు, పాపముచేసిన వెనుక తనను తాను దేవుని కంటె నధికముగా

ప్రేమించుకొని స్వార్థపరుడయ్యెను. మానవుని ఈ స్వార్థ పరత్వమే లోకములోని యిడుమ లన్నిటికి కారణము. భాగ్యవంతుల స్వార్థపరత్వమే పేదల యాకలిమంటలకు కారణము. మానవుని యవివేకమైన ధనాపేక్షకు గౌరవముపై కాంక్ష పదవుల కొరకు పాకులాట మొదలుగాగల లోక సుఖ సౌఖ్యములను అనుభవించుటకు మానవునికి గల పేరాసయే కారణమని మనము కనుగొనుచున్నాము. ఈ స్వార్థము వలననే మానవుడు మోసగించు చున్నాడు. అన్యాయ వడ్డీలద్వారా, అక్రమముల ద్వారా ధనార్జన జేయుటకు కారణము స్వార్థమే. పదవీవాంఛచే యితరుల మంచిపేరును, గౌరవ మర్యాదలను నాశనము జేయుటకుగూడ మానవుని స్వార్థమే కారణము. ప్రతి యక్రమమునకు దాని బాధకు మానవుని స్వార్థమే కారణమని రుజువు చేయవచ్చును.

దేవుడు సర్వజ్ఞాని గావున, ఆదాము తన యాజ్ఞను మీరునని దాని ఫలితముగా మానవజాతి మెనలేని యిడుమల పాలగునని ఆతనికి ముందే తెలిసియుండునుగదా అటువంటప్పు డాదామునకు బదులు అర్చ జోజప్పగారివంటిన్యాయవంతుని, ఏవకు బదులు కన్య మరియమ్మవంటి స్త్రీ రత్నమును సృష్టించినచో మానవజాతి నీ బాధలనుండి కాపాడియుండవచ్చునే యని ప్రశ్నించవచ్చును.

కష్టసుఖములు కర్మఫలితములని హిందూమత సిద్ధాంతము బోధించుచున్నది. ఈ నమ్మకమునే హిందూమతమునకు చెందని యితరులుగూడ గలిగియున్నారు. క్రీస్తుభగవాను

డీ లోకములో బోధించు దినములం దొకసారి గ్రుడ్డివా డొకడు ప్రభువును సమీపించెను. ఆ సమయమున వెంటనున్న శిష్యులు "వీడు అంధుడుగా జన్మించుట కెవరు పాపముజేసిరి? వీడా లేక వీని తల్లిదండ్రులా ?" ( o n 9. 2) యని ప్రశ్నించిరి. దీనినిబట్టి జూడ, జూదులయందుగూడ కష్టసుఖములు కర్మఫలితములందును నమ్మక మున్నట్లు గోచరించుచున్నది.

ఎవరెవరి కష్టసుఖములు వారివారి కర్మఫలితములైన పసిపాపలు చనిపోవు టెందుకు? దుర్మార్గు లకాలమరణ మొందవలయును గాని, సన్మార్గులు నిండు యవ్వనములో మృత్యువాత బడు టెందుకు? దుష్టులకు భయంకర వ్యాధులైన కుష్టు, క్షయ, పోలియోలు రావలయును గాని యుత్తముల కెందు వ్యాధులు సంభవించవలయును లోకారంభమునుండి, భౌతికశాస్త్రములో నెంతో ముందంజవేసి, స్వర్ణయుగమని పేరొందిన ఇరువదియవ శతాబ్దములోగూడ కష్టములు వైదొలగలేదు. ఇదేవిధముగా లోకాంత్యమువరకుండును. బాధ లెందుకని ప్రజలు ప్రశ్నించుచునేయుందురు.

బాధ లెందుకు ప్రభూ? యని భక్తుడైన జోబుడు తన కష్టపరంపరలకు తట్టుకొనలేక యెన్నో శతాబ్దముల కితమే దేవుని నడిగెను. ఆ ప్రశ్నకు జవాబుగూడ ప్రశ్నల ద్వారానే పరమేశ్వరు డిచ్చెను. "నేను నీకు ప్రశ్న వేయుదును. నీవు దానిని నాకు తెలియజెప్పుము. నేను భూమికి పునాదులు వేసినప్పుడు నీ వెక్కడ నుంటివి? నీకు వివేకము గలిగియున్న జెప్పుము. నీకు దెలిసినయెడల దాని పరిమాణమును నియమించిన దెవరో జెప్పుము. దానిమీద పరిమాణపు

కొలత వేసినవా డెవడో చెప్పుము. దాని స్తంభముల పాదులు దేనితో గట్టబడినవో జెప్పుము. ఉదయ నక్షత్రములు ఏక ముగా పాడినప్పుడు, దేవదూత లందరును దేవతనయు లందరు ఆనందించి జయజయధ్వనులు సినప్పుడు దాని మూలరాతిని వేసినవా డెవడు? సముద్రము దాని గర్భము నుండి పొర్లిరాగా తలుపులచేత దానిని మూసినవా డెవడు? నేను మేఘమును దానికి వస్త్రముగాను, గాఢాంధకారమును దానికి పొత్తు గుడ్డగాను వేసినప్పుడు నీవుంటివా దానికి సరిహద్దు నియమించి, దానికి అడ్డగడియలను, తలుపులును పెట్టించినప్పుడు – నీవు ఇంతవరకేగాని మరి దగ్గరకు రాకూడ దని యిక్కడనే నీ తరంగముల పొంగు ఆపబడునని నేను చెప్పినప్పుడు నీవుంటివా? అరుణోదయము భూమి దిగంత ముల వరకు వ్యాపించునట్లును, అది దుష్టులను తనలో నుండ కుండ దులిపివేయునట్లును నీ వెప్పుడైన ఉదయమును కలుగ జేసితివా? అరుణోదయమునకు దాని స్థలముచు నీకు దెలి యునా?... సముద్రపు వూటలలోనికి నీవు చొచ్చితివా? మహాసముద్రము అడుగున నీవు సంచరించితివా? మరణ ద్వారములు నీకు దెలియునా?... వెలుగు నివసించు చోటుకు పోవు మార్గమేది? చీకటి యునికిపట్టేది?... ఆక్షేపణలు జేయ జూచువాడు సర్వశక్తుడగు దేవునితో వాదింపవచ్చునా? దేవునితో వాదించువా డిప్పుడు ప్రత్యుత్తర మివ్వవలెను. (జోబు 8+ 9 అధ్యాయములు). ఈ ప్రశ్నలద్వారా మానవ జ్ఞాన మెంత యల్పమో దివ్యజ్ఞాన మెంత యపారమో యని దేవుడు తెలియపరచెను. ప్రకృతియందున్న రహస్య

ముల గ్రహింపలేని మానవుడు దేవుని రహస్య మార్గములు, మహిమల నెట్లు గ్రహింపగలడు ? బాధల కారణమును మనుష్యుడు తన స్వల్పబుద్ధితో గ్రహించలేడు. దేవుడు తన దివ్య జ్ఞానముతో జూచి, కష్టములను దుఃఖముల నుపయోగించి జూచి లోకమును తన దివ్యచిత్త ప్రకారము నడుపుచుండును. దేవుడు మేలు డులను సరియైన విధముగా నుపయోగించుచుండును'' అని మహాజ్ఞానియైన అగుస్తీను నుడివెను.

ఉత్తములు బాధ లనుభవించుట కనేక కారణము లున్నవి. ఆ కారణము లన్నింటిని మనము పరిశుద్ధ గ్రంథములో జూడవచ్చును. లోకము క్రమబద్ధముగాను, నియమిత చట్టబద్ధముగా సృష్టించబడుట యొక కారణము. "దేవుడు తన సూర్యుని దుర్మార్గులపైన, సన్మార్గులపైన సమానముగా ప్రకాశింపజేయును. న్యాయస్థులపైన, అన్యాయస్థులపైన తన వర్షమును కురిపించును." అందుచే దుర్మార్గులు, సన్మార్గులు కారణ ఫలితములకు విధేయించవలయును. మంచివాడు చెడ్డవాడు యొకే విధమైన పరిస్థితులయందొక యంటు జాడ్యము తగిలిన వ్యక్తిని సమీపించిన యిద్దరు యే భేదము లేకుండానే యా వ్యాధికి గురియగుదురు. దుర్జనుడు, సజ్జనుడొక యెత్తైన ప్రదేశమునుండి క్రిందబడిన యిద్దరికి సమానముగానే దెబ్బలు తగులును. కాని కష్టము లనుభవించు దుర్మార్గులందు లేని విశ్వాసము, ధైర్యము, ఆత్మబలము సన్మార్గులం దుండును. అందుచే వారు దుష్టులవలె కష్టములకు దాసులై కృంగి కృశించక బాధలను జయించి సమాధానముగా జీవించి యందరి మన్ననల నందుకొందురు.

మంచివారి మంచి గుణములకు తోడు ఇతర యవసర మైన గుణములు లేకపోవు టుత్తముల బాధలకు మరియొక కారణము. ఈ విషయమును గురించి క్రీస్తుభగవానుడు రెండు వేల సంవత్సరముల క్రితము హెచ్చరించెను. అన్యాయ సేవ కుని సామెతను జెప్పుచు, తన యనుచరులకు దేవునిపై చల నము లేని విశ్వాసము, నమ్మకమునకు తోడు దూరదృష్టి యుండవలయునని చెప్పిరి. ఆత్మశుద్ధికి తోడు కష్టజీవులను కమ్మనిరి. "సర్పములవలె తెలివిగల వారుగా నుండి, పావు రమువలె సాధువులుగా నుండుడి" ( . 6. -8). మనము ఎంత మంచివారమైనను, కష్టించి పని జేయనియెడల, పనిజేసి సంపాదించిన దానిలో కొంత ముందుకాలమునకు వెనుకవేసి కొనని యెడల పేదరికం తప్పదు. అందుచే జీవితపు ఒడు దుడుకులను తగ్గించుకొనుటకు మంచితనము సరిపోదు. దానికి తోడు ముందుచూపు, వివేకము, జ్ఞాన ముండవలయును.

దైవలక్షణములైన ప్రేమ, శాంతము, దయ, కనిక రము మొదలగు గుణములు మానవునియందు కలిగించి, పాప ములవలన పతనమైన మానవజాతి నుద్ధరించ దేవుడు సంక ల్పించుకొనుట, మంచివారు బాధ లనుభవించుటకు మరి యొక కారణము. కష్టములు లేని జీవితము యాంత్రికము, మృగ సమానము. దుర్మార్గులే బాధ లనుభవించి, సన్మా ర్గులు సుఖపడుచుండిన యెడల మానవ హృదయములు బండ బారిపోయి, కనికర రహితమైపోవును. పాపులే వెతలపాలైన "అది వారికి తగిన శిక్ష. యెవరికర్మ వాడిని కొట్టును, యెవరు జేసికొన్నది వా రనుభవించవద్దా? ఎవడు తప్పుకొన్న

గోతిలో వారు పడుదురు." అని నీతులు బలుకుదురు. అవే శ్రమలు సుమంతులకు సంభవించినపుడు "అయ్యో పాపము, భగవంతుడా యెందుకా సజ్జనులకా కష్టములు"యని కనికరించి చేతనైనంత సహాయము చేయుదురు. రాచపుండ్లు దుర్మార్గులకే పుట్టినచో ఆ జబ్బు రాకుండా యిన్ని శ్రమలుబడి యిన్ని ఆధునిక చికిత్సా పరికరములు ఔషధములు కనిపెట్టబడి యుండునా ? కుష్ఠు, క్షయ, క్యాన్సరు రోగములకే గలిగిన వారిని బాగు చేయుటకిన్ని యీ శ్రమములు నిర్మించబడియుండునా ? ఇంత మంది కన్యాకామణులు వారి సేవకై ముందంజ వేయుదురా ? కష్టములు, వ్యాధులు ఉత్తములకు రాకుండా, దుష్టులకు మాత్రమే వచ్చియున్న యెడల యిన్నికోట్ల ధనము ఖర్చు జేసి వైద్యశాలలు నిర్మించబడవు. వేన వేలమంది తమ జీవితముల నీ ఔషధములను, ఉపకరణములను కనిపెట్టుటకు ధార బోసి యుండరు. మొదట దేవుడు పరిమితమైన మానవత్వ మును సృష్టించి దాని కేకొరత లేకుండ సంపూర్ణమైన ( er ect దానినిగా జేసెను. అటువంటి కొరతలేని సంపూర్ణమైన మానవత్వమును మానవుడు పాపము జేసి అల్లకల్లోల పరచెను. కిరాతకత్వము లోకములో జొరబడెను. అటువంటి కిరాతకత్వమునుండి అల్లకల్లోలమునుండి భూలోకమును తిరుగా బాగుపరచుటకు ఉత్తముల కష్టములను భగవాను డుపయోగించు చుండును. లోకములో నిప్పుడు మానవ యుపయోగార్థము గనిపెట్టబడిన విజ్ఞానశాస్త్రములు, విద్యలు, సాధనము లన్నియు రక్తము వడని కష్టించు నుత్తముల బాధల పర్యవసానమని జెప్పవలయును.

కష్టముల నేవిధముగా నుపయోగించి ఫలితము పొంద వలయును ? 1957 సం॥ రము అక్టోబరు 7 వ, తారీఖున జగద్గురువగు 2 వ భక్తినాథ పోపుగారు వ్యాధిగ్రస్తులను, వికలాంగులను కు స్తరించుచు "లోక మొక పెద్ద కర్మాగారము. కర్మాగారములో సాంకేతికశాస్త్రజ్ఞులు, యంత్రముల నడుపు వారు, యంత్రముల పొందుపరచువారు, కూలీలు మొదలగు వేరువేరు వారు గలసి పనిజేయుటకు నియమించ బడినటుల, భూగోళ కార్ఖానాలోగూడా భాగ్యవంతులు, పేదలు, ఆరో గ్యవంతులు, అనారోగ్యులు, కష్టించువారు, సుఖించు వారను వేరువేరు తరహా మనుష్యులను దేవుడు నియమించి వారి ద్వారా లోకమును తన దివ్యచిత్త ప్రకారము నడుపు చున్నాడు." అని నుడివిరి. అంతేకాదు మరియు కష్టజీవుల గొప్పతనమును పొగడుచు పరిశుద్ధతండ్రిగారు "వీరందరిలో శ్రమ లనుభవించువారు జేయుపని యతి ముఖ్యమైనది. మహా పరిశుద్ధ త్రియేక దేవుని రెండవ వ్యక్తియైన సుతుడైన సర్వే శ్వరుడు మానవాళిని రక్షించుట లోకమునకు రెండవ ఆదాముగా అనగా రక్షించబడిన వారికి మూల పురుషుడు గా వచ్చి, మానవరక్షణ కార్యమును తన రక్తబలి ద్వారా, నెరవేర్చ సంకల్పించిరి. మరియు తన శ్రమలను ఉత్తముల శ్రమలతో పూర్తిజేయ సంకల్పించిరి. అందుచే బాధలొందు యుత్తములు తమ బాధలను క్రీస్తునాథుని బాధలతో జేర్చి దేవునికి సంతోషముగా సమర్పించిన వారి కష్టముల ఫలితముగా నంధకారములో చిక్కుకొని యున్నవారికి వెలుగు నియ్య గలరు. అన్యులు సత్య సభలో జేరుదురు. పతితులు, తప్పిపో

యినవారు తిరుగా సత్యమార్గమును కనుగొందురు. ఆత్మలు రక్షించబడి దరి జేరును" యని యొదార్చిరి.

లోకములో నందరు రాజులుగాని, పోపులుగాని, ప్రతియొక్కరు బాధ లనుభవింపవలసి యుండును. ఆదాము దేవుడిచ్చిన యమూల్యమైన స్వేచ్ఛను దైవ చిత్తమునకు వ్యతిరేకముగా వినియోగించి పాపమును గట్టుకొని తనకు, తన సంతతికి మరణము, మరణపు సంకటములను దెచ్చి పెట్టెను. ప్రశాంతముగా నున్న మానవత్వమునందు సంక్షోభమును కలిగించెను. సుఖమునకు బదులు బాధలు, సంతోషమునకు మారుగా దుఃఖము, జీవమున్న చోట మరణమును చేకూర్చెను. ఈ బాధలనుండి ఫలితమును బొందుటకు, విశ్వాసముతో ధైర్యముతో, ఆత్మబలముతో వాటి నెదుర్కొని దేవ ప్రేమ కొరకు యనుభవించుటయే యుత్తమ మార్గము.

జీవితము ఒడుదుడుకులతో నిండి నప్పుడు వాటిలో దేవ నిర్ణయమును జూచి వలివేతు వనములో రక్తము చిందుచు ప్రభువు ప్రార్థించినటుల "పితా నాయిష్ట ప్రకారము గాదు, మీ చిత్త ప్రకారము జరుగునుగాక" ( . 22. 2) యని ప్రార్థించవలెను. పాస్క యాదివారమునకు ముందు పవిత్ర శుక్రవారము వచ్చిన దనియు, రక్షకుని దివ్య శరీరము మహామహిమ ప్రతాపములతో లేచుటకు ముందు రక్తముచే, వుమి నీటిచే తడిసి, దుమ్ము ధూళిచే కప్పబడినదని జ్ఞాపక ముంచుకొనవలెను. పవిత్ర శుక్రవారము లేనిది పాస్క ఆది వారము లేదు. దుఃఖములను ధైర్యముగా నెదుర్కొని లోక కళ్యాణము కొరకు వాటి నుపయోగించి సార్థక జీవులమగుటకు

ప్రయత్నించ వలయును. అట్టివారికే తృప్తి, మనశ్శాంతి, సమాధానము—లోకములో, పరలోకములో నిత్య బహుమానమును లభించును.

శరీర సంకటములను సహించలేని పిరికిపందలు యెంత యధోగతి పాలగుదురో దెలుపుటకు అర్చ్య, అగు స్తీను వారొక మంచి సంఘటనను గురించి వ్రాసిరి.

క్రైస్తవు డొకడు తన యింటి నెన్నడూ శుభ్ర పరచక మురికి కూపముగా నుంచినందున ఆ యింటియందు దోమ కాటున కంతము లేకుండెను. ఈగ లెల్లప్పుడు జుమ్మని మోతబెట్టు చుండెడివి. దోమకాటునకు, యీగల మోతకు తాళలేక నతడు చాల విసుగుగానున్న యొక దినమున "మంచికి కారణకర్త దేవుడు. చెడుగునకు కారణము సైతాను" డను తప్పుడు సిద్ధాంతమును నమ్మి బోధించు మనిక్కేయ పతిత తెగకు జెందిన వ్యక్తి యొకడా క్రైస్తవుని యింటికి వచ్చెను. అప్పుడా క్రైస్తవుని విసుగు, యశాంతిని గమనించి, తన సిద్ధాంతమును బోధించుట కది మంచి యదనని గ్రహించి "మనుష్యులకు యిటువంటి బాధను గలిగించు దోమలను, ఈగలను ఈశ్వరుడు సృష్టించినాడా" యని ప్రశ్నించెను. మానవుని కిటువంటి యశాంతిని గల్గించు దోమలను, ఈగలను సర్వ సద్గుణుడైన సర్వేశ్వరుడు చేసి యుండుననుట కిష్టము లేక వాటిని దేవుడు సృష్టించ లేదని జవాబు చెప్పెను.

మనిక్కేయ : ఇంత స్వల్ప శ్రమల నిచ్చు దోమలను, ఈగలను దేవుడు గలిగించ లేదన్నావు. నీవు జెప్పినది నిజము.

మరి మనుష్యులను చంపు క్రూరజంతువులను, విషసర్పముల నెవరు గలిగించిరి?

_ : నిస్సందేహముగా "ఓ, యట్టి భయంకర జీవులను గలి గించినది తప్పక సైతానుడే అయియుండవలెను."

మనిక్క్యం : సెబాష్ చక్కటి జవాబు. ఇంకొక విష యము : క్రూరజంతువులకంటె, విషసర్పములకంటె మనుష్యు డింక నధిక క్రూరముగా ప్రవర్తించుచున్నాడు. ఒకసారి లోకమును పారజూడుము. యెటువంటి భయంకర యుద్ధములు జరుగు చున్నవో వాటియందు యెందరు మానవులు హత మగుచున్నారో యీ హత్యాకాండ యంతటికి కారణమైన కిరాతక, క్రూర స్వభావముగల మానవుని దేవుడు సృష్టిం చెనా? _ : దుర్మార్గమైన దుండగములనుజేయు దౌర్భా గ్యుడైన మానవుని దయాపరుడైన దేవుడు జేసియుండడని తలంచి "దుర్మార్గులైన మానవులను దేవుడు సృష్టించి యుండడు. అటువంటివారి సృష్టికర్త సైతానుడై యుండవల యును" అని జవాబిచ్చెను.

ఆ _స్తుపుడు, మానవుని సృష్టికర్త దేవుడు గాదను నంతటి యధోగతికి జారుటకు, కొంచెము దోమకాటునకు సహించలేకపోవుటయే కారణమని తోచుచున్నది.

ప్రతివ్యక్తి పాపిగాని, పావనుడుగాని బాధలద్వారానే తనను తాను రక్షించుకొని మోక్షము జేరవలయును. బాధలు మోక్షమునకు గొనిపోవు సోపానములు. నీ లోన, నీ వెలుపల నీ పైన, నీ ంద, నీ ప్రక్కన, యే దిక్కునో యొక దిక్కున బాధలు నిన్ను వెంటాడుచునే యుండును. వాటిని సంతో

షముతో యనుభవించినచో అవి నిన్ను బాధా రహిత స్థల
మైన పరలోక రాజ్యమునకు దీసికొనిపోవును. దేవుని ప్రేమ
కొరకు ఓర్పుతో ననుభవించు ప్రతి బాధకు, పరలోకమున
బహుమానము లభించును. ఈ విషయము సత్యమని ఋజువు
పరచుటకు అర్చ్బి ష్ సో ఫ్రోనియస్ చే వ్రాయబడి, నైసియను
సాధారణ సంఘముచే నామోదించబడిన ఆధ్యాత్మికారా
మము (S iritua ] ea ow) యను గ్రంథమునందొక
మంచి సంఘటన వ్రాయబడినది.

"మహాతపశ్శాలి యొకడు తన గుడారమును నీటికి
చాల దూరములో నిర్మించుకొని, ప్రతిదినము మంచినీటి
కొరకు బోవుటలో నతడు పడు శ్రమను దేవప్రేమ కొరకు
అప్పగించుచుండెను. అటుల చాల యేండ్లు గడచినవి. ముసలి
ప్రాయము పైబడినది. శరీరములోని సత్తువ ఉడిగినది,
అయినా తన దినచర్యలలో నే భేదము లేకుండా జేయుచుండెను.
ఒకనాడు ఎండ తీవ్రముగా నుండుటచే సొలసిపోయి, తెలివితప్పి
మార్గములో మూర్ఛిల్లెను. కొంతసేపటికి తెప్పరిల్లి "నేనింత
దూరము ప్రతిదిన మెందుకు శ్రమపడి నడువవలయును? దగ్గ
రలో నాగుడారము నిర్మించుకున్న నీ బాధ లుండవు గదా"
యని దలంచెను. తలంచడమే గాదు, ఆ విధముగా జేయు
టకు నిర్ణయించుకొనెను. తరువాత ప్రక్కనే పడియున్న
మంచినీటి పాత్రను దీసికొని నీటిబుగ్గ వైపు నడువ మొద
లిడెను. అతడు నడచు నప్పు డాతని యడుగులను లెక్కించు
చున్నా డాయను నటుల వెనుకనుండి, యొకటి, రెండు,
మూడు యని లెక్కించుట వినిపించినది, ఎవరా యీ నిర్జన

ప్రదేశములో తన యడుగులు లెక్కించుచున్నదని వెనుదిరిగి చూచెను; గాని యెవరును కనిపించలేదు. తను భ్రమపడినట్లు తలంచి తిరుగా ముందుకు సాగిపోగానే మరలా వెనుకటి వలెనే లెక్కించుట వినెను. అది వినగానే యా తపస్వి వెను దిరిగి చూచెను. అతని యెదుట అందమైన రూపములో సింహబలుడైన వ్యక్తి యొకడు నిలుచుండి "నేను దేవుని దూతను. నీవు యీ మార్గములో దేవ ప్రేమకొరకు అప్ప గించుచు వేయు ప్రతియడుగును లెక్కించు చున్నాను. దేవ ప్రేమకొరకు ఓర్పుతో ననుభవించు ప్రతిశ్రమకు, పరలోక ములో బహుమాన ' మున్నది." యని పలికి యదృశ్యు డయ్యెను.

బాధల నోర్పుతో సహించుటకు మరియొక కారణము : వాటిద్వారా మన పాపములకు రాదగిన యనిత్య శిక్షను తొలగించుకొనవచ్చును. "మనకు వచ్చు కష్టనష్టముల నోర్పుతో సహించి, పాప పరిహారార్థము అర్పించిన దేవుడు దయతో వాటి నంగీకరించును" అని ఠెంటు మహాసభ బోధించు చున్నది. మన మందరము పాపులమే. "ఎవడైనా తన దగ్గర యే పాపము లేదనిన వాడబద్ధికుడు" అని జ్వానెన్నెసు గారు చెప్పినారు. మనము చేసిన ప్రతిపాపమునకు శిక్ష యనుభ వించ వలయును. పాపులను మరు లోకములో శిక్షించు నప్పుడు దేవుడు న్యాయాధిపతిగా శిక్షించును. అప్పుడతని శిక్ష కోపాగ్నితో గూడినదై వర్ణింప రానిదిగాను, భరించుటకు వీలు లేనిదిగా నుండును. దాని మారుగా అదే శిక్షను దేవు డీ లోకమునందు పంపునప్పుడు దయగల తండ్రిగా

నుండును. అందుచే పాపములకు రాదగిన యనిత్యశిక్ష నీ లోకములో ననుభవించుట బుద్ధిమంతుల లక్షణము. కావున సహజ శక్తులద్వారా, మానవ శక్తికి నలవిగాని పరిస్థితుల ద్వారా వచ్చు పంట నష్టములు, కరువు, కాటకములు, అతివృష్టి, అనావృష్టి, వరదల బీభత్సములు, వ్యాపార నష్టములు, అవమానములు, తలవంపులు, వ్యాధులు, మరణాలు వచ్చినప్పుడు, మొరబెట్టక, యవి మనముజేసిన పాపములకు పరిహారము చెల్లించుటకు మన తండ్రియైన దేవుడు ప్రేమతో పంపిన అవకాశము లని తలంచి యనుభవించిన మరు లోకములో మనకు రాబోవు శిక్ష యిక్కడే గడచి పోవుచున్నదని తెలియుటచే ఆత్మకు తృప్తి, సమాధానము గలుగును.

ఎవడైనా పై జెప్పబడిన కారణములు బాధ లనుభవించుటకు సరిపోవని తలంచిన యటువంటివాడు కపాలకొండ నెక్కి- స్లీవవద్ద నిర్జీవమైన తన ప్రియ తనయుని శరీరమును ఒడిలో బెట్టుకొని విలపించు మాతృమూర్తిని చూడవలయును. మానవుడు తన శరీర కష్టములను గురించి వాపోవుటకు ముందు ప్రాణహీనమై, చీల్చివేయ బడియున్న యా దివ్య శరీరము నందుగల భయంకర గాయములను గురించి ధ్యానింపవలయును. మన కష్టములకంటె, ఆ రక్షకు డెంతో కఠోర బాధల ననుభవించిరని యాదృశ్యము మనకు స్పష్టము చేయును.

ఎవడైనా తన మనోవేదనలు భరింపరానివని తలంచుటకు ముందు, ఆ స్వామి తలచుట్టు, తలపైన ముండ్లకిరీటము వలన గలిగిన పెద్ద గాయములను గురించి ధ్యానింపవలయును.

నీకంటె ఆ ప్రభువు ఎంతో అధిక మనోవేదన ననుభవించెనని, యని సాక్ష్యము బలుకుటలేదా ఎవడైనను తనకున్న యంటు వ్యాధి కారణముగ, తన దగ్గరకు నెవ్వరిని రానివ్వనపుడు, అందరు తనను చేయివిడిచినారని బాధ పడుటకు ముందు భూమ్యాకాశములకు మధ్యన యొక మ్రానిపై కొరతవేయ బడి యిటు మనుష్యులచే నటు దేవునిచే చేయి విడువబడి, నా దేవుడా నా దేవుడా నన్నేల చేయి విడిచితిరి, యని పలుకు ప్రభువును గూర్చి ధ్యానించవలయును.

"మనము జేసునాథుని జ్ఞాన శరీరముయొక్క యవ యవములై యున్నాము. క్రీస్తునాథు డాజ్ఞానశరీరముయొక్క శిరసు. శరీరములోని యొక అవయవమునకు గలుగు బాధల నితర అంగము లన్నియు ననుభవించును. అటులనే జ్ఞానశరీర తలయైన జేసువుయొక్క బాధలను అవయవములైన మానవ సంతతి కొద్దిగా నైనను అనుభవించవలయును" అని అర్చ్య బెర్నార్డుగారు చెప్పిరి.

దేవుని దెలిసికొని, సేవించి, ప్రేమించి, మోక్షము జేరి చిరకాలము సుఖ మనుభవించుటకే మానవుడు సృష్టింప బడెను. మానవజాతి కొరకు మ్రానిపై కొరత వేయబడిన ప్రభువుని ప్రేమించడమే మోక్షము జేరుటకు సులభమార్గము. బాధ లనుభవించువారు, తాముగూడ ప్రభువువలె బాధ లను భవించుచున్నామని గ్రహించినప్పుడు, రక్షకునిపై ప్రేమ వారియందధికమగును. ఆ ప్రేమ ఫలితముగా తమ పాపములు పరిహరింపబడి మోక్షరాజ్యమునకు వారసులగుదురు. కష్ట ములు మోక్షరాజ్యమునకు వెళ్ళు యిరుకు మార్గము. లోక

సుఖసౌఖ్యములు, భాగ్యభోగ్యములు మోక్షమార్గమునకు ప్రక్కన నాటబడిన గుర్తురాళ్ళు. మార్గమును మార్గముగాను గుర్తురాళ్ళను గుర్తురాళ్లుగా గుర్తించి మోక్షమువైపు పయనించు వారీలోకములో తృప్తిగా జీవించి అంత్యమున స్వర్గ రాజ్యమును జేరి సుఖించుదురు. కాని యనేకులు యిరుకు మార్గమున నడుచుట కిష్టపడక, త్రోవ ప్రక్కననున్న గుర్తు రాళ్లైన సుఖ సౌఖ్యములను, భాగ్యభోగ్యములనే మోక్షమని తలంచి, యింతకంటె ఇతర మోక్షమేదీ లేదని వాటిచుట్టూ తమ గుడారముల నిర్మించుకొందురు. అనగా కష్టముల యవ సరమును గుర్తించక, యీ లోకసౌభాగ్యములే తమ సర్వస్వ మనియు, శాశ్వత మైనటుల వాటికొరకే పాకులాడుచు అధోగతి పొలగుచున్నారు. ఈ లోకసుఖ సౌఖ్యములు, భాగ్య భోగ్యములు మానవుని తృప్తిపరచలేవు. మన పంచేంద్రి యములను తృప్తి పరచునట్టి డాంబిక గౌరవములు, శరీరము లను క్రొవ్వునటుల జేయు భోగభాగ్యముల కొరకు ప్రాకు లాడుట బుద్ధితక్కువ పని యని భగవంతు డనేక సారులు తన ప్రవక్తలద్వారా తన సేవకుల ద్వారా దేవుడు బోధించిరి; గాని మానవులు వారి సుబోధనల నాలకించలేదు. అందుచే తానే రెండువేల సంవత్సరముల క్రితము యీ లోకమునకు వచ్చి తన జీవితమునే యుదాహరణముగా నిచ్చి బోధించిరి.

దేవుడు పశువులగాటిలో జన్మించిరి. చెట్టుపై కొరత వేయబడి మరణించిరి. పరుల సమాధిలో భూస్థాపితము చేయ బడిరి. సర్వ లోకములను యేమి లేమినుండి సృష్టించి కాపాడు చున్న ఈశ్వరుడు—ఆకాశపక్షులకు గూళ్ళుగలవు; నక్కలకు

బోరియలు గలవు గాని మనుష్య కుమారునకు తలదాచుకొను టకు స్థలము లేదను నంతటి పేదరికము ననుభవించిరి. అంద రిచే తృణీకరించ బడిరి. కఠోరబాధ లనుభవించి హీన మర ణము నొందిరి. తన పేదతనము ద్వారా పేదరికము యొక్క ఘనతను బోధించిరి. "మనో దారిద్ర్యముగల మీరు ధన్యులు; ఎందుకనిన పరలోకరాజ్యము మీది. ఆకలి గొనుచున్నవారు ధన్యులు. ఎందుకనిన వారు తృప్తినొందుదురు." (లూ. 6 : 20-2 ) ఇతరులచే తృణీకరించబడి, ద్వేషించబడి లోక గౌర వముల, పదవులయొక్క యేమి లేమితనమును గురించి తెలియ పరచినారు. "ఏడ్చెడివారు ధన్యులు. ఎందుకనిన వారు సంతోషించుదురు. మనుష్యులు మిమ్ము నా నిమిత్తము ద్వేషించి వెలివేసి నిందించిన, మీరు ధన్యులు; యెందుకనిన మీరు సంతోషించి గంతులు వేయు దురు. "పరలోకములో మీ బహుమానము గొప్పదై యుండును." (లూ 6. 22-2 ) ప్రభువు తన కఠోర బాధల ద్వారా, యీ లోకమున మనుష్యులకు వచ్చుకష్టముల కేదో ముఖ్యమైన కారణ మున్నదని జూపిరి. "ధనవంతులారా, మీరు కోరిన యాదరణ మీరు పొందియున్నారు. ఇప్పుడు కడుపు నిండినవారా, మీరాకలి గొందురు. ఇప్పుడు నవ్వు చున్న వారలు దుఃఖించుదురు." (లూ 6 : 2 , 25. 26

కష్టము లనుభవించుట సులభముగాదు. మానవుడు తన స్వంత శక్తితో బాధ లనుభవించజాలడు. ఆ కరుణా కరునిపై ప్రేమ కొరకు కష్టము లనుభవించ నాశించు వారికి, దేవుడే దివ్యశక్తి నిచ్చును. మానవు డెంత తక్కువగా

తనను తాను ప్రేమించుకొనునో, యంత నధికముగా దేవుని ప్రేమించును. దేవుని నెంత యధికముగా ప్రేమించునో యంత సుఖించును. తుదను యేసు జయపతాకమునకు జోహారులు చెప్పుచు ముగించుదము.

ఈ భూలోకమునకు రక్షణానందమును

పరలోకమునుండి కొనివచ్చిన ఓ స్లీవ పతాకమా!
మానవుల రక్షణ జలయూట యైన ఓ స్లీవ పతాకమా
నరక పిశాచులను పరాజితులను గావించిన ఓ స్లీవ పతాకమా
వ్యాధిగ్రస్తులను స్వస్థత పరచు ఓ స్లీవ పతాకమా
దుఃఖితులను కుస్తరించు ఓ స్లీవ పతాకమా
కల్మషులను పవిత్ర పరచు ఓ స్లీవ పతాకమా
మందమతులకు చురుకుదనము నిచ్చు ఓ స్లీవ పతాకమా
అహంకారులను దీనులనుగ జేయు ఓ స్లీవ పతాకమా
కఠిన హృదయముల ద్రవింపజేయు ఓ స్లీవ పతాకమా

నీ వే మా వందన శతంబు.

నీ భక్తులందరు నిన్నుగాంచి కన్నీరు నించుచున్నారు. ఓ జయపతాకమా రక్షణకు మార్గము నీవు తప్ప వేరొకటి లేదు. నీవు మాత్రమే సురక్షితమైన మార్గము. మోక్షమును [illegible]రిన పుణ్యాత్ము లందరు నీ మార్గమున పోయినవారే పవిత్ర జీవితము జీవింప దలచిన వారందరు నీ మార్గమున నడుచు వా[illegible] నీకు మా శత నమస్కృతులు.

---